# చతుర సమీక్ష



ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.

2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.

3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.

4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- చొప్పున; మరో మూడింటికి రూ. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాశక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

---------- కూపన్ ----------

**మే చతుర నవల తూర్పు - పడమర**

సమీక్షకుని పేరు : ..............................

చిరునామా : ..............................

..............................

..............................

..............................

# రచయితలకు సూచనలు



ప్రచురించే ప్రతి నవలకు రు. 2,000/- పారితోషికం అందజేస్తున్న 'చతుర' లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే. వైవిధ్య పూరిత ఇతివృత్తాలతో, ఆసక్తికర రచనా సంవిధానంతో పాఠకులను ఆకట్టుకో గల నవలలకు వేదిక 'చతుర'.

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, చతుర కథలు, చతుర ప్రపంచం వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. "చతుర"లో అచ్చులో ఒక పేజీలో సుమారుగా 350 పదాలు వస్తున్నాయి. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచటంగాని, తగ్గించటంగాని ఉండదుగనుక నవలలన్నీ సరిగా ఈ సైజుకు సరిపడేలా, మొత్తంమీద 35వేల పదాలకు తక్కువకాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో వారివారి దస్తూరీని బట్టి, ఒక పేజీకి ఎన్నిపదాలు వస్తున్నాయనే దానినిబట్టి మొత్తం నవల ఎన్ని పేజీలు ఉండాలనేది ప్లాన్‌వేసుకోవటం అవసరం.

★ ఈ లెక్క ప్రకారం "చతుర" కొరకై ప్రత్యేకంగా రాసిన నవలలు మాత్రమే పరిశీలనార్హాలవుతాయి.

★ నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసివచ్చే పక్షంలో, అందుకు అభ్యంతరంలేనివారే తమ నవలలను పంపించాలి.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు త్రిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత ఉండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది.

★ పారితోషికం ఏ నెల చతురలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలో పంపబడు తుంది.

ఎడిటర్

**చతుర**

'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482



# 'అమృత బిందువు'పై సమీక్షలు

మార్చి 'చతుర'లో ప్రచురితమైన దంతుర్తి చినరామచంద్రరావు నవల 'అమృత బిందువు' పై మాకు అందిన సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాం.

## అమృతబిందువే!

ప్రథమ బహుమతి రూ.100/-లు
పొందిన సమీక్ష

అభ్యుదయభావాలుగల మధ్యతరగతికి చెందిన యువకునికి నేటి సమాజంలో ఎదురయ్యే అనుభవాలను వాస్తవానికి దగ్గరగా చిత్రీకరించడంలో దంతుర్తి చినరామచంద్రరావు తన 'అమృతబిందువు' నవలలో కృతకృత్యుడయ్యాడు. నేటికాలంలో ఆడపిల్లల వివాహాలు చేయాలంటే ఎంత కష్టమో ప్రకాశరావు, శారదమ్మల పాత్రల ద్వారా వివరించారు. పెళ్ళిచూపులపేరిట ఆడపిల్లలకు జరుగుతున్న శల్యపరీక్షల తంతును రచయిత సహజంగా చిత్రించారు. నేటి పరిస్థితుల్లో వ్యక్తులు దేనికి ప్రాధాన్యమిస్తున్నారు? సంస్కారవంతుడైన మనిషి వాటికి ఎలా ప్రతిస్పందిస్తాడు?- మొదలైన వివరాలు చంద్రశేఖరంతో చెప్పించిన వైనం రచయితకు సమాజంపైగల అవగాహనను విశదపరుస్తుంది. ఈనాటి మన సభ్య ప్రపంచం స్త్రీ జాతికి ఇస్తున్న విలువ ఎలాంటిది? వారు పుట్టినప్పటినుంచి వారిని పెంచే తీరు ఎలాంటిది? వారిని బానిసలుగా సమాజం ఎలా తయారు చేస్తున్నది? వేరువేరు సందర్భాలలో చంద్రశేఖరం, స్వరూపరాణి పాత్రలలో క్లుప్తంగా చెప్పించి "చలం" స్త్రీ జాతి విమోచనానికి వారి స్వేచ్ఛకు చేసిన కొందరికి మింగుడుపడని సిద్ధాంతాలను రచయిత తన మితవాదంతో సమర్థించాడు అనవచ్చు. పద్మావతి, శకుంతల, శశిరేఖ, సుజాత, వరలక్ష్మి తమ పేర్లు మార్చుకోవటం, వారి ప్రవర్తనలలో నేటి నగటు ఆడపిల్లల మనస్తత్వాలు ప్రతిబింబిస్తాయి. జీవితభాగస్వామిని ఎన్నుకోవటంలో ఆలోచించాల్సిన విషయాలు స్వరూపరాణి పాత్రద్వారా చెప్పించాడు. వ్యవస్థలోని వ్యక్తులు సంస్కారానికి, మంచి మనసుకు, చదువుకున్నా డబ్బుకు, హోదాకు ఎలాంటి విలువనిస్తారో శ్యామ్‌సుందర్ పాత్ర మలచటంలో రచయితకు నేటి వ్యక్తులపై ఉన్న అభిప్రాయాన్ని అవగతం చేసుకోవచ్చు. "ప్రస్తుతం మనకి లోకువగా కనిపిస్తున్న వ్యక్తి నిజంగా మనకంటే తక్కువ అనుకోవడం చాలా పొరపాటు. పరిస్థితులు మారవచ్చు. అప్పుడు వాళ్ళేకాదు భగవంతుడు కూడా మనల్ని క్షమించడు" అని శ్యామ్‌సుందర్‌తో అతని అన్నయ్య చెప్పే తీరు బాగుంది. అందుకు ఉదాహరణ గౌరి, చంద్రశేఖరం పాత్రలు. చదువు, సంస్కారం కలిగిన గౌరి, చంద్రశేఖరం డబ్బులేమివల్ల ఎలా చిన్నచూపుకు గురైంది, తిరిగి ఆ యిద్దరికి డబ్బు, హోదా వచ్చాక తమను చిన్నచూపు చూసినవారే వారి చుట్టు తిరగటంవంటి విషయాలతో కథ నడిపించాడు రచయిత.

చివరలో రవితేజను ప్రవేశపెట్టి అతని మనస్తత్వం తెలపటం, గౌరిచేత చెప్పించిన సంస్కారయుతమైన సంభాషణలు, వారికి వివాహం చేయడం బాగుంది. మొత్తానికి "అమృతబిందువు" అమృతబిందువుయే కాని మృతబిందువు మాత్రము కాదు.

— మాదుగుల రవీంద్ర, లకినేపల్లి.

ముఖచిత్రం: లక్ష్మణ్

## సదాశయమై జాలువారి...

**ద్వితీయ బహుమతి రూ.75/-లు పొందిన సమీక్ష**

"**నాక్కొంచెం నమ్మకమివ్వు... కొండల్ని పిండి చేస్తా**" అన్న మహాకవి బైరాగిమాటల్ని మననం చేస్తూ, ఆత్మవిశ్వాసంతో సాధించలేనిది యీ ప్రపంచంలో యేదీలేదు అనే సదాశయంతో శ్రీ దంతుర్తి చినరామచంద్రరావు కలంనుంచి జాలువారిన నవలికే 'అమృత బిందువు'.

చిరుద్యోగ యువకిశోరం చంద్రశేఖరం. నవలిక అంతా అతనూ, అతని వ్యక్తిత్వమూ, అతని అభిరుచులూ- ఆలోచనలూ నేపథ్యంగా సాగిపోతుంది. క్రమశిక్షణలో మూర్తీభవించిన మానవత్వమూ- నిష్కల్మషమైన ఆత్మవిశ్వాసమూ- కర్తవ్య నిర్వహణపట్ల అకుంఠిత దీక్ష అతని పాత్రలో అణువణువున కనిపిస్తుంది. ఎవరైనా యేదో ఒకటి లేదా రెండు రంగాల్లో లబ్ధ ప్రతిష్టులవడం సహజంగాని చంద్రశేఖరంలా అన్నిరంగాల్లోనూ విజేతలయ్యేవారు చాలా అరుదుగా వుంటారు. అతనొక బహుముఖ ప్రజ్ఞాశాలి స్థిరచిత్తుడు. తల్లికివ్వాల్సిన గౌరవమెంతో తన చెల్లినెలా చూసుకోవాలో అతనికి తెలుసు. ఎవరితో ఎలా మెలగాలో తనపరిధి యెంతో యెరిగిన అతడు అనవసర విషయాలపట్ల యేవ్యాభావమూ వున్నవాడు ప్రతి తల్లీ అలాంటి బిడ్డకావాలని కోరుకునే విధంగా ఆ పాత్రను తీర్చిదిద్దారు రచయిత.

ఇక పోతే, రాజకీయ నాయకులపట్ల ప్రజలకున్న దురభిప్రాయాల్ని వమ్ము చేస్తూ వాళ్ళల్లోనూ మంచివాళ్ళున్నారని తెలుపుతూ కృతజ్ఞతామూర్తిగా మిగిలిన పాత్రలో వీర్రాజు గొప్పగా కనిపిస్తాడు. స్వరూపరాణిలో సంఘ సంస్కర్తలకుండాల్సిన లక్షణాలన్నీ కనిపిస్తాయి.

పులికాట్ సరస్సును గురించీ, షిరిడీని గురించీ సంక్షిప్తంగా చర్చించడంతో విహార యాత్రలు చేసేవారికి గైడెన్స్‌గా ఆ విషయాలు పయోగపడతాయనడంలో సందేహంలేదు.

విజయం పొందిన ప్రతి మగవాడి వెనుక స్త్రీ వుందన్న విషయాన్ని మరోసారి గుర్తుచేస్తూ స్వరూపరాణిని అమృతబిందువులా చంద్రశేఖరం జీవితంలో ప్రవేశపెట్టి అతణ్ణి అనేక సమస్యలనుండి విముక్తుణ్ణి చేసి, సంఘంలో స్థిరత్వం, హెూదా కల్పించారు రచయిత.

— కె.నాగరత్న, వెంకటపాలెం.

## అదెలాసాధ్యం

**తృతీయ బహుమతి రూ.50/-లు పొందిన సమీక్ష**

**అమృతబిందువు** నవలలో జీవితం కళ్ళకు కట్టినట్టుండే సన్నివేశాలు అంతగా లేవు.

ప్రకాశరావుగారు తన కూతురు పెళ్ళి సంబంధం కోసం ఏలూరెళ్ళి రావడం, శేఖర్ తన చెల్లెలు గౌరి పెళ్ళి గురించి తలపోస్తూ, సంఘంలో, స్త్రీ స్థానం గురించి ఆలోచించడం ఇవన్నీ చదివితే 'స్త్రీ సమస్యా చిత్రణ' మీద సాగుతుందనుకున్న నవల రచయిత ఇష్టానుసారం నడిచివెళ్ళిపోతుంది. రాజకీయాలతో, రాజకీయ నాయకులతో ఏమాత్రం సంబంధంలేని ఓ చిరుద్యోగి ఎన్నికల ప్రచారంలో ప్రముఖ పాత్ర వహించడం, అసలందుకు అవకాశం రావడం సాధ్యమా?

సంస్కారవంతుడైన క్రిష్ణమూర్తి మరియు పార్వతమ్మగార్లు, శేఖర్ 'ఓ పూర్‌క్లర్క్' అనే ఉద్దేశంతో తమ కూతురు సరోజకు, శేఖర్ కారెక్టర్ మీద లేనిపోని అభాండాలు వేసినట్లు చెప్పిస్తాడు రచయిత. వీరే తమ కూతురుతో అతనికి కావలసినంత సాన్నిహిత్యం ఏర్పడే అవకాశాలు ఇవ్వటం విచిత్రం. సరోజ తన తల్లిదండ్రులమాటలు నమ్మి, మరో సంబంధం చేసుకోవడానికి ఒప్పుకుందని ఎవరి ద్వారానో విన్న శేఖర్, ఆ విషయాన్ని సరోజతో ముఖాముఖి తేల్చుకోవాలని అనుకోడు. అలా తేల్చుకుంటే ధనవంతురాలు, అందగత్తె అయిన స్వరూప రాణిని గాక సరోజనే చేసుకోవాల్సి వస్తుందని కాబోలు. ఇకపోతే పులికాట్ లేక్, షిర్డీల సందర్భాలు కథతో సంబంధం లేనివి. 'ఓసారి షిర్డీ వెళ్ళిరా!

ఎందుకో నీకే తెలుస్తుంది తర్వాత' అని ఎమ్.ఎల్.ఎ. వీర్రాజు గారు చీటీ వ్రాసి పంప గానే కథానాయకుడు షిర్డీ బయలుదేరి వెళతా డు. వీర్రాజుగారు యెందుకు వెళ్ళమన్నాడో, ఆ తర్వాత ఆయన చెప్పడు. పాఠకునికీ అర్థం కాదు. కేవలం స్వరూపరాణితో పరిచయం ఏర్పడడానికి అసందర్భంగా షిర్డీకి వెళ్ళిన ట్లుంది. శేఖర్‌కు, అందము సిరి వున్న స్వరూ పరాణితో పరిచయం- ఆ తర్వాత అది ప్రేమై, పెళ్ళైపోవడం ఇదంతా కృత్రిమంగా ఉంది. వీళ్ళద్దరి పెళ్ళి జరగడానికి అడ్డుగా వున్న సరోజ, అంతవరకూ విశాలభావాలతో ఉన్న సరోజ అప్పుడు సంకుచితంగా మారిపోయి తల్లితండ్రుల మాటల్ని నమ్మి మరో పెళ్ళికి అంగీకరిస్తుంది. శేఖర్ సమక్షంలో నిజానిజా లు తెల్సుకునే ఆలోచన కూడా చేయకపోవడం విడ్డూరం. నాయకుని ఔన్నత్యాన్ని కాపాడడాని కి అతన్ని ధనవంతుణ్ని చేయడానికీ, కొన్ని ఇతర పాత్రల వ్యక్తిత్వాలని బలి చేశారు. నిజానికి ఏదిఏమైనా ఇదొక సాదాసీదా నవల అని నిష్కర్షగా చెప్పవచ్చు. రచయిత శైలి సరళంగా ఉండి ఆద్యంతం చదివించింది.

—పాలగిరి విశ్వప్రసాద్‌రెడ్డి, హనుమనగుత్తి.

## కృషితో నాస్తి దుర్భిక్షమ్!

*రూ.25/-లు పొందిన సమీక్ష*

'అమృతబిందువు'లో నవలా నాయకీనాయ కులతోపాటు మిగిలిన పాత్రలకు కూడా ప్రాధా న్యం కల్పిస్తూ మధ్యలో స్త్రీ అసమానత, వరక ట్నం లాంటి సమస్యలపట్ల ఆవేదనను వ్యక్తం చేస్తూ చివరివరకూ ఎక్కడ ఆవకుండా రచ యిత ఆసక్తిదాయకంగా వ్రాసిన నవల యిది.

చక్కని తెలివిని, ప్రతిభను, విద్యను కలిగి ఉండి కూడా సామాన్య ఉద్యోగిగానే ఉండిపో యిన శేఖర్ తను క్రమక్రమంగా ఉన్నతస్థాయి లోకి రావడమేకాకుండా అవిటిదైన తన చెల్లిని కూడా విద్యావంతురాల్ని చేసి తనకన్నా ఉత్త మస్థాయిలోకి తీసుకురావడం బావుంది. ఏ అడ్డదారులు తొక్కకుండా తన స్వయం ప్రతి భతో పైకి వచ్చిన శేఖర్ పాత్ర, అంగవైకల్యం కలిగిఉండి ఎన్నో నిరాశానిస్పృహలను దిగ మింగుతూ ఉన్నత విద్యను చదివి చక్కని ఉద్యోగాన్ని ఆ తర్వాత మంచి భర్తను సంపా దించుకున్న గౌరిపాత్ర విద్యార్థులకు ఆదర్శ ప్రాయం. స్వయంకృషితో సాధించలేనిది ఏదీ లేదని, ఆత్మస్థైర్యంతో ఏ పనైనా సాధించవ చ్చని ఉద్బోధించిన పాత్రలివి.

ప్రారంభంలో పద్మ, శ్రీలత, శ్వేత, శ్రీప్రియ, అనుపలు పేర్లు మార్చుకునే తతంగం సు న్నిత హాస్యంతో బావుంది. అంతవరకూ శ్వే తనో, సరోజనో నాయకురాలిగా ఊహిస్తున్న పాఠకుడికి స్వరూపరాణిని శేఖర్ పెళ్ళి చేసుకో వడం ఊహించని మలుపే

కేవలం తన వైపు నుంచే కాక అవతలివారి వైపు నుంచి కూడా ఆలోచించే స్వరూపరాణి వ్యక్తిత్వం కూడా ఉన్నతమైనదే. పూర్తిగా తన ప్రతిభమీదే కాని రికమండేషన్ల మీద ఆధారప డటానికి ఇష్టపడని శేఖర్ అంటే అందరికీ ఇష్టం కల్గుతుంది. తన చెల్లెల్ని చక్కని విద్యా వంతురాలిగా తీర్చిదిద్దిన వైనం, సామాన్యు డైన నిస్వార్థపరుడైన వ్యక్తిని ఎన్నికల్లో నిలబెట్టి తను ఆసరాగా ఉండి గెల్పించడం, షిర్డీకి వెళ్ళినపుడు అక్కడ రూమ్ దొరక్క చలిలోనే పడుకొని అవస్థలు పడ్తున్న స్వరూపరాణి తండ్రిని, ఆమెను తన రూమ్‌లోకి ఆహ్వా నించిన సంఘటన, తన చెల్లెల్ని నిరాకరిస్తూ శ్యామసుందర్ పొరుషంగా నిందిస్తున్నా ఆత్మా భిమానం బాధపెట్టినా తట్టుకొని మనసులోనే దిగమింగుకొన్న అతని సంస్కారం ఇవన్నీ అతని ఇమేజ్‌ని మరింత పెంచుతాయి.

మంచి పాత్రల్ని తీసుకొని, అంతకంటే చక్కని కథతో, మృదువయిన శైలిలో దంతుర్తి చినరామచంద్రరావు కలం నుండి జాలువారిన 'అమృత బిందువు' సుమధురం.

—వై.రాజేష్, కంభంవారిపల్లె.

## సినిమా ఫక్కీలో

*రూ.25/-లు పొందిన సమీక్ష*

'అమృతబిందువు'లో మంచిపాత్రలు చక్కని సంభాషణలు, బలమైన సంఘటనలు, మాన





సిక సంఘర్షణ... అన్నీ దేనికదిగా వున్నాయి. కాని వాటి మధ్య సహజత్వం, సంయమనం లేకపోవడంవల్ల నవల కృత్రిమంగా తయారైంది.

కథానాయకుడు 'శేఖర్'ను సర్వాంగసుందరంగా సకల కళావల్లభుడుగా దిద్ది తీర్చేందుకు ఆ పాత్రకు ఆపాదించిన మేధా సంపత్తి, దైవభక్తి, క్షుద్ర విషయాలపట్ల నిరాసక్తి, కార్యదీక్ష, కంపెనీ అడ్మినిస్ట్రేషన్ మొదలు అఫ్గనిస్తాన్ సమస్య వరకూ సర్వ విషయాల్లో సంపూర్ణ పరిజ్ఞానం... ఇవన్నీ కలిసి, అతన్ని ఓ "రోబోట్"గా చేశాయేగాని, సజీవమైన పాత్రగా నిలబెట్టలేకపోయాయి.

స్త్రీ పాత్రల సంఖ్య మరీ ఎక్కువ కావడంతో- ఒక స్వరూపరాణి పాత్రతప్ప- ఏదీ సమగ్రంగా లేదు.

డాబుదర్పాలను తిరస్కరించి, నిరాడంబరతను చాటిచెప్పిన షిర్డీసాయిబాబాకు 30 రూ॥ పూలమాలకాక, 55 రూ॥ మాలతోనే 'ఘనంగా' సత్కరించాలని స్వరూపరాణి అనడం, మేధావి శేఖర్ అందుకంగీకరించడంవంటి సంఘటనలు ఆ పాత్ర మౌలికతత్వానికి వ్యతిరేకం.

వీర్రాజు ఎన్నికలలో శేఖర్ ఉధృతంగా ప్రచారంచేసి మంచానపడటం; షిర్డీలో కాకతాళీయంగా పరిచయమైన స్వరూపరాణి- కోటీశ్వరుడి కూతురు- శేఖర్‌ను ప్రేమించి పెళ్ళాడటం; గౌరి దారిద్ర్యాన్ని అంగవైకల్యాన్ని ఎద్దేవా చేసిన శ్యామసుందర్ చివరకి ఆమెకు కింది ఉద్యోగిగా, అంగవికలుడిగామారడం; గౌరి ఐ.ఎ.ఎస్ ఆఫీసరై అంగవైకల్యంనుండి బయటపడటం, రవితేజ గౌరిని పెళ్ళాడటం 'సినిమా' తరహాలో సాగింది. సంభాషణలతోబాటు కథా కథనంలో కూడా ఆంగ్ల పదాలు, వాక్యాలు విపరీతంగా వాడటం బాగాలేదు.

—వనువులేటి మునిరాజా, నర్సరావు పేట.

## నాణానికి మరోవైపు

*రూ.25/-లు పొందిన సమీక్ష*

ప్రకాశరావుగారి ఐదుగురు ఆడపిల్లలతో మొదలైన కథలో అసందర్భంగా ప్రవేశిస్తాడు నాయకుడు. పోని అంటె- అతడికి వాళ్ళతో ఎలాంటి సంబంధమూ ఉండదు; అనవసరంగా అతడి చుట్టూ తిరిగే అమ్మాయిల సంఖ్య పెరగడంతప్ప. అనేక అర్హతలున్న సకల గుణాభిరాముడుగా హీరో చిత్రణ ఎంతో బాగుంది. కాని వివాహం గురించి, ప్రేమ గురించి నిర్దిష్టమైన అభిప్రాయమేలేదతడికి. సరోజతో చనువుగా ఉండి, మాటిచ్చినవాడు రాణి ద్వారా సరోజ విషయం వినగానే రాణిని ఒప్పుకునేస్తాడు. కనీసం సరోజని కల్సి, ఒక మాటయినా అడగడు. "శ్వేతా! నన్నపార్థం చేసుకున్నావు" అన్నవాడు "మంచితనం కూడా ఉన్న శ్వేత మాటేమిటి? ఆమెగారు ఏ నూతికో, గోతికో పరుగిడితే ఎలా?" అని ఆలోచించటం ఆ పాత్రకే అవమానం. నూతికో, గోతికో పరుగుపెట్టుందని తప్పితే మరోవిధంగా అతనిలో చేతన కలుగదా? అంతటి ఉన్నతాశయవరుడు "కట్నంగా ఇస్తున్నదికాదు" అనగానే, పెళ్ళికి ముందే రాణి ఆస్తి లక్ష రూపాయలు కిమ్మనకుండా పుచ్చుకోవడం చాలా ఎబ్బెట్టుగా ఉంది.

ఇక నాయికల విషయానికొస్తే- మొదటి నుండి చివరి వరకూ సమతుల్యంగా నడిచింది గౌరి పాత్ర మాత్రమే. ఎక్కడా తొణకని ఆమె మంచితనం, అభిజాత్యం. ఆదర్శప్రాయం. ఆమె విద్య ఆమెను మరింత చక్కగా మలిచింది.

అలాగే- శేఖరాన్ని పెళ్ళిచేసుకోవటంతో రాణి అస్తిత్వం మాసిపోతుంది. ఆ తర్వాతామె ప్రసక్తే లేదు. ఇక గౌరి వివాహం రవితేజతో జరగడానికి శ్యాంసుందర్‌కి ఆక్సిడెంట్ జరగడం, ముందుగా రవితేజ పేరు చెప్పి ఒదిలేసి, చివర్లో అకారణంగా తెరమీదికి రప్పించడం మరీ కృతకంగా ఉన్నాయి. ఇలా కాక గౌరి తన ఉద్యోగజీవితంలో ఎదురైన మంచి వ్యక్తిగా రవితేజను వివాహమాడిఉన్నట్లయితే ఆ పాత్రకి మరింత నిండుదనం వచ్చేది.

ఇలా చాలా లోపాలున్నా మంచి కథనశక్తితో చదివించారు రామచంద్రరావు.

—లక్ష్మి రాయసూతల, హన్మకొండ.

# చతుర కతలు

## బాబోయిదొంగ

"ఏమేవ్‌..." పిలిచాడు గోపాలం భార్యను.

"ఏమిటి?" అంటూ వంటింట్లోనుంచి వచ్చింది కామాక్షి.

"ఇవిగో సామాన్లు తెచ్చాను" చెప్పాడు గోపాలం.

"వారంరోజుల నుండి చెబుతూంటే ఈ రోజుకు మీకు తీరిందన్నమాట" అంటూ గోపాలం భుజంమీది సరుకుల మూటను దించింది కామాక్షి.

"అన్ని సామాన్లు వచ్చాయి కదా!" అడిగాడు గోపాలం.

కామాక్షి లిస్ట్ చదువుతూ సామాన్లు చూసింది. అన్నీ సరిపోయాయి. "సరిగ్గా తెచ్చారండి! మీ తెలివి అమోఘం. సైకిల్‌మీద ఇన్ని సామాన్లు ఎలా తెచ్చారూ?" ఆశ్చర్యంగా అడిగింది కామాక్షి.

"అయ్యబాబోయ్‌... నా... నా...సైకిలు" అంటూ కెవ్వున అరిచాడు గోపాలం.

"ఏమైందండి... ఎందుకలా అరిచారు?" కంగారుగా అడిగింది కామాక్షి.

"ఈ సామాన్లు సైకిలు మీద తేలేదు. రిక్షాలో తెచ్చాను. సైకిలు... సైకిలు... షాపు దగ్గరే ఉండిపోయింది" అన్నాడు గోపాలం.

"నేననుకుంటూనే ఉన్నా... ఇలాంటి పనేదో మీరు చేసుకువస్తారని. తొందరగా షాపుకి వెళ్లండి. లేకుంటే ఏ దొంగవెధవో వచ్చి ఆ సైకిలును నొక్కేస్తాడు" అని తొందరచేసింది కామాక్షి.

'దేవుడా! నా సైకిలు నాకు దొరికితే నీ గుడికి వస్తానయ్యా'అని మనుసులో అనుకుంటూ పరుగుతీశాడు గోపాలం.

షాపుదగ్గరకెళ్ళి చూస్తే సైకిలు పదిలంగా ఉంది. సైకిలు కనిపించడంతో గోపాలానికి తెగ సంతోషమేసింది.

సైకిలు తీసుకుని ఆనందంగా ఇంటికి వస్తూంటే దారిలో గుడికనిపించింది.



వెంటనే గుడిదగ్గర సైకిలు ఆపి గుడిలోకి వెళ్ళాడు. గుడిచుట్టూ తిరిగి భగవంతునికి భక్తిగా నమస్కరిస్తూ "స్వామీ... నువ్వున్నావయ్యా! నీకు నామీద ఎంత దయ. నా సైకిలు నాకు దక్కించావు. నీకు నా శతకోటి దండాలు" అని ఓ కొబ్బరికాయ కొట్టి దేవుడి ప్రసాదాన్ని తీసుకున్నాడు.

కాసేపు మండపంలో కూర్చున్నాడు.

ఆ తరువాత దేవుడి ప్రసాదం తింటూ బయటకు వచ్చిన గోపాలం కెవ్వున అరుస్తూ దభేల్‌న కిందపడ్డాడు.

కారణం... అక్కడ అతని సైకిలులేదు.

**– పాలకొల్లు రాజమోహనరెడ్డి**

## సస్పెన్స్ కిల్లర్

"తప్పు చేయకూడదు. చేసిన తప్పుని కప్పిపుచ్చుకోవడం మహా నేరం. ఆ తప్పుని ఒప్పుకుంటే శిక్షతగ్గుతుంది" అన్న పంతులుగారి బోధన రాంబాబు చెవుల్లో పదేపదే మోగుతోంది.

రాంబాబుకి పదేళ్ళు వుంటాయి. లోకం గురించి అంతగా తెలీదు. వాడికి తెలిసిందల్లా తెలుగు సినిమాల్లో హీరోలు చేస్తున్న ఘనకార్యాలను గురించే.

తనో మర్డర్ చేసానని స్ఫురణకి రాగానే గజగజా వణికిపోయాడు రాంబాబు. అఫ్‌కోర్సు తను అనుకోకుండా ఆ మర్డర్ చేశాడు. అయినప్పటికీ మర్డర్ మర్డరే కదా. అందుకని పంతులుగారు చెప్పిన నీతిపాఠాలు గుర్తుచేసుకుంటూ తిన్నగా పోలీస్‌స్టేషన్‌కి వెళ్ళాడు.

బుగ్గ మీసాల ఎస్.ఐ.ని చూడగానే వాడికి భయం పట్టుకుంది. బిక్కు బిక్కుమంటూ అలాగే నిలబడ్డాడు వరండాలో.

కాసేపటికి తలెత్తి ఇటు చూసి- "ఎవడ్రా అది?" దర్పంగా అడిగాడు ఎస్.ఐ.

అప్రయత్నంగా రాంబాబు నిక్కరు తడిసిపోయింది.

పిల్లాడు ఏదో ఆపదలో వున్నాడని ఎస్.ఐ. గమనించాడు.

"ఇటు రా..." అన్నాడు గద్దింపుగా.

తడబడుతూ వచ్చేడు. చేతులు కట్టుకున్నాడు.

"ఎవరు కావాలి?" ప్రశ్నించాడు ఎస్.ఐ.

"మీ...మీ...మీరే".

"నేనా! ఎందుకు? ఎవరు పంపారు నిన్ను?" ప్రశ్నలవర్షం కురిపించాడు ఎస్.ఐ.

"ఎవరూ పంపలేదు... నేనే వచ్చాను"

"అదే! ఎందుకూ?"

"నె...నే...నేను..."

"ఊ‌ం. నువ్వూ?"



రాంబాబు నోరు పెగల్లేదు.

"ఊ. చెప్పరా..." విసుక్కున్నాడు ఎస్.ఐ.

"నేను అనుకోకుండా హత్యచేశాను" అని ఒక్కపెట్టున ఏడవడం మొదలుపెట్టాడు రాంబాబు.

ఎస్.ఐ. హతాశుడయ్యాడు. అతడి సర్వీస్‌లో బాలనేరస్థుల్ని చాలామందిని చూశాడు. కాని ఇంత పిన్న వయసుగల నేరస్థుణ్ణి చూడటం ఇదే ప్రథమం. పైగా తనే వచ్చి చెపుతున్నాడు.

"ఏమిటి నువ్వా? హత్య చేశావా?"

"ఊ ... ఊ ...ఊ ..." నసిగాడు రాంబాబు.

"ఎవర్ని?"

"ఊ ... ఊ ... ఊ ..."

"ఎప్పుడు?"

"ఊ ... ఊ ... ఊ ..."

"ఎవర్నో? ఎక్కడో? త్వరగా చెప్పి తగలడరా రాస్కెల్!" ఎస్.ఐ. అరిచాడు కోపంగా.

"నాతో రండి... చూపిస్తాను"

వెంటనే రాంబాబుని స్కూటర్ మీద ఎక్కించుకొని సరాసరి అతడు చెప్పిన స్థలానికి వెళ్ళారిద్దరూ.

"ఇదిగోనండీ, ఇక్కడే" చూపించాడు రాంబాబు.

"ఎక్కడ? శవం ఏదీ?"

"జాగ్రత్తగా చూడండి... ఇదిగో నేను నడుచుకుంటూ వస్తుంటే నా కాలిక్రిందపడి నలిగి చనిపోయింది ఈ బొద్దింక. 'జీవహింస మహాపాపం, ఘోర నేరం" అన్నారు మా టీచరు అంటూ చూపించాడు రాంబాబు.

ఎస్.ఐ.గారు టోపీ తీసి, పిచ్చెక్కినవాడిలా తలని గోకేసుకున్నాడు.

– కొల్లిమల్ల అప్పారావు

## మహానటుడు

"గోపాలం... ఒరేయ్ గోపాలం..." ఎవరో పిలిచినట్లనిపించి వెనక్కు తిరిగి చూశాను.

మూర్తి వగర్చుకుంటూ వస్తున్నాడు.

మద్రాసునుంచి వీడెప్పుడు దిగాడా అని ఆశ్చర్యపోయిన నేను వాడు దగ్గరకు రాగానే అమాటే అడిగాను.

"ఉదయం చార్మినార్‌లో వచ్చాన్రా! వదినగారూ, పిల్లలూ అంతా బాగున్నారా? ఆఁ.. అన్నట్లు... ఒరేయ్ నేను నటించిన 'స్వర్ణకలశాలు' రేపు 24న రిలీజ్ అవుతోంది. తప్పనిసరిగా చూసి నీ అభిప్రాయం చెప్పాలి మరి..." అని గబగబా మాట్లాడేశాడు.

నేనేదో అనబోయాను.

కాని ఇంతలో మరో స్నేహితుడు రాఘవ సైకిలుమీద వెళ్తూ కన్పించడంతో మూర్తి చప్పట్లు గొట్టి పిలిచాడు.

"...అరేయ్ రాఘవా... నేనూ అటే వస్తున్నా! ఒక్క నిముషం..." అని నావైపు తిరిగి, "వస్తాన్రా గోపాలం! ఇంకా చాలామందికి చెప్పాలి. నువ్వు మాత్రం సకుటుంబ సమేతంగా పిక్చర్ చూడు... మర్చిపోకు" అంటూ రాఘవవైపు పరుగెత్తాడు వాడు.

నేను వాడు వెళ్ళినదిక్కే చూస్తూ నిలబడిపోయాను.

★ ★ ★

మూర్తి నా బాల్యస్నేహితుడు. చిన్నప్పటినుంచీ నాటకాలు, ఏకపాత్రాభినయాలు అంటే వాడికి ప్రాణం. స్కూలు, కాలేజీ వార్షికోత్సవాలలోనూ, శ్రీరామనవమి పందిళ్ళలోనూ చాలా ప్రదర్శనలు ఇచ్చాడు. ఆర్థికంగా కాస్త ఉన్నవాడు కావడంతో డబ్బు ఇబ్బందులేంలేవు. దాంతో సినిమాల్లో వేషాలకోసం కొందరు మిత్రులు సలహాపై రెండేళ్ళక్రితమే మద్రాసులో మకాం పెట్టేశాడు.

తర్వాత అడపాదడపా వచ్చినప్పుడల్లా సినిమా వాళ్ళ కబుర్లు, షూటింగ్ ముచ్చట్లు ఎన్నెన్నో చెప్పి మాకు మంచి కాలక్షేపం చేసేవాడు. తన ప్రయత్నాల గురించి అడిగితే "సుబ్రహ్మణ్యేశ్వరా పిక్చర్స్‌వాళ్ళు ఓ మంచి కారెక్టర్ ఇస్తామంటున్నారు... ఇక మన గాయత్రీ మూవీస్ ప్రొడక్షన్ నెం.2లో నాకో పాత్ర ఖాయం చేశారు. దానికి స్క్రిప్ట్ వగైరా అన్నీ రెడీ అయిపోయాయి. ఇక సెట్స్‌మీదకి వెళ్ళడమే తరువాయి..." అంటూ చెబుతుండేవాడు.







కాని ఆ పిక్చర్లు విడుదలయ్యేవికావు. అథవా విడుదలైనా వాటిలో మావాడెక్కడా కన్పించేవాడు కాదు. ఆ తర్వాత కన్పించినప్పుడు తానా పిక్చర్స్‌లో నటించడం ఇష్టంలేక మానేశాననో లేక డైరెక్టర్‌తో గొడవపడి వదిలేశాననో చెప్పేవాడు. ఇదుగో ఆర్నెల్ల తర్వాత ఇవ్వాళవచ్చి 'స్వర్ణకలశాలు'లో నటించానని చూసి అభిప్రాయం చెప్పమని కోరాడు వాడు.

★ ★ ★

ఆరోజు 24వ తారీకు.

మూర్తిగాడి మిత్రులమైనమేమంతా 'స్వర్ణకలశాలు' ఉదయం ఆటకే టిక్కెట్లు రిజర్వ్ చేయించుకుని సినిమాకు వెళ్ళాం. ప్రసిద్ధ దర్శకుడి సిన్మాకావడం, అందునా మొదటిరోజే కావడంతో జనం బాగానే ఉన్నారు. కొంచెం ఆలస్యమైనా గొప్ప దర్శకుడి చేతిలో పడడం మనవాడి లైఫ్‌కే టర్నింగ్ పాయింట్ అని తృప్తి పడ్డాన్నేను.

సినిమా మొదలైంది. మూర్తిగాడిపేరు కోసం టైటిల్ కార్డ్సుని పట్టిపట్టి చూశాను. ఎక్కడాలేదు. చిన్నకారెక్టరేమో సినిమాలో చూడచ్చులెమ్మని సినిమాలో లీనమైపోయాను. పిక్చర్ చాలా బాగుంది. కాని ఆశ్చర్యం! మా మూర్తిగాడెక్కడా అందులో కన్పించలేదు.

ఆ తర్వాత నాల్గురోజులకి వాడు బజార్లో కన్పించి అడిగాడు.

"ఏరా పిక్చర్ చూశావా?"

"ఆఁ... కాని నువ్వెక్కడా..."

"... కన్పించలేదంటావ్" పూర్తి చేశాడువాడు నవ్వుతూ.

నేనేం మాట్లాడలేదు.

"ప్రతివాడూ ఇదేమాట... వెధవలు! అరేయ్ అసలు సినిమాలెలా చూస్తార్రా నాయనా మీరు...?" వాడిగొంతులో కోపం స్పష్టంగా తెలుస్తోంది.

కొంచెంసేపటికి వాడే సంబాళించుకుని మెల్లగా అన్నాడు.

"హీరో రవికాంత్‌ని పోలీస్‌స్టేషన్‌కి తీసుకెళ్ళారా!" సీన్‌ని గుర్తుచేశాడు.

"అవును"

"ఆ స్టేషన్‌లో గోడమీద కొందరు జేబుదొంగల ఫొటోలున్నాయా?"

"ఉన్నాయి".

"మరింకేం? వాటిలో మొదటి ఫొటో ఎవరిదనుకున్నావ్?"

"....."

"నాదేరా వెధవా!" నవ్వాడువాడు.

– ప్రతాపచంద్ర

# చతుర

సంచిక: 4 మే: 1990 సంపుటి: 13

## ఈ నవల గురించి..... రచయిత

"ఈ నవలాకాలం నేటికి పదేళ్ళక్రితం నాటిది. మన దేశాన్ని 'ఈస్టు' ఇండియాగా 'వెస్టు' ఇండియన్లు వ్యవహరిస్తూ ఉంటారు. ఆ "పశ్చిమ" దీవుల్లో వంద సంవత్సరాలకి ముందే వలస వెళ్లిన భారతీయుల సంతతివారు హెచ్చు సంఖ్యలో ఉన్నారు. వాళ్ల పూర్వీకులు అక్కడికి వెళ్లడానికున్న కారణాలవలనా, అక్కడకు వెళ్లాక అక్కడ నివసించాల్సి వచ్చిన పరిస్థితుల వలనా మనకి, వారికి జీవన విధానాల్లోను, నైతిక విలువల్లోను కొన్ని తేడాలు క్రమంగా ఏర్పడ్డాయి. తూర్పు భారతం నుంచి పశ్చిమ దీవులకి ఉద్యోగాల రీత్యా కొత్తగా వెళ్లిన ఈ తరం కుటుంబాల గురించి, ఆ కుటుంబాలమీద ఈ కొత్త దేశంలోని కొత్త విలువల ప్రభావం గురించి చెప్పటమే ఈ నవల ప్రధానోద్దేశం.

పదేళ్ల క్రితం నేనక్కడ ఉన్నాను. ఈ నవల రాయటానికి నాకు ఆరు సంవత్సరాలు పట్టింది. ఉద్రేకరహితంగా అనుభవాలను బేరీజు వేసుకొంటూ రాయటానికి చేసిన ప్రయత్నంలో కొన్ని భాగాలను తొలగించటం, మరికొన్ని చేర్పటం జరిగింది.

ఈ నవలలో కథ అర్థం, కామంల చుట్టూ తిరుగుతుంది. ఈ కథాగానం చేసే రచయితకి శృతిమించడానికి అవకాశం, ప్రలోభం కూడా ఉంటాయి. అయినా శృతిమించకుండా పాడటానికే ప్రయత్నించాను.

ఈ కథాగానం తక్కువ శృతిలోనేకాక తక్కువ కాలంలో చేశాను. కొత్త దేశాన్ని, విలువల్ని పాఠకుల ముందుంచటానికి ఆ వేగం ఎన్నుకొన్నాను. ఈ నవల అక్కడి సమకాలీన జీవనానికి దర్పణం అవుతుందనుకుంటున్నాను."

*

వెస్టిండీస్ జీవన విధానాన్ని ప్రతిబింబించిన **'కవనశర్మ'** కథనం **'తూర్పు - పడమర'** ఈనెల చతుర సమర్పిస్తున్న సమగ్ర నవల.



బొంబాయి నుంచి బయల్దేరిన విమానం లండన్ వైపు దూసుకుపోతోంది. తూర్పు నుంచి పడమరకి ప్రయాణం చేస్తూ ఉండటంవల్ల కాలం మందగమనంతో నడుస్తోంది. సూర్యుడు బద్ధకంగా వళ్ళు విరుచుకొని లేస్తున్నట్టుంది చీకట్లువిచ్చి వెలుగురేఖలు వరచుకోవటం.

"దయచేసి వినండి... ఇంధనంకోసం విమానం కువాయిట్‌లో దిగుతుంది. అక్కడ ప్రయాణీకులు దిగటం నిషిద్ధం. ప్రయాణీకులందరు విమానంలోనే ఉండాలని కోరుతున్నాం" అని కనిపించని అమ్మాయి తియ్యటి గొంతుకతో హెచ్చరించింది.

కృష్ణ కిటికీ గుండా బయటకు చూశాడు. విమానం భూభాగం మీద ఎగుర్తోంది. ఎక్కడ చూసినా ఇసుక, ఇసక మధ్యలో తిన్నగా, తీరుగా రోడ్లు. రోడ్ల మీద అక్కడక్కడ కార్లు.

"ప్రపంచంలోకల్లా అతిసంపన్నమైన దేశంలో ఉన్నాం మనమిప్పుడు" అన్నాడు కృష్ణ శ్యామలతో.

"అయితే మనకేం వరిగింది! మనం వెళ్లేది ట్రినిడాడ్‌కాని కువాయిట్ కాదు కదా" అంది శ్యామల చిన్నగా నవ్వి.

"అదీ అయిల్‌రిచ్ నేషనే! ఈ దేశంలో కంటే ట్రినిడాడ్‌లోనే ఉద్యోగం చేయటం సుఖం" అన్నాడు కృష్ణ.

"అందని ద్రాక్షపళ్ళు పులుపు" అంది శ్యామల- కృష్ణ అప్లైచేసినా కువాయిట్‌లో ఉద్యోగం రాకపోవటం గుర్తువచ్చి.

"అందినా ఈ ద్రాక్ష పళ్ళు బావుండవు. ఈ తురకదేశంలో నిన్ను బురఖాలో బంధించుకొని ఉండలేను. నీ ముఖం నల్లనిదే అయినా నగుమోముని చూడకుండా ఉండలేను. మాటిమాటికి ముసుగు తొలగించి నీ ముఖం చూడటం శ్రమతోకూడినపని" అన్నాడు కృష్ణ.

విమానంలో "దయచేసి సీటు బెల్టులు బిగించుకోండి" అన్న అక్షరాలు వెలిగాయి.

విమానం ఒక పెద్దులాంటి కట్టడం ముందర ఆగింది. మెట్లు తీసుకువచ్చి గుమ్మానికి ఆన్చారు. విమానం తలుపు తెరచుకొంది. కాస్సేపట్లో చీపుళ్ళు, తుడిచేగుడ్డలు పుచ్చుకొని శుభ్రపరిచే జనం ఎక్కారు. అంతా మగవాళ్ళే- గోధుమరంగు చర్మం, నల్లమీసాలు.

"వీళ్ళకీ, మనకాశ్మీరీలకి చాలాపోలిక ఉంది" అంది శ్యామల.

"మరే" అన్నాడు కృష్ణ.

కూర్చుని కూర్చుని విసుగెత్తిన కృష్ణ లేచి నిలబడ్డాడు. విమానం మళ్ళీ ఎగరటం మొదలుపెడ్తేకాని కాఫీ ఫలహారాలురావు. కృష్ణ వెనక్కిచూశాడు. ఒక సర్దారిణి ఇద్దరు పిల్లల్తో కూర్చుంది. పిల్లలు ముద్దుగా ఉన్నారు. కృష్ణ వాళ్ళని పలకరించాడు. పిల్లలు పళ్ళన్నీ బయటపెడ్తూ నిష్కల్మషమైన నవ్వులు చిందించారు.

సర్దారిణి "టైమెంత?" ౘని కృష్ణని అడిగింది.

"ఇండియన్ స్టాండర్డ్ టైములో తొమ్మిది గంటలైంది" అని చెప్పాడు కృష్ణ.

కృష్ణ తలుపు దగ్గరికి నడిచాడు. బయట ఎండ పొద్దున్న 7 గంటల ఎండలా కనిపించింది. తలుపుగుండా బయటకి నడిచి మెట్లమీద నిలబడి చుట్టూ చూశాడు. ఎడార్లలో రాత్రి చలిగా ఉంటుందన్నదానికి నిదర్శనంగా బయట పొగమంచు పల్చబడుతూ కనిపించింది. ఏమీ లేకపోవటంతో ఎక్కువసేపు అలా చూడలేక అతను తన సీటువైపు నడిచాడు. శ్యామల కిటికీపక్క సీట్లో నిద్రలోకి జారుకుంది.

కృష్ణ కూర్చోవటం విసుగనిపించి నిలబడే ఉన్నాడు. మళ్లీ వెనకాల సీట్లలోని కుటుంబంవైపు దృష్టి సారించాడు. కృష్ణ తమకేసి చూడటం గమనించి సర్దారిణి ఓసారి వళ్లు విరుచుకొని భుజాలతో తన స్తనాల రెండువైపుల నొక్కుకుంది. అవి లోతు మెడ కమీజులోంచి పైకుబికాయి. కృష్ణ అటు చూసినందుకు సిగ్గుపడుతూ చూపుతిప్పుకోబోతుంటే ఆమె చేతులు మామూలుగా పెట్టుకొని భుజాల్ని వదులుచేసి "బోరుకొట్టున్నదను కొంటాను మీకు" అంది నవ్వి.

"నిజమే... కాని ఏంచేస్తాం?" అని కృష్ణ మాట పొడిగించకుండా సీట్లో కూర్చున్నాడు.





కొద్దిగంటలు కలిసి ప్రయాణం చేసే వాళ్ల మధ్య జరిగే ఫ్లర్టింగ్ వల్ల లాభం ఏమిటో? రైళ్లల్లో ప్రయాణాలు చేసేవాళ్లు చిరునామాలు ఇచ్చి పుచ్చుకొంటారు- తరువాత వెళ్లి చచ్చేది లేకపోయినా. అల్లాంటిదే ఇదీ. లేకపోతే ఈ కాస్సేపు ప్రయాణంలో ప్రమాదరహితమైన చిన్న అనుభవాలవల్ల కాస్త థ్రిల్ పొందితే నష్టం లేదన్నది ఆమె అభిప్రాయం కావచ్చు అనుకొన్నాడు.

సీటు బెల్టులు పెట్టుకోమన్న సూచన వచ్చింది. విమానం లోపల ప్రెషర్ సర్దుకొని గాల్లోకి లేచింది. అమ్మయ్య పొద్దుటి ఫలాహారా లు వస్తాయి ఇంక. ముఖ్యంగా కడుపులో ఒక కప్పు కాఫీ వర్తుంది. శ్యామల తోడు లేకుండా ఉండలేకపోవటం ఒక బలహీనత! ఒక్క కాఫీ, పొగాకు, తాంబూలం, తాగుడు, మత్తు మందు లు ఇవన్నీ మనుమలు అలవాటువడితే అవి లేకుండా ఉండలేకపోయేటట్టు చేసే గుణం కలవే. ఎడిక్ట్ అవటం అవకపోటం మనిషి నిజాన్నిబట్టిఉంటుంది. తను తాగుతాడు. కాని ఎడిక్ట్ కాదు. స్మోక్ చేస్తాడు రెగ్యులర్‌గా కాని స్మోక్ చెయ్యకుండా నెలలతరబడి ఉంటాడు. దాని లోటు అనుభవించడు. శ్యామల అలా కాదు పొద్దున్నే కాఫీ ఉండాలి. పాలవాడు ఆరున్నర లోపల రాకపోతే చాలా ఇబ్బంది వస్తుంది.

ఎయిర్‌హోస్టెస్ బ్రేక్‌ఫాస్ట్ తెచ్చింది. కృష్ణ శ్యామలను లేపాడు. ముందున్న బల్ల చెక్కలు అమర్చాడు.

శ్యామలకి తిండి అంతగా అవసరం లేదు. సగం కృష్ణకి ఇచ్చేసింది. తృప్తిగా తిన్నాడు కృష్ణ. "ఈ మనిషి అంత తిండి తింటూ కూడా సన్నగా ఉంటాడేమిటి!" అని ఆశ్చర్యపడ్తుంది శ్యామల.

ఎయిర్ హోస్టెస్ కాఫీ ఇచ్చింది. శ్యామల గబగబా తాగి మరోకప్పు పోయించుకొని తా గింది.

బ్రేక్‌ఫాస్ట్ ముగిశాక టాయిలెట్లకి వెళ్లే కార్య క్రమం మొదలైంది. సర్దారిణీ పిల్లల్నిద్దరిని ఒకరి తరువాత ఒకరిని తీసుకువెళ్లింది. ఆ సమయంలో కృష్ణ సీటు ఎదురుగా నిలబడి కమీజు సర్దుకోవటం, జుట్టు సరిచేసుకోవటం చేస్తూ అతని దృష్టిని ఆకర్షించడానికి ప్రయ త్నాలు చేసింది.

"లండన్‌కేనా?" అని అడిగింది.

"పోర్ట్ ఆఫ్ స్పెయిన్ వెళ్తున్నాం. లండ న్‌లో ఒకరోజు ఉంటాం" అన్నాడు కృష్ణ.

"నేను లండన్ వరకే. మా ఆయనకి బిజి నెస్ ఉంది లండన్‌లో. పంజాబ్‌లో మా చుట్టా లను చూద్దామని వెళ్లాను" అంది ఆమె.

"ఆఁహా!"

ఆమె ఇమిగ్రెంట్ అన్నమాట. ఇంగ్లండులో వీళ్లని తెల్లవాళ్లు చాలా తక్కువగా చూస్తారుట. మాటిమాటికి "పొండి మీ దేశం" అంటారుట. అలాంటి పరిస్థితుల్లో తనుండలేడు.

"ఆనాడు మీరు మా దేశాల్లో ఉన్నారు కనక మేమీరోజు మీ దేశంలో ఉన్నాం. అప్పుడు మీరు రాకుండా ఉంటే ఇప్పుడు మీకీసమస్య ఉండేది కాదు" అంటారు వీళ్లు.

"మీకు ట్రినిడాడ్‌లో బిజినెస్ ఉందా?" ఆమె మళ్లీ అడిగింది.

"లేదు. నాకు యూనివర్సిటీ ఆఫ్ వెస్ట్ ఇండీస్‌లో లెక్చరర్ ఉద్యోగం వచ్చింది".

"మొదటిసారేమో కదా?"

"అవును... లండన్ కూడా మొదటిసారే! అసలు విదేశాలు వెళ్లటం కూడా మొదటిసా రే"

"లండన్‌లో మిమ్మల్ని ఇమిగ్రేషన్‌వాళ్లు అల్లరిపెట్టాలని చూస్తారు. టెల్ ద బాస్టర్డ్స్ టు గో టు హెల్" అంది. "అలాగే చెప్తాను" అన్నాడు కృష్ణ నవ్వుతూ.

ఆమె కూడా మనోహరంగా నవ్వింది. అప్పు డే టాయిలెట్‌లోంచి బయటకు వచ్చిన శ్యా మల ఇద్దరివైపు తీక్షణంగా చూసింది. సర్దారి ణి వెళ్లి తనసీట్లో కూర్చుంది.

శ్యామల కృష్ణ పక్కన కూర్చుంటూ, "ఏమంటోందావగలాడి?" అని అడిగింది.

కృష్ణ చెప్పాడు. శ్యామలకి పూర్తిగా నమ్మకం కలగలేదు. అందులో అంతలా నవ్వుకు నేందుకు ఆమెకు ఏమీ కనబడలేదు. కాని బయటికి ఏమీ అనలేదు. ఆమె విదేశాల్లో భర్తల్ని పరస్త్రీల నుంచి రక్షించుకోవాల్సిన

అవసరం గురించి చాలా చదివింది. వింది. సినిమాలు చూసింది. కృష్ణ సార్థక నామధేయు డు కాదు ఇంతవరకు! ఇకముందట ఏమో! తన జాగ్రత్తలో తనుండాలి.

లండన్ దగ్గరవుతున్నకొద్దీ కృష్ణకి బెంగ మొదలైంది. శ్యామల మాత్రం నిశ్చింతగా చేతులు ఆన్చుకోడానికి ఏర్పాటుచేసిన అడ్డుని నిలబెట్టి చెవిదగ్గర పెట్టుకొని బాలమురళి పాడిన రామదాసు కీర్తనలు వినటంలో లీనం అయింది.

అతనికి స్నేహితులు చెప్పారు. హీత్రూ ఎయిర్‌పోర్ట్‌లో ఇమిగ్రేషన్‌వాళ్లు ఎంత ఇబ్బందిపెడ్తారో. కాన్ఫరెన్సుకి హాలెండ్ వెళ్లి అక్కడనుంచి లండన్‌వెళ్లిన తన తోటి అసిస్టెంట్ ప్రొఫెసర్ని "నువ్వు ఎయిర్‌పోర్ట్ దాటి ఎందుకువెళ్లటం?" అని అడిగారుట అతను చెప్పాడు.

"లండన్ చూడటానికి" అంటే—

"మీ ఇండియన్సు దేశంలో అడుగుపెడ్తే మళ్లీ కనిపించకుండా పోతారు. ఎంట్రీ ఇవ్వ ము" అన్నారుట.

లండన్‌లో ఎంట్రీ ఇస్తే ఆరునెలలదాకా ఇంగ్లండులో కామన్‌వెల్తు దేశాల ప్రజలు ఉండవచ్చు. చిన్న దేశం. ఎక్కువ జనాభా! వాళ్ల భయం వాళ్లది!

కాని వెధవ ఇంగ్లండ్‌లో తను ఛస్తే ఉండ డు. అందుకే ఎప్పుడూ ఇంగ్లండ్‌లో ఫెలోషిప్ గ్గానిఉద్యోగానికిగానీప్రయత్నించలేదు. వైట్ సుపీరియారిటి తనకి నచ్చదు. ఒకప్పుడు తాము పాలించిన ఇండియన్లపట్ల వాళ్లకి గౌర వంలేదు. తనని గౌరవించని చోట తను ఉండ డు. దేశం చూడటంవేరు— అదో సరదా. తన్ని ఇమిగ్రేషన్‌వాళ్లు ఏమన్నాఅంటే "పో వోయి మీ బోడి దేశంలో నేను ఉండమన్నా ఉండను" అని చెప్తాడు.

లండన్‌టైము పదకొండు గంటల ప్రాంతంలో విమానం హీత్రూ ఎయిర్‌పోర్ట్‌లో దిగింది. పదినిముషాల్లో శ్యామల, కృష్ణ ఓవర్‌కో ట్లు తీసుకొని విమానందిగారు. బాగేజ్ కౌంటర్ల దగ్గర బాగేజ్‌కోసం నిలబడ్డారు. అక్కడ అన్ని ఖండాల దేశాల జనం ఉన్నారు. పొడుగాటి తెల్ల అంగీలతో కాఫీరంగు ఆఫ్రికన్లు శ్యామ లని, కృష్ణని ఆకర్షించారు. ఆడమగ కూడా చాలా ఒడ్డూపొడుగు ఉండి చందనపు బొమ్మ ల్లా కనిపించారు. కొందరి వెంట నలుగురైదు గురు భార్యలున్నారు.

కన్వేయర్ బెల్టుల మీద సామాన్లు రావటం మొదలైంది. కృష్ణ పెట్టె ఒక బెల్టుమీద, శ్యా మల పెట్టె మరో బెల్టు మీద వచ్చాయి. కృష్ణ వెళ్లి క్యూలో నిలబడి ఒక సామాన్లు తోసుకువెళ్లే ట్రాలీ పట్టుకువచ్చాడు. దానిమీద పెట్టెలు, హేండ్‌బాగ్‌లు పెట్టి దారి తెల్పే గుర్తులు చూసుకొంటూ ఇమిగ్రేషన్ చెక్ దగ్గరకి వచ్చా రు. మళ్లీ క్యూ. కాని పదినిముషాల్లో వాళ్లవంతు వచ్చింది. ట్రాలీ మీద నుంచి సామాన్లు దింపి పాస్‌పోర్ట్‌లు తీశాడు.

"మీరు లండన్ ఎందుకు వచ్చారు?"

"చూడటానికి"

"ఎన్నిరోజులుంటారు?"

"ఒకరోజు"

"ఇక్కడనుంచి ఎక్కడకు వెళ్తారు?"

"ట్రినిడాడ్"

"పూర్వం యు.కె.వచ్చారా?"

"లేదు"

"వెరీవెల్ సర్... హావ్ ఎ గుడ్ టైము" అని పాస్ పోర్టులమీద అనుమతి ముద్ర వేశాడు. తను విన్నది వేరు— చూస్తున్నది వేరు. బహు శదేశంలోకి వదిలితే మళ్లీ విడవరని అనిపించిన వారి విషయంలో ఎక్కువ నిక్కచ్చిగా ఉంటా రేమో. స్వతంత్రం రాకముందు పుట్టిన తరంవారు బ్రిటిష్‌వారి పొగరు గురించి వర్ణించి చెప్పే కథల ఆధారంగా, సరైనపత్రా లు లేకుండా ప్రయాణం చేసే సాహసికులు పడే ఇబ్బందులు వినీ తాను ఏర్పరచుకొన్న అభిప్రాయాలు ఉత్త నీటి బుడగలా? అప్రాచ్యు లు, మ్లేచ్ఛులు అయిన తెల్లవాళ్లు మరీ అంత దారుణం కాదేమో!

ఆ ఆవరణలోంచి బయటపడ్డారు శ్యా మలా, కృష్ణా. బయట జనసందోహం. ప్ర పంచంలో జనం అంతా అక్కడే ఉన్నంతకోలా హలం. జనం అట్టలు పుచ్చుకొని కీచుగా అరుస్తున్నారు. ఒక అట్ట మీద తన పేరుచూసి



అతను ఆశ్చర్యపోతుంటే అదివట్టుకొన్న వ్యక్తి—

"కృష్ణా... ఇటూ" అని అరిచాడు, ఆ వ్యక్తి.

వెంకట్రావు తనకోసం వచ్చాడు. అంత మంది జనంలో తనని సులభంగా గుర్తించేందుకు ఆ అట్టవట్టుకొన్నాడన్నమాట. బావుంది. పక్కనే అతని భార్య సీత ఉంది.

"వెల్‌కమ్ టు లండన్" అన్నారు సీత, వెంకట్రావులు.

సామాన్లు ట్రాలీలో తీసుకొంటూ బయటకి వచ్చారు. ఏప్రిల్ నెల చివరైనా చలిగాలి గజగజలాడిస్తోంది. వెంకట్రావు వెళ్లి కారు తెచ్చాడు.

★ ★ ★

వెంకట్రావు ఇల్లు హీత్రూ ఎయిర్ పోర్ట్‌కి దగ్గరగా అనలుసిసలైన లండన్‌కి దూరంగా ఉంది. వెంకట్రావు కోసం ప్లేన్‌లో కొన్న డ్యూటీ ఫ్రీ బ్లాక్ లేబుల్ జానీవాకర్ తీసి బయటపెట్టాడు కృష్ణ.

"సీతా... నువ్వు భోజనాలకి ఏర్పాటు చెయ్యి! నేను డ్రింక్స్ మిక్స్ చేస్తాను" అన్నాడు వెంకట్రావు. తనకి విస్కీ ఆన్ రాక్స్ కలుపుకొని, కృష్ణకి విస్కీ విత్ సోడా ఇచ్చాడు.

"సీతా... నీకేం ఇవ్వను"?

"జిన్. శ్యామలగారూ— మీరు జిన్ తీసుకొంటారా లేక స్వీట్‌వైన్?" అని అడిగింది.

శ్యామల ఆశ్చర్యపోయింది సీత అల్లా అడిగినందుకు— "కోక్ చాలు" అంది.

"మొహమాటపడకండి. ఇక్కడ ఆడవాళ్లు డ్రింక్ చెయ్యటం చాలా కామన్. ఓకే వెంకూ— గివ్‌హర్‌వైన్ — స్వీట్‌వైన్. నాకు జిన్ విత్‌లైమ్"

శ్యామల మొహమాటపడ్తూ తీసుకొంది. జీవితంలో అదే మొదటిసారేమో కొంచెం భయపడ్తూ రుచిచూసింది. రుచి బావుండటంచేత త్వరగా తాగింది. ఖాళీకడుపుమీద తాగటం అందులోను గబుక్కున తాగటంవల్ల తల తేలికైనట్టుగా అనిపించింది. ఆ అనుభవం శ్యామలకి నచ్చింది. సీత ఏర్పాట్లు చేస్తూ జిన్ అప్పుడప్పుడు సిప్ చేస్తూ తాగింది. ఆలోపల వెంకట్రావు, కృష్ణా రెండు సార్లు తాగారు.

అన్నందగ్గర ఆవకాయ, పెరుగుచూసి "ఇక్కడ అన్నీ దొరుకుతాయన్నమాట" అన్నాడు కృష్ణ.

"శుభ్రంగా దొరుకుతాయి. వెంకూకి పెరుగు చాలా ఇష్టం. తనే తోడు పెట్టుకొంటాడు. మామూలుగా మేము రాత్రిమాత్రమే భోంచేస్తాం. ఆదివారం కదా ఇవాళ కొంచెం మధ్యాహ్నపు భోజనం బరువు అయినా ఇబ్బంది లేదని అన్నం వండాను" అంది సీత.

భోజనం ముగించేసరికి మూడుగంటలైంది.

"ఏమేమి చూస్తారు?" అని అడిగాడు వెంకట్రావు.

"నాకు చిన్నప్పటి నుంచి లండన్ ట్యూబ్ రైల్లో ప్రయాణం చెయ్యాలని కోరిక. అది చేస్తే నాకు లండన్ చూసినట్టుంటుంది" అన్నాడు కృష్ణ.

"ఇండియన్స్ షాపులున్న సౌతాల్ ప్రాంతం చూస్తాను" అంది శ్యామల.

"ఇంకేం చూడరా?" అని అడిగింది సీత ఆశ్చర్యంగా.

"రేపు పన్నెండు గంటలకి రిపోర్టింగ్ టైము కదా! అందుకని పొద్దున్న ఎక్కడకీ వెళ్లలేము. ఈ సాయంత్రం మీరేమి చూపిస్తే అది చూస్తాం" అన్నాడు.

"ఈమధ్య మా బాబయ్య వచ్చి రెండు వారాలుండి వెళ్లాడు. ఉన్నన్నాళ్లు స్ట్రిప్ టీజ్‌లు బ్లూ మూవీస్ చూస్తూ గడిపాడు. అంత పెద్దవాడే అల్లాంటివాటికి సరదా పడ్తే మీకు ఇంటరెస్టు ఉంటుందనుకొన్నాను" అంది సీత నవ్వుతూ.

"ఛఛ... మాకు అల్లాంటి సరదాలు లేవు" అంది శ్యామల. ఆమె సీత నోటి నుంచి అటువంటి ప్రపోజల్ వచ్చినందుకే ఇబ్బంది పడింది.

"తప్పేంలేదు కృష్ణా! ఆమధ్య మేము బొంబాయిలో ఉండే రోజుల్లో ఆంధ్ర సభకి ఎంతోమంది పెద్దలనుంచి సహకారం లభించింది. సహాయం చేసినవాళ్లలో మంత్రు





లున్నారు. ఆ మంత్రులతో నాకావిధంగా పరిచయం ఉంది. వాళ్లెప్పుడైనా లండన్ వస్తే మా ఇంట్లో తాగినంత తాగి వీలైనన్ని సెక్స్‌షోస్ చూసి మరీ వెళ్తారు. అందులో అరవైయేళ్లు దాటిన పెద్దలున్నారు. వాళ్లకిల్లాంటి కోర్కెలున్నాయని మనం ఇండియాలో ఎవర్తో అన్నా చెప్తే నమ్మరు కూడాను. కనుక లీవ్ యువర్ ఇన్‌హిబిషన్స్— జీవితంలో సుఖపడదలుచుకొంటే!'' అని బోధించాడు వెంకట్రావు.

''థ్యాంక్స్! వెంకట్రావు. శ్యామలకల్లాంటివి నచ్చవు. నాకు వాటిమీద కోర్కెలేదు— మీరు మరేమైనా సూచించండి'' అన్నాడు కృష్ణ.

వెంకట్రావు ''మేడమ్ తుస్సాడ్స్ వాక్స్ హౌస్ చూద్దాం'' అన్నాడు. సీత ''సొతాల్ చూపిస్తాం'' అంది.

నలుగురూ ఓవర్‌కోట్లు వేసుకొని ట్యూబ్ ఎక్కడానికి స్టేషన్‌కి నడిచారు. రోడ్లు, ఇళ్లు, షాపులు చూస్తుంటే కొత్త దేశంలో ఉన్న అనుభూతి కలగలేదు. మద్రాసులోనో బొంబాయిలోనో నడుస్తున్నట్టుగా ఉంది. రెండే తేడాలు. మొదటిది చలి. రెండోది నల్లవాళ్లకంటే తెల్లవాళ్లు రోడ్ల మీద ఎక్కువ కనిపించటం. తెల్లవాళ్లు ఎక్కడకి వెళ్లినా ఆ దేశాల రూపురేఖలు తమ దేశపు పోలికల్లో తీర్చిదిద్దారన్న మాట చాలా నిజం అనుకొన్నారు కృష్ణ, శ్యామలలు.

ట్యూబ్ ఎక్కాక అది చాలా సాధారణంగా ఇండియన్ సబర్బన్ రైలులా అనిపించింది. జనం తెల్లవాళ్లు. తింటున్నవి హాట్‌డాగ్స్, చదువుతున్నవి గార్డియన్‌లు. మిగిలిన ప్రపంచంతో సంబంధంలేనట్టుగా తలుపుల దగ్గర, సీట్లలోను కూర్చున్న యువజంటలు అదేపనిగా తమకంగా కౌగిలించుకొని ముద్దులు పెట్టుకొంటుంటే కొంచెం ఆశ్చర్యంగాను, మరి కొంచెం సిగ్గుపడుతూనూ శ్యామల, కృష్ణ వాళ్లని చూశారు.

''కావాలంటే మీరూ ప్రయత్నించండి'' అంది సీత వెంకట్రావు చుట్టూ చేతులు వేస్తూ.

''ఈవిడకు లండన్ వచ్చాక బొత్తిగా సిగ్గు తగ్గింది. మరీ కామపరమైన సంభాషణలు, చేష్టలూను!'' అనుకొంది శ్యామల. నిజానికి సీత లండన్‌లోని జీవనవేగానికి బాగా అలవాటుపడిపోయింది. తను ఇండియన్ అని గుర్తుపెట్టుకొంటే ఉద్యోగం చెయ్యలేదు. తెల్లవాళ్ల మధ్య వాళ్లలాగా వాళ్ల పద్ధతిలో యాంత్రిక జీవనం గడుపుతుంది. ఎప్పుడైనా తెలిసినవాళ్లు ఇండియా నుంచి వస్తే ఆమెకు తను ఇండియన్ అన్న విషయం గుర్తుకు వస్తుంది. తను ఇండియాలో గడిపిన జీవితానికి, ఇక్కడి జీవితానికి తేడా గుర్తుకు వస్తుంది.

''వాక్స్‌హౌస్''లో బొమ్మలు నిజం మనుషులే అని భ్రమించేలా ఉంటాయని చెప్తారు. అందుకని తాము భ్రమపడ్తారేమో చూడాలని శ్యామల, కృష్ణ శ్రద్ధగా బొమ్మల్ని పరికించసాగారు. బొమ్మలు నిలువెత్తులో ఉన్నా ఎక్కడో బొమ్మలని తెలిసిపోతున్నాయి— అనుకొన్నారు.

''జీవం దేముడే పొయ్యాలి. మనుషులు పొయ్యలేరు'' అంది శ్యామల.

''నిజం'' అంది సీత.

''ఎక్స్‌క్యూజ్‌మీ'' అని కృష్ణ ముందున్న మనిషి తప్పించుకొని ముందుకు పోబోయాడు.

ఆ మనిషి నవ్వుతున్నాడు. ఎవరో తెలిసినట్టుందే అని తేరిపార చూశాడు. ఆ మనిషి మనిషి కాదు బొమ్మ. అక్కడున్నవన్నీ ప్రఖ్యాత పురుషుల బొమ్మలే కనుక పరిచయం ఉన్న మొహంలా తోచింది. కృష్ణకి తన భ్రమకి నవ్వు వచ్చింది. ఇంతసేపు తను భ్రమపడ్తాడేమోనన్న జాగ్రత్తలో ఉండి బొమ్మల్ని బొమ్మలుగా గుర్తించాడు. ఒక్కక్షణం ఆదమరిచి ఉండేసరికి భ్రమకి లోనైపోయాడు. గొప్ప కళాకారుల ప్రజ్ఞ అటువంటప్పుడే అర్థమయ్యేది. తరువాత శ్యామలకూడా రెండు మూడుచోట్ల భ్రమపడినట్టు కృష్ణతో చెప్పింది. ఆ మ్యూజియం నుంచి నవ్వుకొంటూ బయటపడ్డారు.

ఆక్స్‌ఫర్డ్ సర్కస్ చుట్టుపట్ల నడుస్తూ ఉంటే బొంబాయి, మద్రాసు రాతి కట్టడాలు గుర్తుకు వచ్చాయి. అంతా తెలిసిన ప్రదేశంలా అనిపించింది. ఆ ప్రదేశం అంతా తెల్లటి విదేశీ యాత్రికులతో నిండి ఉన్నట్టు తోచింది.

అక్కడ్నుంచి వాళ్లని సీత, వెంకట్రావ్ సొతాల్‌కి తీసుకువెళ్లారు. అక్కడ అన్నివిధాల



ఇండియాలోలాగానే ఉంది. అటూఇటూ వనుల మీద తిరుగుతున్నవాళ్లు కూడా ఇండియన్లే. బీరు షాపులు, నగల షాపులు, ఇండియన్ హోటళ్లు ఉండి ఆ ప్రదేశం లండన్ లాగా అనిపించలేదు.

చిన్నప్పటినుంచి తెలుగువాళ్లు లండన్ వెళ్లటం ఓ గొప్పకింద భావించి మాట్లాడ్తూ ఉండటంతో లండన్ ఏదో గొప్పగా ఉంటుందన్నభావం కృష్ణ మనస్సులో నాటుకుపోయింది కాని లండన్ చూస్తుంటే ఏమీ గొప్పగా అనిపించక చప్పగా, నిరుత్సాహంగా అనిపించింది. అటువంటి భావమే మద్రాస్‌లో ఓ అందాల నటి యొక్క షూటింగ్‌కి వెళ్లినప్పుడు కలిగింది. ఆశించనిది ఎక్కువైతే అనుభవం తక్కువౌతుంది. ఏమీ ఆశించకపోతే ఉన్నదే అద్భుతంగా అనిపిస్తుంది.

ఇంతలో షాపులవాళ్లు షట్టర్స్ దించేయటం మొదలుపెట్టారు. పోలీసు కార్ల హారన్లు మోగటం మొదలుపెట్టాయి. స్కిన్ హెడ్స్ ఏషియన్సుని ఎటాక్ చేశారుట. ఇండియన్సు కొంతమంది ఒక దళంగా ఏర్పడి వాళ్లని ఎదుర్కొంటున్నారుట అటువైపు. గొడవ ఇటువైపుకి సాగుతుందని షాపులు మూసేస్తున్నారు. పూర్వం ఏషియన్సు తెల్లవాళ్ల దౌర్జన్యానికి తలవంచి పిరికివాళ్లుగా పేరు సంపాదించారని, అందుకని తాము ఏమి చేసినా అడ్డులేకుండా చెల్లిపోతుందని పనీపాటల్లో శ్రద్ధ లేని తెల్ల యువతీయువకులు కొందరు ఇదో కాలక్షేపంగా పెట్టుకొన్నారని అయితే ఈమధ్య ఆసియా జాతివారు ఎదురుతిరుగుతున్నారని వెంకట్రావు చెప్పారు.

నిజమైన లండన్ కృష్ణకి, శ్యామలకి ఆక్షణంలో అనుభవంలోకి వచ్చింది.

"లండన్ దర్శన్ ఇంకచాలు— ఇంటికి పోదాం" అన్నాడు కృష్ణ.

"అలా పిరికితనం చూపిస్తే లండన్‌లో బతకలేము" అన్నాడు వెంకట్రావు.

"మేము లండన్‌లో బతకబోవటంలేదు కదా" అంటూ నవ్వాడు కృష్ణ.

నలుగురూ ఇంటిమొహం పట్టారు.

* * *

పన్నెండు గంటలకల్లా హీత్రూ విమానాశ్రయం జేరారు. ఆ రోజు ఆదివారం అవటంతో వెంకట్రావుకి, సీతకి ఇబ్బంది లేకపోయింది. లండన్ ఎయిర్‌పోర్ట్‌లో తమ టికెట్లు, పాస్‌పోర్టులు చూపించారు. బి.ఏ. (బి.ఐ.డబ్ల్యు.ఐ.) వారి ప్రతినిధులు వర్క్‌పర్మిట్ చూపించమన్నారు. చూపించాక లగేజ్‌తీసుకొని బోర్డింగ్ పాస్‌లు ఇచ్చారు.

సీత- వెంకట్రావుల దగ్గర సెలవుతీసుకొని సెక్యూరిటీ చెక్‌ద్వారా లోపలికి వెళ్లారు. ఓ గంట తరువాత బీఏ వారి పిలుపు వచ్చింది. ఎయిర్‌పోర్ట్ ఎన్‌క్లోజర్ నుంచి టన్నెల్‌లాంటి దాంట్లో నడిచివెళ్లారు. అది తిన్నగా ఎక్కవలసిన విమానం దగ్గరకు దారితీసింది. ఆ మార్గాన్ని విమానాన్ని బయటి చలిగాలి దూరని విధంగా మడతపెట్టగలిగే పదార్థంతోచేసిన ఆవరణలో కలిపారు. ఈ పద్ధతిలో అన్ని విమానాల్లో తమ విమానం ఏదో వెతుక్కోవలసిన శ్రమలేదు. ఫలానా ఫ్లయిట్‌కి ఫలానా నంబర్ టన్నెల్‌లోంచి వెళ్లండి అన్న సూచనలని గమనిస్తేచాలు- మరేరకమైన తికమకలేదు.

విమానంలో నల్లగా నిగనిగలాడ్తూ, గుండులా అనిపించే తలకట్టుకల అమ్మాయిలు సీట్లు చూపించారు. వాళ్ల యూనిఫామ్ కూడా నీలంరంగులో చాలా సాదాగా ఏ ఆకర్షణా లేకుండా అనిపించింది. నీగ్రోజాతివారిని అంత దగ్గరగా చూడటం అదే మొదటిసారి అవటంతో కృష్ణ- శ్యామల వాళ్లని ఆశ్చర్యంగాను, కొత్తగాను చూశారు.

"ఎలా ఉన్నారు ఈ గుండు పిల్లలు?" అని అడిగింది శ్యామల.

"ఫిరంగిగుండుల్లా" అన్నాడు కృష్ణ.

ఇద్దరూ నవ్వుకున్నారు.

"మనకి తెలుపు కిట్టినట్టు నలుపుకిట్టడం లేదు" అన్నాడు కృష్ణ.

"అలవాటులేక" అంది శ్యామల.

"నల్లవారిలో కొన్నాళ్లుపోయాక అందాలు చూడగల్గుతాం అనుకొంటాను"

"మీరేం ప్రయత్నించి అందాలు వెతుక్కోనక్కర్లేదు. మీకు వాళ్లలో ఏ అందాలు కనిపించకపోతేనే నయం" అంది శ్యామల. ఆ మాటల్లో





ఆమె జాగ్రత్త ధ్వనించింది కృష్ణకి.

అందరూ ఎక్కాక విమానం తలుపుమూశారు. అప్పుడు గుండుపిల్లలు పైనవేసుకొన్న ఓవర్‌ఆల్‌లాంటిది విప్పిపారేసారు. అంత మందిముందు ఆ అమ్మాయిలు పైబట్టలు విప్పుతుంటే కృష్ణ- శ్యామల ఆశ్చర్యపోతూ చూశారు. లోపలవాళ్లు రంగుబనియనులాంటి టాప్ మిడిలాంటి స్కర్ట్ వేసుకొన్నారు.

"వస్త్ర విసర్జన ఇక్కడితో ఆగిపోతుందనుకొంటాను" అన్నాడు కృష్ణ తెలుగులో శ్యామలతో.

"ఆగిపోతుంది... మీ ఆశ నెరవేరదు"

"ఆశకాదు? భయం."

"పోదురూ బడాయిలు. మగవాళ్లసంగతి నాకు తెలియదా?"

ఇంతలో కప్తాన్ వచ్చాడు. అచ్చు భారతీయుడిలాగా ఉన్నాడు. వెస్టిండీస్‌లో ఇండియన్ జాతివారు కూడా చాలామంది ఉన్నారని విన్నారు.

"తెలుగువాడిలా ఉన్నాడు" అంది శ్యామల ఆశ్చర్యంగా.

"కొంచెం రంగుతక్కువైన భారతీయజాతి అంతా ఒకలాగానే ఉంటారు" అన్నాడు కృష్ణ.

విమానం గాలిలోకి లేస్తుంటే కప్తాన్ పేరు మూన్‌సామి అని తెలిసింది.

కృష్ణకి- శ్యామలకి వెస్టిండీస్‌లో తాము కలిసి జీవించబోయే నీగ్రోజాతి, భారతజాతి మనుషులతో విమానంలోనే ఒక అభిప్రాయం ఏర్పడింది. తెల్లవాళ్లకంటే నల్లవాళ్లు మంచివాళ్లు. మనం, వాళ్లుకూడా నల్లవాళ్లమే! మనం, వాళ్లుకూడా తెల్లవారిచేత పాలితులము, పీడితులము, బాధితులము కనుక మనకి వాళ్లకి చాలా సానుభూతి సహకారాలుండి ఉంటాయి పశ్చిమ ఇండీస్‌దీవులలో అనుకొన్నాడు కృష్ణ.

ఎయిర్‌హోస్టెస్‌లు జ్యూస్‌లు సర్వ్‌చెయ్యటం మొదలుపెట్టారు. ఆ అమ్మాయిలతో ఒక యాభైయేళ్ల అతను చాలా చనువుగా మాట్లాడుతూ నవ్విస్తున్నాడు. అతను పొట్టిగా ఎర్రగా తెల్లనిజుట్టు వెనక్కి దువ్వుకొని ఉన్నాడు. హాలీవుడ్ సినిమాల్లో రెడ్ ఇండియన్ చీఫ్‌లా ఉన్నాడు. నల్లటి అమ్మాయి అతనికి జ్యూస్ ఇవ్వగానే-

"థాంక్స్!" అంటూ ఆ అమ్మాయి పొత్తికడుపుమీద చేతితో చిన్నగాతట్టి మెచ్చుకొన్నాడు. ఆ అమ్మాయి చిన్నగానవ్వి ఊరుకొంది. అంతేగాని తనని అతను అక్కడ ముట్టుకొన్నందుకు ఏ విధమైన అభ్యంతరం చెప్పలేదు.

శ్యామల జరిగినదానినిచూసి భయంగా తమ భవిష్యత్తుని ఊహించింది.

"ఆరెంజిజ్యూస్ కావాలా? ఏపిల్ జ్యూస్ కావాలా?" అని అడిగింది ఆ అమ్మాయి కృష్ణని, శ్యామలని.

"ఏపిల్‌జ్యూస్. థాంక్స్"

కృష్ణ ఆ అమ్మాయిపొత్తికడుపుని తట్టలేదు ఇంకానయం- అనుకొంది శ్యామల.

"పశ్చిమ దీవులలో వ్యవసాయం ఎక్కువ. బోలెడన్ని కొబ్బరికాయలు, మామిడిపళ్లు! మనం వరల్డ్ ఇన్ కలర్ పుస్తకంలో చూశాంకదా" కృష్ణ శ్యామలకి గుర్తుచేశాడు.

వెస్టిండీస్‌లో ఉద్యోగం వచ్చినప్పటినుంచి ప్రపంచదేశాల గురించి అచ్చయిన పుస్తకాలు ఎవరిదగ్గరైనా ఉంటే తెచ్చి అందులో వెస్టిండీస్ గురించి చదివారు. ట్రినిడాడ్ హైకమిషన్‌కి రాస్తే వాళ్లు ట్రినిడాడ్ గురించి సైక్లోస్టయిల్డ్ నోట్సు పంపారు.అందులో ట్రినిడాడ్ స్వాతంత్ర్యం పొందటం, ఆనాడువారు స్టీల్‌బాండ్ వాయించటంమించి మరే సమాచారంలేదు.

జ్యూస్ తియ్యగా ప్రిజర్వేటివ్‌ల ఘాటురుచిలో ఉంది. ఫ్రెష్‌జ్యూస్ దొరకదా ట్రినిడాడ్‌లో!

విమానం లండన్‌లో బయల్దేరి పోర్ట్ ఆఫ్ స్పెయిన్‌వెళ్లి అక్కడనుంచి జమైకా వెళ్తుంది. పోర్ట్ ఆఫ్ స్పెయిన్ తాలూకు ఎయిర్‌పోర్ట్‌ని పియార్కో ఎయిర్‌పోర్ట్ అంటారుట.

ప్రయాణం చాలా విసుగ్గా గడుస్తోంది. పశ్చిమానికి ప్రయాణం చెయ్యడంతో ఒకపట్టాన పొద్దుగడవడంలేదు. అప్పుడప్పుడు నల్లపిల్లలు జ్యూస్ ఇస్తున్నారు.

కృష్ణ- శ్యామల కూర్చున్న కుర్చీల వరుసలో




దారికి అటువైపున ఒక తెల్లటి అతను యూరో పియన్ ఆరిజిన్ అతను కూర్చుని ఏవో కాయి తాలు చూసుకొంటున్నాడు. ఇంతలో ఒక చైనీస్‌జాతి అమ్మాయి వచ్చి అక్కడ కూర్చోబో యింది.

"ఇక్కడ కూర్చోటానికి వీల్లేదు" అన్నాడు అతను కరుకుగా, ఏవిధమైన మర్యాద ధ్వనించని విధంగా.

"ఈ సీటు నీదేనా?" ఆ అమ్మాయి కోపంగా అడిగింది.

"ఆ" మొండిగా జవాబు ఇచ్చాడు.

"వద్దంటుంటే అతని వక్కనెందుకు కూర్చుంటావు. నావక్క కూర్చో- నాకు కాలక్షేపంగా ఉంటుంది" అన్నాడు ఆ రెడ్ ఇండియన్.

కొందరు గట్టిగానే నవ్వారు. చైనీస్ జాతి అమ్మాయి వెళ్ళి తన సీట్లో కూర్చుంది.

ఆ చిన్న విమానం ఓ నానాజాతి సమితి కార్యాలయంలా ఉంది. అందరూ కొంచెం మోటుగానే ప్రవర్తిస్తున్నారు. అదే పశ్చిమ దీవుల సంస్కృతా అన్న అనుమానం కలిగింది కృష్ణకి, శ్యామలకి.

భోజనం వచ్చింది. "వీళ్లు కూడా మనలాగా మసాలాలు తినే రకాలన్నమాట" అన్నాడు కృష్ణ. "అన్ని స్పైసెస్ దొరికితే ఆడవాళ్లు వంటికి తడుముకోనక్కర్లేదు. దొరకవని భయపడ్డాను" శ్యామలకి ఆ సుగంధద్రవ్యాల వాసన ధైర్యానిచ్చింది.

మరోసారి కాఫీలు, జ్యూస్‌లు ఇచ్చాక అమ్మాయిలు మళ్లీ మాసిపోయినట్టు కనిపించే నీలం యూనిఫామ్స్‌లోకి మారిపోయారు.

"ఇంక కొద్దిసేపట్లో పియార్కో విమానాశ్రయంలో దిగబోతున్నాం. సిగరెట్లు ఆర్పి సీట్ బెల్టులు తగిలించుకోండి" అన్న హెచ్చరిక వచ్చింది.

దిగబోతున్న ఆ పశ్చిమ భారతదీవులకి ఎన్నో కలలతో, ఆశలతో, ఎంతో ఉత్సాహంతో శ్యామల, కృష్ణ వెళ్తున్నారు. అక్కడ డబ్బు ఉంది. "ఈ నెల ఎలా గడపటమా?" అన్న బెంగ ఏ నెలా కలగదు. బోలెడంత డబ్బు దాచుకొని ఇండియావచ్చి ఇల్లు కట్టుకొని కాలు మీద కాలువేసుకొని గడపవచ్చు.

నెమ్మదిగా విమానం దిగింది. కృష్ణ, శ్యామల చేతి సంచీలు తీసుకొని ఆ ద్వీప భూభాగంమీద అడుగుపెట్టారు. తమ పెట్టెలు అందుకొని కస్టమ్స్‌వైపు నడిచారు. భారతదేశం నుంచి వెళ్లేవాళ్ల పెట్టెలు ఖాళీ. వాళ్ల మొహం వాళ్లకేందొరుకుతాయి అనుకొన్నాడు కృష్ణ.

అతని అంచనా తప్పయింది. అతని ముందున్న కొందరు భారతీయులులా కనిపించేవారు ఏవేవో వస్తువులు తెచ్చారు. వాళ్లూ, అక్కడి ఆఫీసర్లూ ఏదో లాలూచీ పడ్డట్టుగా అనిపించింది.

అవినీతి భారతదేశపు హక్కు భుక్తం కాదన్నమాట, అది పశ్చిమ భారతదీవులకి కూడా వ్యాపించిందన్నమాట. కస్టమ్స్‌లో నీగ్రో ఆఫీసర్ను, భారతీయ జాతివారు కూడా ఉన్నారు. శ్యామల, కృష్ణలని త్వరగానే పరీక్షించి ముందుకు పంపారు.

ఇంక ఇమిగ్రేషన్ నుంచి బయటపడాలి.

"మీరు యు.వీలో పన్చేయటానికి వచ్చారా?"

"యుమీన్ యూనివర్సటీ ఆఫ్ వెస్ట్ ఇండీస్"

"హెఁ హెఁ"

"యస్ ప్లీజ్"

"మీ కోసం మీ సెక్రటరీ మిసెస్ డేవీస్ వెయిట్ చేస్తోంది. వర్క్ పర్మిట్ చూపించండి".

కృష్ణ చూపించాడు.

"హెల్త్ సర్టిఫికెట్స్ ప్లీజ్"

కృష్ణ చూపించాడు.

"పాస్ పోర్ట్స్ ప్లీజ్"

కృష్ణ చూపించాడు.

"డాక్టర్స్ సర్టిఫికెట్స్ ప్లీజ్"

"అవేమిటి?"

"మీకు ఇమిగ్రేషన్ ఇవ్వటానికి మీరు డాక్టర్స్ సర్టిఫికెట్ ఇవ్వాలి. పూర్వం

వంపారా?"

"లేదు"

"తెచ్చారా?"

"యూనివర్సిటీవారు తెచ్చుకోమని రాయలేదు"

"ఇవి వాళ్ల కోసం కాదు. మా కోసం వాళ్లు రాయరు".

" ఆ విషయం మాకెలా తెలుస్తుంది"

" తెలుసుకోవాలి!"

"ఎలా?"

"ఇప్పుడు చెప్తున్నాముగా"

"ఇప్పుడు ఎక్కడనుంచితేను?"

"ఒక నెలకి వీసా ఇస్తాం. హెల్త్ సర్టిఫికెట్స్‌తో మా ఆఫీసుకు వచ్చి వర్క్ పర్మిట్ అనుమతించిన కాలానికి వీసా తీసుకోండి"

"అలాగే"

"ప్రొసీడ్"

"డాక్టర్ కిష్నా?"

"యస్... మిసెస్ డేవీస్?"

"యస్"

"వెల్‌కమ్- మీ యిద్దరికి"

"థాంక్స్"

చేతులు కుదుపుకోడం అయ్యాక "మీకు యూనివర్సిటీ కారు పంపిరంది" అని చెప్పిందామె.

"దారి చూపించండి"

ఆమె దారి తీసింది. మాక్సీవేసుకొంది. హై హీల్సు వేసుకొంది. పొడుగుజుట్టు. కాఫీరంగు దేహం. ఇండియన్ ఆరిజిన్నో ఆఫ్రికన్ ఆరిజిన్నో చెప్పుకోడం కష్టం. పేరుబట్టి ఆఫ్రికన్ ఆరిజిన్ అని తోచింది కృష్ణకి.

ఎయిర్‌పోర్ట్ బయటికి వచ్చాక జనం బాగా కనిపించసాగారు. స్త్రీలు ఎక్కువగా ఆంధ్రాలో ముఖ్యంగా తెలుగు సినిమాల్లో బాత్రూమ్ సీన్సులో హీరోయిన్ చీరచుట్టుకొన్నవిధంగా మోకాలు పైనుంచి బాహు మూలాల కిందదాకా ఏకవస్త్ర నిర్మితమైనదాన్ని ధరించారు. భుజాలమీద ఆచ్ఛాదన లేదు. వక్షో పరిభాగాలు బహిర్గతం అయి ఉన్నాయి. ఆ బట్ట జారిపోకుండా ఇలా స్టిక్ పట్టి ఉంచుతుంది కాబోలు అనుకొన్నాడు కృష్ణ.

శ్యామలకి వారి వస్త్రధారణ నచ్చలేదు. సెక్రెటరీని పరిశీలించింది. ఆమె ధరించిన మాక్సీకి మెడ దగ్గర తొడుక్కోవడానికిగాను వీలుగా చేసిన ఖాళీకి గుండీలు అసలు కుట్టిలేవు. "ఈమె ఆఫీసుకు కూడా ఇలాగే వెళ్తుంది కాబోలు" అనుకొంది శ్యామల. "అదృష్టం కొద్దీ ఈమెకు ప్రదర్శించేందుకు పెద్దగా అందం లేదు" అని ధైర్యం చెప్పుకొంది. కాని నగ్నత్వం నలుమూలలా కనిపించింది నర్తిస్తూ. వాతావరణం తేమగా, వేడిగా ఉంది. విశాఖపట్నం, కొచ్చిన్‌లు గుర్తుకువచ్చాయి. వేడి ఎక్కువైనకొద్దీ మనుషులు దేహంలో ఎక్కువ భాగాలకి గాలి పారనిస్తారు.

"లేక ఛస్తారా"అనుకొని సరిపెట్టుకొంది.

మిసెస్ డేవీస్ ముందు దారితీస్తుంటే సామాన్ల ట్రాలీ తోసుకుంటూ కృష్ణ, శ్యామల అనుసరించారు. టాక్సీలో సామాన్లు పడేసి ట్రాలీనీ దానికి నిర్దేశించిన స్థలంలో పెట్టేసి వచ్చాడు కృష్ణ. మిసెస్ డేవీస్ డ్రైవరు పక్కన కూర్చుంది.

ఆ టాక్సీ సన్నని తారు రోడ్డు మీద, గతుకులున్న తారు రోడ్డు మీద, దుబ్బుల మధ్యగా పోతుంటే ఇండియాలో ప్రయాణిస్తున్నట్లే ఉంది. కొత్త అనిపించలేదు.

"బావుందీ దేశం" అన్నాడు మనస్ఫూర్తిగా కృష్ణ.

"నువ్వీ దేశం ఇంకా ఏమీ చూడనేలేదు" అని కృష్ణని మాట్లాడకుండా చేశాడు ఆ నీగ్రో డ్రైవర్.

"ఇండియా కూడా బాగానే ఉంటుందిట కదా?"అంది మిసెస్ డేవీస్ కృష్ణ నొచ్చుకోకుండా.

"మాకు బాగానే ఉంటుంది. ఈ దేశం మాదేశంలానే ఉంటుదనిపిస్తోంది వెదర్‌తో సహా"

"అనిపిస్తుంది. ఈ దేశంలో మీవాళ్ళు సగానికి సగం ఉన్నారు" అన్నాడు డ్రైవర్.

"యూమీన్ మా దేశం నుంచి వంద సంవత్సరాల క్రితం వచ్చిన వారి సంతానం"





"ఏమో- ఎన్ని సంవత్సరాల క్రితం వచ్చారో! నిన్నా మొన్న వచ్చినట్టుగా ఉంటారు. ప్రవరిస్తారు. ఉంటావుగా చూస్తావు!" అన్నాడు డ్రైవర్.

అతనికి ఇండియన్సుపట్ల అంతమంచి అభిప్రాయం ఉన్నట్టు అనిపించలేదు శ్యామలకి.

"మేముండబోయే ఇల్లు యూనివర్శిటీకి దగ్గరేనా?" అని మిసెస్ దేవీస్‌ని అడిగింది.

"నడిచి వెళ్లే అంత దగ్గర. కాని ఈ దీవిలో ఎవరూ నడవటంలేదు ఈ కార్లు వచ్చాక" అంది ఆమె నవ్వుతూ.

"ఎక్కడకివెళ్ళాలి?" అని డ్రైవర్ అడిగాడు.

"ఈస్టర్న్ మెయిన్ రోడ్ మీద ఉన్న యూనివర్శిటీ ఫ్లాట్స్‌కి తీసుకువెళ్ళు" అని చెప్పింది మిసెస్ డేవీస్.

"డాక్టర్స్ ఫ్లాట్సా?"

"యస్"

"డే గోయిన్ టు లివ్‌డేర్?" వాళ్ళిద్దరు మాట్లాడ్తుంటే అర్థం చేసుకోటం కష్టమైంది కృష్ణకి, శ్యామలకి అతను 'ద'కి 'డ' పలకటంవల్ల.

టాక్సీ యూనివర్సిటీ మీదుగా వచ్చి ఈస్టర్న్ మెయిన్‌రోడ్ మీద ఆగింది. మిసెస్ డేవిస్ వాళ్ళకి వాళ్ళుండబోయే ఫ్లాట్ చూపించింది. కింద డైనింగ్ కమ్ డ్రాయింగ్ రూమ్స్, పైన రెండు బెడ్‌రూమ్స్ ఉన్నాయి. ఇల్లు ఫర్నిష్ చేసి ఉంది.

"ఇవాళ కొట్లు తెరిచిలేవు. కొంచెం పాలు, కోడిగుడ్లు మాత్రం దొరికాయి. ఈ రాత్రికి సర్దుకోండి" అంది మిసెస్ డేవిస్.

"థాంక్స్" అన్నది శ్యామల.

"రేపు నారాయణ అని మెకానికల్ ఇంజనీరింగ్ లెక్చరర్ వస్తాడు, అతన్తో వెళ్ళి మీకు కావలసినవి కొనుక్కుందురుగాని" అంది.

"అలాగే" అన్నాడు కృష్ణ. ఆమె గుడ్ నైట్ చెప్పి వెళ్ళిపోయింది.

కృష్ణ సామాన్లు మేడమీదకి చేర్చాడు. రాత్రి ఏడు గంటలైంది-చుట్టూ మెరుస్తూ మిణుగురు పురుగులు ఎగుర్తున్నాయి. శ్యామల కొత్త వాతావరణాన్ని ఆశ్చర్యంగా చూస్తూ నిలబడింది.

కృష్ణ "రేపు తీరుబడిగా చూద్దాంగాని- కాస్త గుడ్లు ఉడకెయ్యి" అన్నాడు శ్యామలతో.

ఉడికించిన గుడ్లుతిని, టీ తాగి పైకివెళ్ళి పక్కలమీదకి వాలేసరికి రాత్రి తొమ్మిదయింది.

"మన దేశంలో ఇప్పుడు పగలు తొమ్మిదై ఉంటుంది. ఇక్కడ ఎవరు తల కిందకి కాళ్ళు పైకి పెట్టి నడవడటం లేదు. గిరీశంగారు అబద్ధాలు చెప్పారు" అన్నాడు కృష్ణ.

"ఇక్కడ కూడా దోమలున్నాయి" అంది శ్యామల.

"తూర్పు, పడమర ఒక్కలా ఉన్నాయి" అన్నాడు కృష్ణ నవ్వుతూ.

"మనం చూసినంతవరకు" అంది శ్యామల.

ఇద్దరూ నిద్రలోకి జారుకొన్నారు.

* * *

పొద్దున్న లేచి శ్యామల టీ కాచింది. కృష్ణ, శ్యామల ఎదురెదురుగా కూచుని టీ తాగారు. ఏమిటో కొత్త దేశంలో మొదటిరోజు బెరుకు, కుతూహలం, ఉత్సాహంలాంటి ఎన్నో స్థితులు కలగాపులగమై, "విధి ఎలా ఉందో!" అన్న భావం కలిగింది.

"నీళ్ళు కాచుకోవాలంటే స్టౌమీద కాచుకోవాలి కాబోలు" అంది శ్యామల.

"అనుకోను. బాత్‌రూమ్‌లో వేడినీటి కొళాయిలున్నాయి. కనక వేడినీళ్ళు కాచుకొనే ఏర్పాట్లు ఉంటాయి. తెలుసుకోవాలి" అన్నాడు కృష్ణ.

"పక్కవాళ్ళని కనుక్కోండి" అంది శ్యామల.

"ఆ నారాయణ ఎవరో వస్తారుకదా ఆయన్ని అడుగుదాం. ఈ రోజుకి చన్నీళ్ళు పోసుకుందాం. వేడిగానే ఉంది కదా!" అన్నాడు కృష్ణ. అతనికి తెలియనివాళ్ళ తలుపుకొట్టి అడగటం అందులోనూ పొద్దున్నే ఇష్టంలేదు.

"నేను చన్నీళ్ళు పోసుకోలేను బాబు" అని శ్యామల పెరటి తలుపు తీసుకొని బయటకు వెళ్ళింది.

అక్కడ భారీగా, పొడుగ్గా ఉన్న ఒక నీగ్రో వనిత పసిపిల్ల బట్టలుతుకుతుంటే ఆమె నడిగింది. ఆమె శ్యామలని "మీరు ఫ్లాట్ ఆరులో కొత్తగా వచ్చారా?" అని అడిగింది.

శ్యామల అవునని చెప్పింది.

"నేను ఈ రెండో ఫ్లాట్‌లో ఉంటున్నాను" అని ఆమె శ్యామల ఇంటివేపు దారి తీసింది. ఫ్లాటులన్నీ ముందువేపు వెనకాతలవేపు అన్నీ కలిపి ఉన్నాయి, అడ్డగోడలు లేకుండా.

"దీన్ని పైలట్ లాంప్ అంటారు. ఇది వెలిగించాలి. దీన్ని సాధారణంగా ఆర్పం. ఇదెప్పుడూ వెలుగుతూ ఉంటుంది. ఎప్పుడైనా గాలి ఎక్కువగా వీస్తే ఆరిపోవచ్చు. అలా ఆరిపోకుండా ఇలా ఈ చిన్న మూత అడ్డుపెట్టాలి. పైలట్ లాంపు వెలిగించాక ఈ మెయిన్ తిప్పితే పెద్ద మంట వెలుగుతుంది. మాచెస్ ఉన్నాయా?"అని శ్యామల దగ్గర తీసుకొని ఆ గాస్ బాయిలర్ వెలిగించటం చూపింది.

"మీ సిలిండర్ అయిపోతే తెచ్చుకోవాల్సి ఉంటుంది" అని చెప్పింది.

"థాంక్స్... నాపేరు శ్యామల"

"నాపేరు క్రిస్టీ" అని చెప్పి వెళ్లిపోయింది.

"హలో" అని ఎవరో అంటే వెనక్కి తిరిగి చూసింది శ్యామల. అది వెనకాతల ఇంటివారి పెద్ద చిలుక. నెమలి అంత పొడుగ్గా ఉంది. ఈ దేశంలో అన్నీ పెద్దవే అనుకొంది శ్యామల.

ఎనిమిది గంటలవుతుండగా ఎవరో తలుపు తట్టారు. కృష్ణ తలుపుతీశాడు. అప్పటికి ఇద్దరి స్నానాలు అయ్యాయి.

"నాపేరు నారాయణ. నేను మెకానికల్ ఇంజినీరింగ్‌లో లెక్చరర్‌ని"

"దయచేసి లోపలికిరండి"

"మీరు తెలుగువారేమోకదా!"

"మరే"

"నేను కన్నడంవాణ్ణి... మాది బెంగుళూరు"

"ఆహా ఈమె నాభార్య శ్యామల"

నారాయణ దీనికి ఇంగ్లీషులో కాకుండా తెలుగులో-

"నమస్కారమమ్మా! మా బెంగుళూరు వాళ్లకి తెలుగు వస్తుంది. కాని అంత ప్యూర్‌గా వచ్చేలా?" అని పలకరించాడు.

"నమస్కారం- మీకు బాగానే వచ్చును అంది శ్యామల

నారాయణ మళ్లీ ఇంగ్లీషులో సంభాషణ కొనసాగించాడు.

"నాకో చిన్నకారుంది. ఆస్టిన్ 850 అంటే మినీ. అందులో మిమ్మల్ని వాల్సన్ షాపింగ్ ప్లాజాకి తీసుకువెళ్తాను. అక్కడ నిన్న రైస్ ఉన్నాయి. ఇక్కడ ఏరోజు ఎక్కడ రైసుంటుందో చూసుకొని కొనుక్కోవాలి. ప్రతీరోజు ఒక షాపులోనే అన్నీ దొరకవు. పాలైనా అంతే! పదండి- మళ్లీ తొమ్మిదింటికి యూనీలో రిపోర్టు అవాలి కదా!"

శ్యామల ఒక బాగ్ తీసుకొని వచ్చింది. కృష్ణ జేబులో పర్సుపెట్టుకొని ఇంటికి తాళం వేశాడు. శ్యామల మినీలో వెనకాల కూచుంది. కృష్ణ నారాయణపక్కన కూర్చున్నాడు.

"ఈ కారు ముగ్గుర్నిమించి లాగదు" అన్నాడు నారాయణ.

"మనదేశంలో ఆటోలే లాగుతాయి కదా!"

"లాగుతాయి నిజమే- ఏ స్పీడులో? ఇక్కడ మీరు 60-80 కిలోమీటర్లకి తక్కువ స్పీడులో డ్రైవ్‌చేస్తే ఏక్సిడెంట్లవుతాయి. రోడ్లు క్రాస్ చేసేటప్పుడు వెహికల్‌కి పుల్ కావాలి. ఫాస్టుగా దాటకపోతే కారు పచ్చడైపోతుంది. ఇదిగో ఈస్టర్న్ మెయిన్‌రోడ్డుమీదికి మనం రైట్‌టర్న్ తీసుకోవాలి. మనం టర్న్ తీసుకొనేటప్పుడు మెయిన్‌రోడ్డుమీద ఫాస్టుగాపోయే ఏ వెహికల్ అయినా వచ్చి మనల్ని గుద్దేస్తే కేసులేదు. మనదే తప్పు" ఇలా మాట్లాడ్తూ నారాయణ సడన్‌గాను, అతివేగంగాను కుడివైపుకి తిప్పి మెయిన్‌రోడ్డు ఎక్కాడు.

"ఇక్కడ డ్రైవింగ్‌లో చేతైనంతవరకు రైట్ టర్న్స్ ఎవాయిడ్‌చేస్తారు. చుట్టు తిరిగిఅయినా లెఫ్టటర్న్ తీసుకొంటారు. ఇది యూనివర్సిటీ మెయిన్‌గేటుకు వెళ్లేదారి"

కృష్ణ అటుకేసి చూశాడు. ఒక మినీ ఆస్టిన్‌కి ఆ క్షణంలో యూనివర్సిటీ గేటుముందు ఏక్సిడెంటయింది.

"ఏక్సిడెంట్" అన్నాడు గట్టిగా ఆందోళ





నగా కృష్ణ.

"మామూలే! మనం బజారు జేరేలోపల కనీసం మూడుకార్లనైనా ఆ స్థితిలో చూస్తాం. కారు పొద్దున్నతీస్తే సాయంత్రం క్షేమంగా షెడ్డులోపెడ్తాం అని నమ్మకంలేదు. అలాపెట్టగలిగినరోజున కొబ్బరికాయ కొట్టేయవచ్చు"

"అంత అన్యాయమా?" శ్యామల అడిగింది ఆశ్చర్యంగా.

కృష్ణ ఆ వీధిలో ఉన్న పాత సినిమాహాల్‌ని ఇళ్లనీ ఆసక్తిగా చూస్తున్నాడు.

"ఇదేదో గుడిలా ఉందే-" అంది శ్యామల

"అవును... గుడే- మరోసారి వెళ్దాం. ఇక్కడ మనగుళ్లు చాలా ఉన్నాయి. ఇందాక హైలో ముందర స్కూలుంది చూసారో లేదో అది ఆడపిల్లల స్కూలు. దానిపేరు హిందూలక్ష్మి స్కూలు. ఈ దీవిలో ఇండియన్సు నూటికి యాభైమంది. హిందువులు నూటికి ముప్ఫైనలభైమంది. మిగిలిన పది ఇరవైమంది ముస్లిమ్స్. ఇదిగో ఇది ఇటువైపు ఉన్న ఒకే ఒక డ్రైవ్ ఇన్ థియేటర్. ఇక్కడ మనం రైట్‌కి తిరగాలి. ఇది పోర్ట్ ఆఫ్ స్పెయిన్‌కి వెళ్లే హైవే! ఈస్టర్న్ మెయిన్‌రోడ్డు కూడా పి.ఒ.యస్ వెళ్తుంది. కాని ఇది ఫ్రీగా ఉంటుంది" అని చెప్తూ ఆ డబుల్‌రోడ్లమీద, రెండోరోడ్లోకి కుడికి కారును పోనిచ్చాడు. అతను తిప్పినవిధం భయం కలిగించింది శ్యామలకి, కృష్ణకి.

నారాయణ ఎడంవేపుతిప్పి మరోసారి వెంటనే ఎడంవేపు తిప్పి కారుని షాపింగ్ ప్లాజాకి మధ్యనున్న పార్కింగ్ ప్లేసులో పార్క్ చేశాడు. అక్కడ షాప్స్ మూడువైపుల ఉన్నాయి, నాలుగోవైపు వాహనాల రాకపోకల కోసం తెరిచి ఉంది.

నారాయణ ఎదురుగా ఉన్న సూపర్ మార్కెట్‌లోకి దారితీశాడు. లోపలకి వెళ్లాక ఒక తోపుడు ట్రాలీ తీసుకొన్నాడు. బియ్యంవేపు దాన్ని తోసుకొంటూ దారితీశాడు. శ్యామల, కృష్ణ అతన్ని అనుసరించారు.

"పది పౌన్లు చాలా?"

"అంటే?" శ్యామల అడిగింది.

"దరిదాపుగా నాలుగున్నర కేజీలు" అని కృష్ణ వివరించాడు.

"ప్రస్తుతానికి సరిపోతాయి" బ్రౌన్ పొట్లాలు ముడిచి ఉన్నాయి. అందులో ఒకటి విప్పి చూశారు. ముతక బియ్యం రెండుపౌన్లు, యాభైసెంట్లు. అంటే రూపాయిఅరవైపైసలు అంటే కిలో రూపాయిఎనభై.

"పెద్ద చవకకాదు" అన్నాడు కృష్ణ.

"ఇక్కడన్నీ మండిపోతాయి" అన్నాడు నారాయణ.

కాని కృష్ణ జీతం, నారాయణ జీతం నెలకి ఎనిమిదివేల రూపాయలని, అదికాక సంవత్సరానికి ఓ నెలజీతం గ్రాట్యుటీ అనీ ఆ క్షణం వాళ్లకి గుర్తురాలేదు. ఖరీదులు మాత్రమే రూపాయల్లోకి మార్చుకొన్నారు- జీతాలు కావు.

"పంచదార తీసుకోండి. ఇక్కడ సాధారణంగా బ్రౌన్‌దే దొరుకుతుంది"

శ్యామల అది తీసుకొంది. మిగిలిన పప్పులు ఉప్పులు తీసుకొంది. బంగాళదుంపలు, ఉల్లిపాయలు తీసుకొంది. ట్రాలీ తోసుకొని కౌంటర్ జేరారు. కౌంటర్లో అమ్మాయి మెషిన్ మీద ప్రతి వస్తువు ధర నొక్కి కూడింది. ఇరవైఆరు ట్రినిడాడ్ డాలర్లు అయింది. కృష్ణ జేబులోంచి పదిహేను యు.యస్ డాలర్లు తీసి ఇస్తుంటే "అదేమిటి కృష్ణగారు... మీకు ఫారిన్ ఎక్స్ఛేంజి ఎక్కువైతే నాకియ్యండి" అంటూ నారాయణ లాక్కుని ట్రినిడాడ్ కరెన్సీలో బిల్లు పే చేశాడు.

ట్రాలీ కారుదాక తీసుకువెళ్తుంటే నారాయణ చెప్పాడు- అక్కడ అమెరికన్ డాలర్లు ప్రయత్నించినా దొరకవట. ట్రినిడాడ్ నుంచి అమెరికా వెళ్లే అవసరం చాలాసార్లు వస్తుందని అప్పుడు అక్కడ ఫారిన్ ఎక్స్ఛేంజి కావాల్సివస్తుందని,అమెరికాలో ధరలకి ట్రినిడాట్ ధరలు మూడురెట్లని, అందుకని కావలసినవన్నీ అమెరికా వెళ్లినప్పుడు కొనుక్కోవాలని చెప్పారు.

"మరి నా దగ్గర జీతం వచ్చేదాకా డబ్బు ఎలా?" అని అడిగాడు కృష్ణ.

"నాదగ్గర ఓ వంద టి.టి.డి. తీసుకోండి. మీకు రేపు ఫర్నిషింగ్ లోన్ అని ఏడువేల డాలర్లు యూనివర్సిటీ అప్పిస్తుంది. నాలుగు



పర్సెంటు ఇంటరెస్టుమీద. శ్రీలంక నుంచి పారిపోయివచ్చిన తమిళులు దాన్ని బ్రిటిష్ బాంకుల్లో పన్నెండు పర్సెంటుకు వేస్తారు. అంతేగాని ఖర్చుపెట్టరు. అవన్నీ నెమ్మదిగా తెలుస్తాయి. పైగా మీరు కారుకొనటానికి పది వేల డాలర్లదాకా యూనివర్సిటీ అప్పు ఇస్తుంది. ఈ డాలర్లు దాచండి'' అంటూ కృష్ణకి అతని యు.యస్. డాలర్లు ఇచ్చేసి, అంతక్రితం కౌంటర్లో బిల్లు పేచేశాక నలభైడా లర్లలో మిగిలిన చిల్లరా, మరో అరవైడాలర్లు ఇచ్చి-

''మీరు నాకు నూరుడాలర్లు బాకీ'' అన్నాడు నారాయణ.

థాంక్స్'' అన్నాడు కృష్ణ.

నారాయణ దంపతుల్ని మళ్లీ ఫ్లాట్‌లో దింపాడు. దార్లో నుగ్గునుగ్గయిన కార్లు రెండు చూశారు.

నారాయణ కృష్ణని యూనివర్సిటీకి తీసుకు వెళ్లాడు. అక్కడ కృష్ణ ప్రొఫెసర్ జెన్‌కిన్స్‌ని కనుగొన్నాడు. ఆయన చూడటానికి ఇండియ న్‌లా కనిపించాడు కృష్ణకి.

''నా మదర్‌సైడ్‌న పూర్వీకులు ఇండియ న్సు, బ్రిటిషర్స్ ఉన్నారు. ఫాదర్‌సైడ్‌న ఆఫ్రికన్, ఫ్రెంచ్‌బ్లడ్ ఉంది'' అని చెప్పాడు. ఆ తరువాత,

''ఇప్పుడు రమారమి మే వచ్చేసింది. జూన్ ముప్పైన యూనివర్సిటీ మూసేసి అక్టోబర్ మొదటి తారీకున తెరుస్తాం. జూన్‌మధ్యలో పరీక్షలుంటాయి. నీకు నేను వర్క్ ఇవ్వటంలే దు. ప్రస్తుతం నీ పర్సనల్ పని పూర్తిచేసుకో. ఇల్లుచూసుకో. మాదేశానికి ఎడ్జస్ట్ అవు'' అని కృష్ణతో చెప్పి సెక్రటరీ అమ్మాయిని పిలిచి రిజిష్ట్రార్ ఆఫీసుకి కృష్ణ ఆరోజు రిపోర్ట్ అయిన ట్టుగా, ఇండియానుంచి మూడురోజులక్రితం బయల్దేరినట్టుగా ఉత్తరం డిక్టేట్‌చేశాడు. సెక్ర టరీ ఉత్తరం టైప్‌చేసి తెచ్చింది. దాన్ని సంత కంపెట్టి కృష్ణచేతికిచ్చాడు.

కృష్ణ బయటికివచ్చి మెట్లుదిగుతుంటే మి సెస్ డేవిస్ కనిపించింది.

''నీకు ఆఫీస్ ఏర్పాటుచేశాను. దాని కీస్ నానుంచి కలెక్ట్‌చేసుకో'' అని చెప్పింది.

''థాంక్స్''

''వెల్‌కమ్''

మెట్లుపూర్తిగా దిగేసరికి నారాయణ కని పించాడు.

"మీ రూమ్‌నానుకొనే నారూమ్. కీస్ తీసుకొన్నారా?" అని అడిగాడు.

"లేదు. రిజిస్ట్రార్ ఆఫీసుకు వెళ్లాలి... చూపిస్తారా?"

"పదండి" అని కారు పార్కింగ్‌ప్లేస్‌కి దారి తీసాడు. రిజిస్ట్రార్ ఆఫీసులో కృష్ణకి ఫొటోతీసి ఐ.డి. కార్డ్ ఇచ్చారు. ఫర్నిచర్ అండ్ సెట్‌లింగ్ గ్రాంటుకి అప్లైచేసాడు కృష్ణ. ఆ మర్నాడు చెక్ ఇస్తామన్నారు. అక్కడనుంచి కృష్ణని బార్‌క్లే అండ్ బాంక్‌కి తీసుకువెళ్లి పదిడాలర్లతో ఎకౌంట్ ఓపెన్ చేయించాడు నారాయణ. అక్కడ పక్కనేఉన్న పోస్టాఫీసులో ఎయిరోగ్రాములు కొన్నారు.

నారాయణ కృష్ణని తిరిగి ఇంజినీరింగ్ ఫ్యాక్టరీ బిల్డింగ్స్‌కి తీసుకువెళ్లాడు.

"ఇప్పుడు కాఫీటైమ్. పదండి కాఫీతాగుదాం" అని ప్రొఫెసర్ కిన్స్ ఆఫీసుకి కొద్ది గదులవతలున్న కాఫీరేంజ్‌కి తీసుకువెళ్లాడు.

అక్కడ పాలు, డికాక్షన్, బ్రౌన్‌షుగర్ ఉన్నాయి. కొందరు కూర్చుని కాఫీ తాగుతున్నారు. అందులో కొందరు తూర్పు భారతీయులు, మరికొంతమంది పడమటి భారతీయులు, సింహళీయులు, చైనీయులు, నీగ్రోలు, సంకర జాతివాళ్లు కనిపించారు. నారాయణ వాళ్లని పరిచయంచేశాడు.

"ఇక్కడ పొద్దున్నమధ్యాహ్నం ఫ్రీగా కాఫీ ఇస్తారు. యు.వి.లో పనిచెయ్యడానికి మనకి అదో ఇన్‌సెంటివ్" అన్నాడు నారాయణ.

"లేకపోతే ఈ చెత్తజీతాలకి ఎవరు పనిచేస్తారు! అందుకే మన యూనియన్ జీతాలు పెంచమని గొడవచేస్తోంది" అన్నాడు అక్కడ కూర్చున్న పడమటి భారతీయుడు క్రిస్ చంద్రూ.

కాఫీలయ్యాక కృష్ణని లైబ్రరీకి తీసుకువెళ్లి కార్డు ఇప్పించాడు. జర్నల్స్ ఎక్కడ ఉంటాయో, పుస్తకాలు ఎక్కడుంటాయో చూపించాడు.

"ఈ లైబ్రరీకి లోకల్‌జనం ఎవరూరారు. మనలాంటి తూర్పుఇండియన్‌లు మాత్రమే ఈ లైబ్రరీని వాడ్తూ ఉంటారని మన డేవిస్‌కూతురు ఒకసారి అంది. అన్నట్టు కౌంటర్‌లోఉన్న అమ్మాయి మిస్ డేవిస్"

"ఐసీ"

"పన్నెండయింది, పదండి- ఇంటికిపోయి భోంచేద్దాం. ఇక్కడ తొమ్మిది నుంచి పన్నెండు ఒంటిగంటన్నర నుంచి నాలుగువరకు వర్కింగ్ అవర్స్. ఇలా వారానికి అయిదురోజులు. టర్మ్‌కి పదివారాలు. సంవత్సరానికి రెండు టర్మ్‌లు. మిగిలినదంతా వెకేషన్, ఎగ్జామ్స్, ప్రిపరేషన్, హాలీడేస్. ఏడాదికి టీచింగ్‌లోడ్ ఒకటి ఒకటిన్నర సబ్జెక్ట్స్. అదే ఎక్కువ అని గోలవీళ్లు. పైగా ఇంజనీరింగ్ డిగ్రీ మూడు సంవత్సరాలు"

"మనదేశంలో కనీసం ముప్పైరెండువారాలు పాఠాలుచెప్తాం ఏడాదికి. వారానికి నలభై గంటలు పనిచేస్తాం. ఇన్నాళ్లు అయిదేళ్లచదువు ఇంజనీరింగ్. వచ్చేయేడు నాలుగు సంవత్సరాలకి కుదిస్తార్ట"

"అక్కడ అంతకష్టపడి మీరు పాఠాలుచెప్పినా నేర్చుకోనివారు నేర్చుకోరు. ఇక్కడ ఇంత కొంచెం చెప్పినా నేర్చుకునేవాళ్లు నేర్చుకొంటారు. పదండి... ఇంటికి వెళ్దాం- శ్యామలగారు ఎదురుచూస్తూ ఉంటారు"

నారాయణ కారులో కృష్ణని డాక్టర్స్ ఫ్లాట్స్ దగ్గర దింపాడు. "మళ్లీ ఒంటిగంటన్నరకి వస్తాను"

"మాతో భోంచెయ్యండి" కృష్ణ ఆహ్వానించాడు.

"మీరు కొంచెం సెటిల్ అయ్యాక నేను రోజూ మీ ఇంట్లోనే భోంచేస్తాను... సరేనా"

కృష్ణ తలుపు కొట్టాడు. శ్యామల తలుపు తీసింది.

"ఏమండీ- అలా ఎవరు వచ్చారో చూడకుండా తలుపు తియ్యకండి" అని నారాయణ సలహా ఇచ్చి, "వస్తాను" అని వెళ్లిపోయాడు.

శ్యామల ఇండియా నుంచి తెచ్చిన చింతపండుతో చారు పెట్టింది. కూర చేసింది. పెరుగుకి తోడు నారాయణ దగ్గర్నుంచి సాయంత్రం తెచ్చుకోవాలని చెప్పింది. ఆ పూటకి భోజనం అయిందనిపించారు. ఒంటిగంటన్నరకల్లా నారాయణ వచ్చి కృష్ణని యూ





ఎకి తీసుకువెళ్లాడు.

ఆ మధ్యాహ్నం ఒకతన్నిపిల్చి, "ఇదిగో స్పీడీ! ఇతను కృష్ణ. ఈయన ఉత్తరాలు ఈయనకియ్యి" అని చెప్పాడు నారాయణ.

"స్పీడీ ఏమిటి?" అని కృష్ణ అడిగాడు.

"అది అతగాడి నిక్‌నేమ్. ఇక్కడ అందరికి ముఖ్యంగా పనిపాటలు చేసుకొనేవాళ్ళకి అసలు పేరుకన్నా ఈ రెండో పేరే ప్రచారంలో ఉంటుంది. బోనీ, రోలీ పియానో అలా ఉంటాయి. స్పీడీ అసలు పేరు సింగ్"

"మనం నిక్‌నేమ్ పెట్టిపిలిస్తే తప్పు పట్టరా?"

"ఇండియాలో నిక్‌నేమ్ అంటే ఏడిపించటానికి పెట్టే పేరు బొచ్చుకుక్క, కాకి, కొంగ అంటూ పెడ్తాం. ఆ పేరుపెట్టి పిలిచినప్పుడు ఆ పిలుపు ఉద్దేశింపబడిన వ్యక్తి ఉడుక్కుంటాడు. ఇక్కడ నిక్‌నేమ్ అనేది మన తంబు, బాచీ, టింకూ, టంగులాంటి ముద్దుపేర్ల లాంటిది. ఎవరూ ఏమి అనుకోరు.

"మీ ప్రొఫెసర్ని ముద్దుగా ఆయన లేనప్పుడు 'జంక్' అని రిఫర్ చేస్తారు. కాని ఆయన ఉడుక్కుంటాడు వింటే" అన్నాడు నారాయణ నవ్వుతూ.

ఆ రాత్రి కృష్ణ,శ్యామలలు దోమలు కుట్టడంతో నిద్రపోలేదు, "ఇక్కడా ఉన్నాయి దోమలు. మొదటిరోజు శ్రమతో వళ్లు తెలియకుండా నిద్రపోయాం- తెలియలేదు" అంది శ్యామల.

"రేపు ఎడ్వాన్సు రాగానే ఫాను కొందాం" అన్నాడు కృష్ణ.



బుధవారం కృష్ణకి బర్సరీ నుంచి ఇంటికి కావలసినవి కొనుక్కోడానికిగాను రెండు నెలల జీతం ఎడ్వాన్సుగా ఇచ్చారు. నారాయణ సెంటాగస్టిన్ కృవలానీలో సేల్ ఉందని చెప్పి అక్కడికి తీసుకువెళ్లాడు శ్యామలనీ, కృష్ణనీ ఆ సాయంత్రం. అక్కడ అన్నీ $33^1/_3$ శాతం ధరలు తగ్గించి ఉన్నాయి. షార్పు టి.వి 900 డాలర్లు, చిన్న ఫాను 100 డాలర్లు పెట్టి కొన్నారు. గిన్నెలు, గరిటలు లాంటి చిన్నచిన్న వస్తువులు 170 డాలర్లు పెట్టి కొన్నారు. కృవలానీలో సేల్‌వల్ల ఆ రోజు చాలా రష్‌గా ఉండి కౌంటర్ల దగ్గర పెద్ద క్యూలేర్పడ్డాయి. ఆ షాపులో బ్లేడ్లు, బాడీల దగ్గర్నుంచి పరుపులు, మంచాలదాకా ఉన్నాయి. శ్యామలకి ఆ షాపు చాలా నచ్చింది. క్యూలో నిలబడినప్పుడు-

"మీరు మీ ఇంటి నుంచి 75 సెంట్లు ఇచ్చి టాక్సీలో రావచ్చు ఇక్కడికి. ఇక్కడ బస్సుల బదులు టాక్సీలు వాడతారు. ఆ టాక్సీల్లో జనం ఎక్కేవాళ్లు ఎక్కుతూ ఉంటారు, దిగేవాళ్లు దిగుతూ ఉంటారు- నలుగురికి మించకుండా" అని చెప్పాడు నారాయణ శ్యామలకి.

"మనిషికి 75 సెంట్లా?"

"అవును"

"ముక్కు మొహం తెలియనివాళ్లతో టాక్సీ షేర్ చెయ్యాలన్నమాట"

"ఇండియాలో బస్సులో చెయ్యరా?"

"చేస్తాం... కాని బస్సుల్లో చాలామంది ఉంటారు. ఆడామగ రాసుకొంటూ కూర్చోంకదా!"

"ఇక్కడ కూర్చున్నా ఏం బెంగలేదు! అంత చిన్నదానికి ఎవరూ తప్పు పట్టించుకోరు. మన దేశంలో ఆడదాని కొంగుతగిలితే చాలు మగవాళ్లు ఎక్సైట్ అవుతారు. ఆడవాళ్లు మైలపడ్తారు. ఇక్కడ ఆ బెంగలేదు" అన్నాడు నారాయణ నవ్వుతూ.

"అంత సంస్కారవంతులా ఇక్కడి జనం?" కృష్ణ అడిగాడు. "మరే- మీకే తెలుస్తుంది. వీళ్లది మన ప్రాచీన ఆర్యనాగరికత."

క్యూ కదిలి కృష్ణ కౌంటర్ దగ్గరికి రావటంతో సంభాషణ ఆగిపోయింది. కృష్ణ పన్నెండు వందల డాలర్లకి చెక్ ఇచ్చాడు. కౌంటర్‌లో

రసీదు, ముప్పై డాలర్ల చిల్లర ఇచ్చారు.

కృష్ణ టి.వి మొయ్యగా, నారాయణ, శ్యామల మిగిలినవి మోశారు కారుదాకా. అవి ఇంటికి జేరవేశాక నారాయణ టి.వి ఏరియల్, ఫ్లాట్‌కి ఎక్కడుందో చూసి టి.వి కనెక్ట్ చేశాడు. బొమ్మ రావటం మొదలైంది.

"మీరిద్దరు టి.వి చూస్తూ ఉండండి- నేను వంట చేస్తాను. నారాయణగార్నిక్కడే భోజనం చెయ్యమనండి" అంది శ్యామల.

టివిలో ఇండియా న్యూస్ కవరేజి హెచ్చుగా ఉంది.

న్యూస్ పూర్తయ్యేసరికి శ్యామల వంట పూర్తి చేసి వడ్డించింది. టి.విని డైనింగ్ టేబుల్ వైపు తిప్పి భోజనానికి కూర్చున్నారు.

"వచ్చేవారం నుంచి టి.టి.టి అంటే ట్రిని డాడ్ అండ్ టు బాగో టెలివిజన్... మీకు సోమవారం రాత్రి, గురువారం రాత్రి 'రూట్స్' సీరియల్ చూపిస్తుంది. రాత్రి పదింటి నుంచి పన్నెండు వరకు" అన్న ప్రకటన వచ్చింది టి.విలో.

"ఆ సినిమా చూపిస్తే నీగ్రోలు కోపంతో రెచ్చిపోతారని భయపడింది గవర్నమెంటు. రాత్రి పదింటికి చూపించడానికి చివరకు నిర్ణయించింది. నీగ్రోలని అమ్మటం అదీ చాలా వాస్తవికంగా చూపించాడట" అన్నాడు నారాయణ.

"కృపలానీలో చీరలు అమ్ముతారా?" అంది శ్యామల.

"అప్పుడప్పుడు చీరలు తెచ్చి అమ్ముతారు. దీపావళికి దనరాకి తప్పకుండా అమ్ముతారు. లేకపోయినా తూనాపూనా మార్కెట్టులో చాలా ఇండియన్‌షాప్స్ వున్నాయి. అక్కడ అమ్ముతారు. మీరు కొనుక్కోవచ్చు"

రాత్రి పదింటిదాకా కబుర్లు చెప్పి నారాయణ వెళ్ళిపోయాడు. కృష్ణ మేడ మీద బెడ్ రూమ్‌లో ఫాన్ ఇద్దరికి గాలి తగిలేలాగా అమర్చాడు. శ్యామల పనులు పూర్తి చేసుకొని పైకి వచ్చింది.

"ఇక్కడ సరిగ్గా ఆంధ్రాలా ఉంది చమట అదీను" అంది శ్యామల చీర విప్పిపారేస్తూ

"బట్టలతో పడుకోవటం కష్టం" అని ఏకీభవించాడు. కృష్ణ పంచకట్టుకొంటూ, "లేకుండా పడుకోవడం ఇష్టం" అన్నాడు.

"ఇవాళ అబ్బాయిగారికి ఉత్సాహంగా ఉన్నట్టుంది"

"అమ్మాయిగారినిలా చూస్తుంటే ఉండదా! పైగా ఇవాళ ఫాన్‌గాలిని సెలబ్రేట్ చేసుకోవాలి"

కృష్ణ శ్యామలను ఆ డబుల్‌కాట్ మీదకి లాక్కున్నాడు.

అలిసిపోయిన కృష్ణ జట్టులోకి వేళ్ళు పోనిస్తూ శ్యామల కృపలానీ షాపు, అందులో వస్తువులు గుర్తుకు తెచ్చుకొంది. కొన్ని నెలలుపోతే తమవద్ద చాలా డబ్బు ఉంటుంది. అప్పుడు చక్కగా అవన్నీ తను కొనుక్కుంటుంది. ఫెర్ఫ్యూమ్స్ కొనుక్కోవాలి. శ్యామల కోరికలు తీరే అవకాశం ఉండటంతో పురివిప్పుకొని నాట్యం చేశాయి ఆమె కళ్ల ముందు. తన అప్పచెల్లెళ్ళలో తను అదృష్టవంతురాలు. తెలివైన కృష్ణని పెళ్ళిచేసుకోవటం వల్ల విదేశాలు చూడగల్గుతోంది.

మర్నాడు గురువారం శ్యామల చిన్న ఎలక్ట్రిక్ ఐరన్, చీపురు, బాత్‌రూమ్‌మాట్ మొదలైనవి కొనాలంటే ఇద్దరు నడిచి తునాపూనా షాపులకి వెళ్లారు. అక్కడ అహ్మద్ షాపులో కిటికీలోంచి వాళ్లకి కావలసినవి కనిపిస్తే లోపలికి వెళ్ళారు. షాపులో ఎవరూలేరు. బెల్లు మోగించగా మేడమీద నుంచి మాక్సీ వేసుకొన్న ముప్పై ఏళ్ల స్త్రీ దిగివచ్చింది.

"మీరిండియన్సా?"

"అవును"

"మేమూ ఇండియన్స్‌మే" అని సరదాగా చెప్పింది- తను ముస్లిమ్ అని వీళ్ళు హిందువులన్న భావం లేకుండా.

"ఎప్పుడు వచ్చారు?"

"నాలుగు రోజులైంది"

"ఏమి కావాలి?"

శ్యామల చెప్పింది. ఆమె వంగుని అరల్లోంచి వస్తువులు తీయసాగింది. శ్యామల ఆశ్చర్యపోతూ తను గమనించింది కృష్ణ గమనించాడా అని అతనికేసి చూసింది. కృష్ణ




శ్యామల చూపు గమనించలేదు. అతను మిసెస్ అమ్మాదిని చూస్తున్నాడు. పొడుగ్గా లూజ్‌గా ఉన్న మాక్సీలోపల ఆ షాపు యజమానురాలు ఏమీ వేసుకోలేదు. మెడ ఖాళీలోంచి ఆమె పూర్ణవక్షోజాలు ఆమూలాగ్రం కనిపిస్తున్నాయి. అలా కనిపించడానికి అవకాశం ఉందన్న విషయం ఆమెకి తెలియకపోడానికి వీలులేదు.

ఆవిడ లేచి నిలబడి వస్తువులు అందించి బిల్లు వేసింది. నారాయణ చెప్పినట్లు ఇక్కడ మగవాళ్ళకి "ఆడవాళ్ల కొంగుతగిల్తే ఎక్సైట్ అవాల్సిన అవసరం లేదు. ఉద్రేకపరిచేవి, అంతకంటే ఘనమైనవి ఉన్నాయి" అనుకొన్నాడు కృష్ణ.

శనివారం వచ్చేసరికి గార్డియన్ న్యూస్‌పేపరు ఇచ్చేలా ఏర్పాటు చేసుకొన్నారు. నారాయణ వచ్చి శనివారం తూనాపూనా కూరల సంతకి తీసుకువెళ్లాడు. కారు ఈస్టర్న్ మెయిన్ రోడ్డు మీద దూరంగా ఆపాడు.

తూనాపూనాలో శని ఆదివారాలు సంత జరుగుతుంది. చుట్టువట్ల పల్లెటూళ్ళ నుంచి వాన్స్‌లో కూరలు, పప్పులు తెచ్చి అమ్ముతారు. అప్పుడు కొనుక్కొని వారం అంతా వాడుకోవాలి. మధ్యలో కావాలంటే హైలోలాంటి షాపుల్లో కొనుక్కోవాలి. నారాయణ, శ్యామల, కృష్ణ తూనాపూనా వెళ్లేసరికి ఏడు గంటలైంది. మొదట్లో కూరల షాపులు, తరువాత పీతలు, చేపలు, ఆపైన మాంసం ఇంకా ముందుకు పోతే తిరిగి కూరలు అమ్ముతున్నారు. మాంసం షెడ్డులాంటిదాంట్లో అమ్ముతున్నారు. దానికి ముందు భాగంలో బియ్యం, కందిపప్పు, పంచదారా అమ్ముతున్నారు.

పీతలు కదలకుండా వాటి కాళ్ళు గడ్డివరకలతో కట్టి వాటిని గుట్టలుగా పడేసారు. కూరలు అమ్మేవాళ్ళు ఎక్కువగా పడమటి భారతీయులు. ఈ దీవుల్లో వ్యాపారం అంతా దరిదాపుగా ఆ దీవుల భారతీయుల చేతుల్లో ఉందని, వ్యవసాయం కూడా అంతేనని నారాయణ చెప్పాడు.

అమ్మే ఆడవాళ్ళు గౌన్లు వేసుకొన్నారు. వాళ్ల బ్రౌను సంటి మీద స్వేద బిందువులు ముత్యాల్లాగా ఏర్పడుతున్నాయి. ఆ గౌన్లు వీలైనంత గాలి ఆడేలాగా, లోతు మెడతో వేసుకొన్నారు. చిన్న ఆడపిల్లలు నెత్తి మీద టోపీలు పెట్టుకొన్నారు. పెద్దవాళ్ళు కొందరు గౌనుకడ్డంగా ఒక తెల్లటి ఓణీ వేసుకొని నెత్తి మీద కప్పుకొన్నారు. దాన్ని వాళ్ళు ఓణీ అనే అంటారని నారాయణ చెప్పాడు. ఆ విధంగా పవిట వేసుకోవటం ఆ వయస్సువాళ్ళకి మర్యాదట. పురుషులు నిక్కర్లు చొక్కాలు వేసుకొన్నారు. అక్కడ అక్కడా అమ్మేవారిలో నీగ్రోలున్నారు. కొనే వారిలో మాత్రం రెండు జాతులు సమంగా ఉన్నారు.

శ్యామల ఒకచోట పచ్చిమిరపకాయలని చూసి "ఎంత?" అని అడిగింది.

"దోపైసా" అని సమాధానం ఇచ్చాడు హిందీలో అమ్మే అతను.

శ్యామల అయిదు మిరపకాయలు తీసుకొని పదిసెంట్లు ఇచ్చింది.

"న న... దస్‌పైసా" అన్నాడు.

నారాయణ నవ్వుతూ "పైసా అంటే ఇక్కడ అయిదు సెంట్లు" అని చెప్పాడు శ్యామలకి.

ఆపైన, "అన్ని మిరపకాయలు కొన్నారు ఏం చేస్తారు?" అని అడిగాడు.

"తెలుగువాళ్లం కదా తింటాం" అంది శ్యామల.

"అవి నీగ్రోలు తప్ప మీరు తినలేరు!"

"గుంటూరువాళ్లం"

"పేరుకేగాని గుంటూరువాళ్ల కారం మా వాంగీబాత్‌లో కారం అంత ఉండదు. మీరు కొన్నవాటిని కాంగోపెప్పర్ అంటారు. మీ ఫ్లాట్స్ ముందు ఉన్నవి బర్డ్‌పెప్పర్ అంటారు. బర్డ్‌పెప్పర్ సీమ మిరపకాయలలాంటివి. కాంగోపెప్పరు డైనమైట్‌లాంటిది. ఒక మిరపకాయలో పదో వంతు వేసుకొని తింటే రెండో రోజు మోషన్స్ అవుతాయి. నేను చెప్పలేదంటారు తరువాత"-

శ్యామలకి నారాయణ మాటలు నమ్మదగ్గవిగా కనిపించలేదు.

నారాయణ బియ్యం షాపులు చూపించాడు, బియ్యం తెల్లగా బావున్నాయని ఓ పది పౌన్లు తీసుకొంది. సూపర్ మార్కెట్ కంటే ధర ఎక్కువ పెట్టాల్సి వచ్చింది. పంచదార కూడా

ఎక్కువధర పెట్టి తీసుకొంది.

జనాన్ని తోసుకొంటూ నలిగిపోతూ బయట పడాల్సివచ్చింది. అంత రద్దీ ఉన్నా కావాలని ఎవరూ అవకాశం తీసుకొని తన వంటి మీద చెయ్యి వేసినట్టు అనిపించలేదు శ్యామ లకి. ఇదే ఇండియాలో అయితే మగవాళ్ల నరసం చెప్పక్కర్లేదు. ఇక్కడ తొక్కిడిలో తగు ల్తున్నది మరో శరీరమనేకాని ఆడో మగో ఎవరూ పట్టించుకోవటం లేదు. నాగరికత పెరిగితేనే గాని పర్వర్షన్స్ పెరగవు కాబోలు. ఇక్కడ జనం ఇంకా నాగరికతకి దూరంగా ఇంస్టిక్ట్‌లకి దగ్గ రగా ఉన్నారేమో!

నారాయణ కృష్ణని, శ్యామలని ఇంటిదగ్గర దింపి "రేపు ఆదివారం నాకు వచ్చేందుక య్యేలా?" అని చెప్పి వెళ్లిపోయాడు.

"నారాయణకి శ్రమ ఇవ్వకుండా వీలైనంత త్వరగా కారు కొంటాను" అన్నాడు కృష్ణ శ్యామ లతో.

* * *

ఆదివారం పొద్దున శ్యామల పెరట్లో చాకి రేవు పెట్టింది. రెండో ఫ్లాట్‌లో ఉన్న క్రిస్టీ పసిపిల్లవాడి బట్టలు మోపుతెచ్చి తన సింక్‌లో పడేసి,

"గుడ్‌మానింగ్ శమాలా!" అని శ్యామలని పలకరించింది.

ఆ పిలుపు కొత్తగా అనిపించి తనని కాదను కొంది శ్యామల. తన పేరేనని తట్టాక తలెత్తి చూసి,

"హాలో క్రిస్టీ" అంది.

బట్టలు ఉతకడం మధ్యలో విశ్రాంతి తీసుకో వాలనిపించింది శ్యామలకి. ట్రినిడాడ్‌లో, ఇంగ్లండులో తను చూసినటువంటి వాషింగ్ మెషీన్లు ఈ ఫ్లాట్స్‌కి ఏర్పాటుచేసిలేవు. నారా యణవాళ్ల ఫ్లాట్స్‌లో కాయిన్ వేస్తే పనిచేసే లాండ్రీ ఉందని చెప్పాడు కాని చాలా ఇళ్లకి వాషింగ్ మెషీన్లు ఉండవు. ఎవరిది వాళ్లు కొనుక్కోవాలట.

శ్యామల తీగమీద బట్టలు ఆరేసి క్రిస్టీ ఫ్లాట్ పద్దకు వెళ్లింది.

"మీ పాపాయికెంత వయస్సు?"

"ఒక సంవత్సరం"

"నువ్వు ఉద్యోగం చేస్తున్నావు కదా! మరి బేబీని ఎవరు చూస్తారు".

"చైల్డ్ కేరింగ్ సెంటర్‌లో వదిలిపెడ్తాను. పనయ్యాక తెచ్చుకొంటాను".

"వాళ్ళ నాన్న ఏంచేస్తూ ఉంటారు"?

"ఎకౌంటెంట్ జనరల్స్ ఆఫీసులో పని"

"రోజు ఇక్కడ నుంచి పోర్ట్ ఆఫ్ స్పెయిన్‌కి వెళ్లి వస్తారా?"

"అతనిక్కడుండడు- అతనికి వేరే ఇల్లు ఉంది"

"రెండు ఎస్టాబ్లిష్‌మెంట్స్ ఎక్కువఖర్చు కదా! నువ్వే అక్కడికి వెళ్లి ఉండవచ్చు కదా!"

క్రిస్టీ కాస్సేపు ఆగి శ్యామలను పరీక్షగా చూసి నవ్వింది.

"ఓహ్... నీకీ దేశం గురించి తెలియదని మర్చిపోయాను. నా పిల్లాడి తండ్రి నాకు మొగుడు కాదు. నాకు పెళ్లే కాలేదు. అతని జీవితం అతనిది. నా జీవితం నాది. జాన్ అనే నా సెక్స్యువల్ పార్ట్‌నర్ చాలా చదువుకొన్నవా డు, జ్ఞాని. అతనికి వీలైనప్పుడు రానా అని ఫోన్‌చేసి అడుగుతాడు. ఆరోజు నాకు వీలైతే రమ్మంటాను. కలిసి ఆ సాయంత్రం సంతో షంగా గడుపుతాం. ఇక్కడ పెళ్లికాని తల్లులు సామాన్యం. మేము పంచితులం కాము. లిబరే టెడ్".

శ్యామల బెదిరిపోయింది. ఇంత బరితె గించిన స్త్రీ పక్కింట్లో ఉంటే కృష్ణని తను కాపలా కాస్తూ ఉండాలి. క్రిస్టీ పొడుగ్గా లావుగా బలంగా ఉంది. నిగనిగలాడే గజ్జల గుర్రాన్నో జర్సీ ఆవునో చూస్తే కలిగే ఆకర్షణలాంటి ఆకర్షణ ఉంది ఆమెలో శ్యామల మౌనం చూసి,

"మీ ఇండియన్స్‌కి మా పద్ధతులు విడ్డూ రంగా ఉంటాయేమో కదూ?"

"మీ పెద్దవాళ్లు కేకలువెయ్యరూ?" శ్యా మల వీళ్లెవరైనా అదుపులోపెడ్తే బావుండున్న కోరికతో అడిగింది.

"పద్దెనిమిది సంవత్సరాలకే వారినుంచి మేము దూరంగా వచ్చేస్తాం. మా తిప్పలు





మేంచవద్దాం. ఎట్టి పరిస్థితుల్లోను వాళ్లమీద ఆధారపడం. అటువంటప్పుడు మమ్మల్ని అదుపులోపెట్టడానికి వాళ్లు ప్రయత్నించినా మేము లొంగవద్దూ!'' అంది.

''వస్తాను. ఇంకా నేను వంట సంగతి చూడ లేదు'' అంటూ లోపలికి నడిచింది శ్యామల.

కృష్ణ స్నానం చేసి గార్డియన్ చదువుతూ కూర్చున్నాడు. శ్యామల వంట చేసింది. ఇద్ద రూ పెందరాళే పడుకొంటు గంటలకు భోంచే రు. వంట నోరు మండిపోయింది.

''కాంగో పెప్పరు వేశాను. అది ఇంత ఖారం అనుకోలేదు'' అంది శ్యామల. మంట తగ్గడాని కిద్దరూ చెరో గ్లాసుడు పాలు తాగారు.

టి.వి. ఆన్‌చేసి సోఫాలో కూర్చునేసరికి తలుపు చప్పుడయింది. కృష్ణ తలుపు తీశాడు. భారతీయ దంపతులు కనిపించారు. ''నా పేరు లత, నాది బెంగుళూరు. ఈయన మా ఆయన రామ్‌ప్రసాద్. మేము లోపలికి రావ చ్చునా?'' అని అడిగింది ఆ స్త్రీ.

''రండి'' అని కృష్ణ తలుపుతెరిచాడు పూర్తిగా.

''మిమ్మల్ని మేము డిస్టర్బ్ చేస్తున్నా మేమో!'' అంది లత కూర్చుంటూ.

''లేదు... దేశంకాని దేశంలో స్వదేశానికి పదివేల మైళ్ల దూరంలో స్వదేశీయులు కని పిస్తే అదో పెద్ద పండగ'' అన్నాడు కృష్ణ.

''మేము కొత్తగా వచ్చాం. మాకు నారాయణ తప్ప ఎవరూ తెలియదు. మమ్మల్ని వెతు క్కుంటూ వచ్చిన మీ రాక మాకు ఆనందదా యకం'' అంది శ్యామల మనస్ఫూర్తిగా.

''నారాయణ మీ గురించి చెప్తే వచ్చాం. నేను యు.వి.లో హ్యూమానిటీస్‌లో పి.హెచ్.డి. చేస్తున్నాను. జార్జికి తూనాపూనాలో చిన్నషా పుంది'' అంది లత.

శ్యామల, కృష్ణ అయోమయంగా చూసారు.

''జార్జి నా భర్త'' అంది లత వాళ్ల ఇబ్బంది గుర్తించి.

''పూర్తి పేరు జార్జి రామ్ ప్రసాద్''.

''మీరు హిందువులు కదా!''

''హే (!'' అన్నాడు జార్జి అవునన్నట్టు తలూపుతూ.

''నా మొగుడు ఈ దేశస్థుడు. వీళ్లలో హిందువులకి, ముస్లిమ్స్‌కి కూడా ఫామిలీ పే రు కాకుండా పెట్టుకొనే పేర్లలో క్రిస్టియన్ నేమ్సుంటాయి'' లత వివరించి చెప్పింది. కూలీలుగా వచ్చిన భారతీయులని పాలకు లైన క్రైస్తవ శ్వేత జాతీయులు ''నీ క్రిస్టియన్ నేమ్ ఏమిటి?'' అని అడగటం ''నాది జార్జి, హెరాల్డ్'' అని భారతీయులకి తమ పేర్లు చెప్పటం జరుగుతూ ఉండటం, పాలకుల [illegible] ఉంటే తమ పిల్లలకి ఆ పేర్లు పెట్టడం ఆనవాయితీ అయిందని లత చెప్పింది.

జార్జి ఇంగ్లీషే మాట్లాడుతున్నా అందులో ఒకర కమైన స్థానికమైన యాసుండి కృష్ణకి అర్థమ వటం కష్టమైనప్పుడు, ''పార్డన్ తిరిగి చె ప్పండి'' అంటుంటే,

''మీ మదర్‌టంగ్ ఇంగ్లీషు కాదు కదా! అందుకని మీకు ఇంగ్లీషు అంత బాగా రాదను కొంటాను'' అన్నాడు.

కృష్ణ జార్జి అజ్ఞానానికి ఆశ్చర్యపోయాడు. 'దే'కి 'డే'అని, 'ఆస్కింగ్'కి 'అక్సింగ్' అని 'ఆస్క్ హర్'కి 'అక్సిషి' అని దంచేస్తున్న పెద్దమనిషి అతనికి ఇంగ్లీషు తప్ప మరో భాష రాకపోవటం చేత తెలుగేకాక ఇంగ్లీషు కూడా చిన్నప్పటి నుంచి చదువుకొన్న తనకి ఇంగ్లీషు బాగా రాదని ఊహిస్తున్నాడు. అతనికి వచ్చిన ఒక్క భాషా కూడా సరిగ్గా రాదని గ్రహించక, ఇతర్లకు రెండుమూడు భాషలు బాగా రావ చ్చునని తట్టక అల్లా అన్నాడు అని సరిపెట్టుకొ న్నాడు కృష్ణ.

కృష్ణకి మొట్టమొదటిసారిగా కూపస్థ మండూకం అన్నమాట తట్టింది ఆ వెస్ట్ ఇండియన్ విషయంలో.

శ్యామల కాఫీ కలిపి తీసుకువచ్చింది.

''మీరు కార్లు కొన్నారా? కొనకపోతే నన్నడగ కుండా కొనకండి. ఇక్కడికి కొత్తగా వచ్చిన వాళ్లు నడవని కార్లు కొని మోసపోతూ ఉంటా రు. నాలాంటి స్మార్ట్ పర్సన్ పక్కనుంటే అమ్మే వాళ్లు నోరు ఎప్పరు'' అన్నాడు జార్జి.

''మేము కొనలేదు... నెక్స్ట్ వారం కొనాలను కొంటున్నాం. మీరు సహాయం చేస్తానన్నారు

చాలా సంతోషం" అన్నాడు కృష్ణ.

"ఇప్పుడు మీకు వేరే పని లేకపోతే మాతో కరోనీ వైపు తీసుకువెళ్తాం. అక్కడ మా ఫ్రెండు దగ్గర అమ్మకానికి ఓ మంచి కారుంది" అన్నాడు జార్జి.

"అలాగే" అన్నాడు కృష్ణ.

శ్యామలని, కృష్ణని తీసుకొని జార్జి, లత బయల్దేరారు. సదరన్ మెయిన్‌రోడ్‌లో దేవాలయం దాటి కేడేనా డ్రైవ్ ఇన్ దగ్గర కుడివైపుకి తిరిగి హైవేలో వాల్‌సైన్ దాటి సాన్‌ఫెర్నాండో వైపు తిరిగి ఓ పది మైళ్ళు వెళ్లారు.

రోడ్డుకు ఎడంవేపున మట్టిరోడ్డంబడి వెళ్లగా చెరకుతోటల మధ్యగా ఉన్న ఇంటికి తీసుకువెళ్లాడు జార్జి.

"బోసీ ఉన్నాడా?"

ఫ్రాకువేసుకొన్న పదహారేళ్ల అమ్మాయి బయటకు వచ్చి జార్జిని, లతని చూసి, తండ్రి ఉన్నాడని చెప్పి లోపలికి రమ్మని ఆహ్వానించింది. ఇల్లు అంతా కొయ్యతో కట్టారు. ఆంధ్రాలో కొన్ని కిళ్లీ కొట్లు, లాండ్రీ షాపులు కొయ్యతో చేసిన పెట్టిలాంటి తాత్కాలికంగా కట్టే షాపులు గుర్తుకువచ్చాయి. పోతే ఈ ఇల్లు వాటికంటే పెద్దది. పెద్ద హాలు, హాల్లో స్టీరియో సెట్లు, హాలుకి గదులకి మధ్య కర్టెన్లు, కర్టెన్ల వెనుక గదుల్లో జనం. ఒకొక్కరే బయటకు వచ్చారు. ముగ్గురు కూతుళ్లు, ముగ్గురు కొడుకులు, ఒక అల్లుడు, ఇద్దరు కోడళ్లు, భార్యాభర్త.

"షామా" అని లత బోసీ అన్న అతని భార్యను పరిచయం చేసింది. కృష్ణకి ఆ తరువాత సంవత్సరం హౌస్ ఫర్ బిస్వాస్ అని నయపాల్ వ్రాసిన నవల చదువుతుంటే అదే పేరున్న పాత్ర ఈవిడను గుర్తుచేసింది. ఫ్రాక్ వేసుకొని కాళ్లు ఎడంగా పెట్టుకొని గూర్చుంది. ఆడిపిల్లలు కోడళ్లు అందంగా, పొట్టిగా, పీలగా ఉన్నారు. మగవాళ్లు పొట్టిగ కుదిమట్టంగా ఉన్నారు. అంతా బీహార్ నుంచి వచ్చిన వారై ఉండాలి అనుకొన్నాడు కృష్ణ.

కాస్సేపటికి కూతుళ్లల్లో ఒకామె బీరు గ్లాసులు కోకకోలా గ్లాసులు తెచ్చింది- అన్నింటిలోను అయిస్ ముక్కలు వేసి ఉన్నాయి. (ఆ తరువాత ఈ విషయం నారాయణతో చేప్తే, "ఇక్కడ అన్నీ చల్లగా తాగే వాతావరణం. ఎన్నని ఫ్రీజర్స్‌లో పెడ్తారు? అందుకని రోజూ ఓ బస్తాడు అయిస్ కొనుక్కొని అవి వేసుకొని డ్రింక్స్ చల్లబరుచుకొంటారు. పైగా చవకకూడాను. గ్లాసు బీరులో సగం అయిస్ వేసి ఇస్తే" అన్నాడు కృష్ణతో)

కృష్ణ, లత, జార్జి బీరు తీసుకొన్నారు. శ్యామల బీరు రుచి చూడాలని అనిపించినా ధైర్యం చెయ్యలేక కోకకోలా తీసుకొంది.

బోసీ అనబడే రామ్‌చరణ్‌ని- "ఏమన్నా కార్లుంటే చూపించు" అని జార్జి అడిగాడు.

బోసీ దారితియ్యగా కృష్ణ, జార్జి అనుసరించారు. ఆ చెరకు మొక్కల మధ్య రెండు మూడు కార్లు సగం సగం ముస్తాబైనవి ఉన్నాయి.

బోసీ ప్రమాదాలకి గురైన కార్లు చవకగా కొని బాగుచేసి అమ్ముతాడుట. "హి మేక్ నైస్" అని జార్జి ప్రశంసాపత్రం ఇచ్చాడు.

కృష్ణకి ముఖ్యంగా తీవ్ర ప్రమాదానికి గురైన కారు, రక్తం రుచి చూసిన కారు కొనటం ఎందుకో నచ్చలేదు. కానీ మాటవరుసకి మాత్రం ధరలు కనుక్కొన్నాడు.

"మై మాన్ నో ఫాన్సీ ప్రైస్" అని జార్జి బోసీతో చెప్పాడు. అసలు తన దగ్గర ఫాన్సీ ప్రైస్ ఉండదని చెప్తూ బోసీ ఓ అయిదు వందల ట్రినిడాడ్ డాలర్లు తగ్గించి ధరలు చెప్పాడు.

"ఆలోచించి చెప్తాను" అన్నాడు కృష్ణ.

తిరిగిపోవటానికి లేచారు. శ్యామలకి అన్నిరోజుల తరువాత అంతమంది ఇండియన్ ఆడవాళ్లని చూస్తే లేచి రావాలని అనిపించలేదు. ఈస్టర్న్ మెయిన్‌రోడ్‌లో వాళ్ల ఫ్లాట్‌కి వచ్చేసరికి ఇంకా వెలుతురుంది. శ్యామలని, కృష్ణని దించేసి జార్జి, లత వెళ్లిపోయారు.

శ్యామల, కృష్ణలు ఇంటి ముందర ఉన్న మిరప మొక్కలు చూస్తుండే,

"దటీజ్ బర్డ్ పెప్పర్" అన్నారెవరో. కృష్ణ శ్యామల వెనక్కి తిరిగి చూశారు.

అక్కడ ఒక నీగ్రో ఉత్త కచ్‌డ్రాయర్‌తో నిలబడి ఉన్నాడు. అదీ నైలాన్‌ది. వళ్లు కనిపిస్తూ అసభ్యంగా ఉంది అనుకొన్నాడు కృష్ణ.





"కొత్తగా వచ్చారా... ఏ డిపార్ట్‌మెంటు?"

కృష్ణ చెప్పాడు.

"నేను డాక్టర్ లైన్‌ని. బార్బెడోస్ నుంచి వచ్చాను." "నేను ఎకనామిక్స్‌లో లెక్చరర్‌ని" అని చెయ్యి జాపాడు. కృష్ణ చెయ్యి అందుకొన్నాడు. ఆ తరువాత లైన్ తన చెయ్యిని శ్యామలకి అందించాడు. శ్యామల సిగ్గువడ్తూ తన చెయ్యి అందించింది.

"ఈ దేశం వచ్చారేం?" అని నవ్వుతూ అడిగాడు లైన్.

"తెల్లవారిచేత పీడించబడ్డ వర్గాలలో మీరు ఉన్నారు. మేమూ ఉన్నాం. అందుకని మీరు నాకు దగ్గరవారిగా అనిపిస్తారు. మన మధ్య పరస్పర సానుభూతి ఉండే అవకాశం ఉంది. ఇక్కడైతే మమ్మల్ని నమంగా చూస్తారని అనుకొన్నాను" అన్నాడు కృష్ణ.

"టూ ఈక్వల్. మనం ఈ దీవుల్లో పోటీదారులం. ఇండియన్స్‌కి, ఆఫ్రికన్స్‌కి భేదాలున్నాయి. మీకు నెమ్మదిగా అర్థమౌతాయి. అవి అర్థమయ్యాక మీకు ఆఫ్రికన్స్‌పట్ల ఇప్పుడున్న సుహృద్భావం ఉంటుందనుకోను" అన్నాడు నవ్వుతూ.

"నా అభిప్రాయం మారుతుందనుకోను" కృష్ణ మొండిగా అన్నాడు.

"మీకు ఇండియాలో ఎక్కువగా ఆఫ్రికన్సు తగలరు. అందుకని అటువంటి భావం ఉండవచ్చు. నేను ఒకసారి ఇండియా వచ్చాను ఐ.ఐ.టి. మెడ్రాస్‌లో కాన్ఫరెన్సైతే. అందుకని నాకు ఇండియా గురించి కొంచెం తెలును. కాని కెన్యాలోను, ఉగాండాలోను ఇండియన్సుకి, ఆఫ్రికన్సుకి ఉన్న పోటీగూడా తెలునును. ఈ దేశంలో ప్రభుత్వం మా చేతిలోను, డబ్బు మీ చేతిలోను ఉంది. పోటీ చాలా తీవ్రంగా ఉంటూ భేదభావాలకి దారితీస్తున్నాయి. యూ విల్ ఫైండ్ థింగ్స్ ఫర్ యువర్‌సెల్ఫ్" అన్నాడు.

తరువాతి మూడు నాలుగు నెలలు లైను చెప్పిన సత్యాన్ని స్వానుభవంద్వారా తెలుసుకొంటూ గడపాల్సివస్తుందని కృష్ణ అనుకోలేదు.





శనివారం, ఆదివారం హడావిడిగా గడిచిపోయాయి. పశ్చిమదీవుల సంస్కృతి, చరిత్ర కొద్దికొద్దిగా అర్థమవటం మొదలుపెట్టింది శ్యామలకి, కృష్ణకి.

ఆదివారం సాయంత్రం టి.విలో మస్తానా బహార్ అనబడే ఇండియన్ సంగీత కార్యక్రమం చూసారు. అందులో పశ్చిమ భారతీయులకి తమదైన సంస్కృతిని తమ తరువాతి తరాలకి అందించాలన్న తపన ఉంది. అందులో ఫిడేలు వాయించిన ఆయన రామయ్య అనే ఆయన.

"తెలుగువాడు కాబోలు" అనుకొన్నారు. హిందీ మాటల ఉచ్చారణ కొత్తగా ఇంగ్లీషులా వినిపించింది-

"మై టు లసీ టేరి అంగన్‌కి" అన్న పాట వింటుంటే.

కృష్ణ ఆడవాళ్లు ఒంటరిగా నడిస్తే ట్రినిడాడ్‌లో జరిగే ప్రమాదాల గురించి చాలా విన్నాడు. చీకటిపడ్డాక జంటగా నడిచినా ప్రమాదమేనని చెప్పారతనికి. అన్ని క్రైమ్స్‌లోను సెక్స్ క్రైమ్సు ఎక్కువ. స్వేచ్ఛ చాలా ఉన్నా సంభోగావకాశాలు చాలా ఉన్నా సెక్స్ క్రైమ్సు ఎక్కువ ఎందుకు జరుగుతున్నాయో అతనికి అర్థంకాలేదు.

కృష్ణ కారు కొనాలనుకొన్నాడు. కారు కొనకపోతే స్నేహితుల్ని చూసి ఇంటికి చీకటిపడిన తరువాత వెళ్లాలంటే, స్నేహితులు డ్రాప్ చెయ్యాల్సివస్తుంది. వాళ్ల మీద ఆధారపడాల్సి వస్తుంది. అది కృష్ణకిష్టంలేదు. లత, జార్జి కారు కొనటంలో హెల్పు చేస్తామని ముందుకు వస్తున్నారు. కారుకొన్నా నడపటానికి లైసెన్సు కావాలి. అందుకని ముందుగా లైసెన్సు ప్రయత్నం చేద్దామనుకొన్నాడు కృష్ణ.

కృష్ణ, నారాయణ లంచ్‌తిని కాస్సేపు పోర్ట్ ఆఫ్ స్పెయిన్ వీధుల్లో తిరిగారు. కృష్ణకి మొదటిసారి అవటంతో ఉత్సాహం చూపాడు. "బొంబాయిలా ఉంది" అన్నాడు.

"మరో బ్రిటిష్ కాలనీకదా!" అన్నాడు నారాయణ.

"నాకు వీసా నెలరోజులకిచ్చారు. ఇంకో పన్నెండు రోజులుంది, పర్మనెంటు వీసా తీసుకో

వాలి" అన్నాడు కృష్ణ.

నారాయణ వీసా ఆఫీసు చూపించాడు.

రెండు గంటల ప్రాంతంలో మళ్లీ లైసెన్సుల ఆఫీసుకు వెళ్లి, "లైసెన్సు ఎక్కడ ఇస్తారు?" అని ఒక కౌంటర్లో అడుగుతుంటే-

"వెళ్లి క్యూలో నిలబడి నీ ఛాన్సు వచ్చినప్పుడు అడుగు" అని కోపంగా అన్నాడు ఒక నల్లనివాడు.

"నేను అడగటానికి క్యూలో రావాలా?" అని కృష్ణ కౌంటర్లో అమ్మాయినడిగాడు.

"అన్ని ఫార్మాలిటీస్ అయిపోయాయా?"

"అయ్యాయి అనుకొంటాను"

"ఆ పక్క కౌంటర్లో ఇస్తారు"

"థాంక్స్!" అని ఆమెతో చెప్పి, "బ్రదర్! నేనీ దేశానికి కొత్త, ఏ పని తరువాత ఏ పని చెయ్యాలో, ఏ కౌంటర్ దగ్గరకు వెళ్లాలో నాకు తెలియదు. అందుకని ఆ అమ్మాయిని అడిగాను. క్యూని షార్ట్ సర్క్యూట్ చెయ్యాలని కాదు" అన్నాడు కృష్ణ ఆ నల్లనివాడితో.

"సారీ... క్యూలో జేర్తున్నావనుకొన్నాను" అన్నాడు ఆ నీగ్రో తన తొందరపాటుకి చింతిస్తూ.

ఇండియాలో అంత సులభంగా తప్పు ఒప్పుకొంటారా? ఒప్పుకొంటే పరువునష్టం అనుకోరా? అన్న అనుమానం కలిగింది కృష్ణకి. లైసెన్సు కలెక్ట్ చేసుకొంటుంటే పెద్దవాన పడటం మొదలైంది. అది ఆగటానికి అరగంట పట్టింది. వాన తగ్గేనరికి రోడ్లన్నీ నీటిమయం. ట్రినిడాడ్‌లో ఎప్పుడూ అంతే! కొండలమీద పడ్డ వాననీరు క్షణాల్లో కిందికి వచ్చేసి రోడ్లని ముంచేస్తుంది. దీనికి కారణం, కొండల మీద చెట్లు కొట్టేసి, రోడ్లు వెయ్యటం 'ఇల్లు కట్టటం' ప్రతినెల వాన వస్తుంది. నెలకి రెండు మూడుసార్లు రోడ్లు బ్లాక్ అవుతాయి అని చెప్పాడు నారాయణ. ఇంటికి జేరేసరికి 5 గంటలైంది.

★ ★ ★

నారాయణని కారు కొనటం విషయమై కృష్ణ సలహా అడిగాడు నారాయణ తన ఇంటికి వచ్చినప్పుడు.

"మీరు కూడా ఆస్టిన్ మిని కొనుక్కోవటం ఉత్తమం. ఎలాగో మన యు.వి అప్పిస్తుంది. అది కొత్త మిని కారు కొనడానికి సరిపోతుంది" అని చెప్పాడు నారాయణ.

"లత, జార్జి హెల్పు చేస్తామన్నారు..." కృష్ణ "నీ అభిప్రాయం ఏమిటి?" అని సూటిగా అడగకుండా ఆ భావం వచ్చేలా అన్నాడు.

"వాళ్లు ఈ దేశం కొత్తగా ఎవరు వచ్చినా సహాయం చెయ్యటానికి అలాగే ముందుకి వస్తారు" నారాయణ కూడా తన అభిప్రాయం తేల్చి చెప్పలేదు.

"మంచివాళ్లు" అంది శ్యామల.

"అవును" అని నారాయణ ఏకీభవించాడు.

"వాళ్లకి అందులో స్వలాభం లేదంటారా?" కృష్ణ అడిగాడు ధైర్యంచేసి. వాళ్లిద్దరు నారాయణ ఫ్రెండ్సు కనక వాళ్లని అనుమానిస్తే నారాయణకి కోపం వస్తుందని, లేక నొచ్చుకొంటాడని కృష్ణ అనుకొన్నాడు. అందుకని చేతైనంత మాట జారకుండా నారాయణ నుంచి వాళ్ల గురించి తెలుసుకోవాలని ప్రయత్నిస్తున్నాడు.

"ఉంది... వాళ్లు వ్యాపారస్థులు."

"లత మన యు.విలో రిసెర్చి స్కాలర్ కదా!"

"లత కాదులెండి. జార్జి వ్యాపారస్థుడు. అతనికి షాపుంది. అతను కూడా సెకెండ్ హాండ్ వస్తువులు అమ్ముతాడు. కృపలానికి కొన్ని ఆర్టికల్స్ ఇండియా నుంచి తెప్పించి అమ్ముతాడు. ఇండియా నుంచి లత చుట్టాలు పంపుతారు"

"మీకు లత, జార్జి బాగా స్నేహితులనుకొంటాను"

"అవును... లతది, నాది బెంగుళూరు. అందుకని నేనీదేశం వచ్చిన కొత్తలో మా ఇంటికి ప్రతిరోజు వచ్చేది. కాని ప్రతీ సాయంత్రం నాకు వాళ్లతో గడపటం కుదరదు కదా. నాకు వేరే స్నేహితులున్నారు. ఆ విషయం లతకి చెప్పాను. దాంతో వాళ్లు హర్ట్ అయి నా ఇంటికి రావటం తగ్గించారు. కొన్నాళ్లపాటు మీ ఇంటికి వరసగా వస్తారు. వాళ్లు లేకుండా మీకు వేరే

జీవితం లేకుండా చేసి ఊరుకొంటారు''

"బేరు గొట్టారన్నమాట" అంది శ్యామల.

"మరే"

"అయితే వాళ్లని ఒదుల్చుకోవాలన్నమాట. మంచివాళ్లనుకొన్నాను" అంది.

"మంచివాళ్లే... అందులో అబద్ధంలేదు. బేరు కొట్టారు. అదీ నిజమే. వాళ్లని ఒదుల్చుకోవాల్సిన అవసరంలేదు. మనకి వాళ్లని ఎంత దూరంలో ఉంచితే సుఖంగా ఉంటుందో అక్కడ ఉంచాలి. లతకి ఓ పూట కాఫీ ఇచ్చి కబుర్లు చెప్తే మనకి నష్టంలేదు. అలాగే, మనం ఏదైనా సెకెండ్ హాండ్ వస్తువు కొనుక్కోదలుచుకొంటే తెలియనివాళ్ల దగ్గర కొనే కంటే వీళ్ల దగ్గర కొంటే ధరమాట అలా ఉంచి మంచి వస్తువును కొనుక్కోవచ్చు. మన ఇండియన్సుకి మినిమం దూరం మెయిన్‌టెయిన్ చెయ్యడం రాదు" అన్నాడు నారాయణ.

"అయితే వెళ్లి పోర్ట్ ఆఫ్ స్పెయిన్‌లో మనం కొత్త ఆస్టిన్‌కి రిజిస్టర్ చేద్దామా?" కృష్ణ మళ్లీ సంభాషణని కారు విషయానికి మళ్లించాడు.

"చేద్దాం... మీకు ఎప్పుడు వీలో చెప్తే తీసుకువెళ్తాను."

"మేమిద్దరం ఇమిగ్రేషన్ ఆఫీసుకు వెళ్లాలి, పర్మనెంట్ వీసా తీసుకోడానికి. అందుకని రేపు మేము డాక్టర్ దగ్గరికి వెళ్తాం. ఆయనవద్ద ఫిట్‌నెస్ సర్టిఫికెట్ తీసుకొని పి.ఓ.యస్‌కి వెళ్తే అన్ని పనులు చేసుకోవచ్చు" అని కృష్ణ సూచించాడు.

"అలాగే" అన్నాడు నారాయణ. నారాయణ కాఫీ తాగి సెలవు తీసుకొన్నాడు.

కృష్ణకి అది టర్మ్ చివర అవటంవల్ల క్లాసులు లేవు. అందుకని పొద్దున్న తొమ్మిదిగంటలకి శ్యామలను తీసుకొని యూనివర్సిటీ డాక్టరు దగ్గరకు వెళ్లాడు. డాక్టర్ ఆస్‌బార్న్ ఆఫ్రికన్, యూరోపియన్ జాతుల సంతతికి చెందినవాడు.

చక్కగా పలకరించాడు. కబుర్లు చెప్పాడు. తన భార్య "మీ దేశస్థురాలే" అన్నాడు.

"ఏ ఊరు?" అని అడిగితే-

"రోయిలానొ" అని చెప్పాడు.

"మళయాళీలన్నమాట"

"మద్రాసీ" అన్నాడు.

కృష్ణ, శ్యామల ఉలిక్కిపడ్డారు. స్వదేశానికి పదివేల మైళ్ల దూరంలో, దక్షిణ భారతీయులందర్నీ ఉద్దేశించి ఉత్తర భారతీయులు వాడే "మద్రాసీ" అనేమాట ఒక విదేశీయుడి నోట విన్నందుకు.

"మీరు మద్రాసీలనుకొంటాను?"

శ్యామల, కృష్ణ "మమ్మల్ని తెలుగువాళ్లు అని పిలవాలి" అన్నారు.

"మీ దేశంలో మిమ్మల్ని మద్రాసీలంటారని, అలా అంటే మీక్కోపం వస్తుందని స్టెల్లా చెప్పింది. ఇక్కడ కూడా సెటిల్ అయిన ఇండియన్సు కొందరు వాళ్లలో కొందర్ని మద్రాసీలంటూ ఉంటారు. నాకు తెలుసు. మద్రాసీ అనేది కొంత చులకనచేస్తూ అనే మాట అని కూడా నాకు తెలుసు" అన్నాడు ఆస్‌బార్న్.

వంద సంవత్సరాల క్రితం కూలీలుగా వచ్చిన భారతీయులు ఇన్ని సంవత్సరాలైనా పాత వాసనలు ప్రెజ్యుడిస్‌లో పోగొట్టుకోకుండా వాటిని కాపాడుకొంటూ వస్తున్నారన్నమాట- అనుకొన్నారు శ్యామల, కృష్ణ.

"మీరు ఎక్స్‌రే తీయించుకోవాలి. టి.బి ఉందో లేదో చూస్తాను"

కృష్ణ, శ్యామల రేడియాలజిస్టు దగ్గరకు వెళ్ళారు. ఒక వంద ట్రినిడాడ్ డాలర్స్ వదుల్చుకొని మెడికల్ సర్టిఫికెట్సు, తమని ఈ దీవుల్లో మద్రాసీలుగా వ్యవహరిస్తారన్న జ్ఞానం సంపాదించుకొన్నారు.

రిపోర్టులు తీసుకొని నారాయణతో పోర్ట్ ఆఫ్ స్పెయిన్‌కి వెళ్ళారు. శ్యామలకది పి.ఓ.యస్‌కి వెళ్లిన మొదటి ట్రిప్. ఇమిగ్రేషన్ ఆఫీసుకు వెళ్ళారు. అక్కడ కొద్దిగా డబ్బుకట్టి, మెడికల్ సర్టిఫికెట్లు చూపిస్తే వర్క్ పర్మిట్ ఎన్నాళ్లకుందో అన్నాళ్లకి వీసా ఇచ్చారు. అక్కడ నుంచి ఆస్టిన్ మినీ కొనడానికి వెళ్లారు. షోరూమ్‌లో ఫామ్సు తీసుకొని కారు బుక్‌చేసారు. నెలరోజుల్లో కారు ఇస్తానన్నాడు.

ఆ మర్నాడు యూనివర్సిటీలో కొత్త కారు కొనడానికి లోన్‌కి దరఖాస్తు పెట్టాడు కృష్ణ వడ్డీ





తక్కువగాయూవిఅప్పులివ్వడం అతనికి చాలా నచ్చింది. ఇంటికి కావలసిన సమస్తం కొనుక్కోగలిగాడు. నెలకి వెయ్యి ట్రినిడాడ్ డాలర్లు జీతంలో కోసేసినా ఇన్‌కమ్‌టాక్స్, ఇంటిఅద్దె కలిపి మరో ఎనిమిది వందలు పట్టుకొన్నా ఇద్దరికి మిగిలిన ఏడువందల్లో తిండికి, కారుకి నాలుగు వందల డాలర్లు అవుతుంది. ఇంకా మూడు వందలు బట్టలకి, మరోదానికి మిగుల్తాయి. కృష్ణ ట్రినిడాడ్ వచ్చినందుకు సంతోషించాడు ఆ రోజు.

సోమవారం న్యూస్‌పేపరు విప్పాడు కృష్ణ. "కరోని నది పక్కనున్న చెరుకుతోటల్లో బలాత్కారం" అని పెద్ద శీర్షికతో వార్త కొట్టవచ్చినట్టు కనిపించింది. శకుంతల హార్‌దేవ్ అన్న అమ్మాయి సినిమా చూసి తనకంటె చిన్నపిల్లాడితో ఇంటికి వెళ్తూ ఆ దారినేపోతున్న కారు ఆపి లిఫ్ట్ అడిగిందట. కారు నడుపుతున్న మధ్యవయస్సు పెద్దమనిషి వారినెక్కించుకొని నిర్మానుష్యమైన చోటురాగానే కారాపి సత్రకాయను కత్తి చూపి బెదిరించి దూరంగా తోలేసి ఆ పదహారేళ్ల పిల్లమీద పడ్డాడట. శకుంతల చెరుకుతోటలోకి పరిగెత్తగా వెంటపడి, ఆమెను బలాత్కారంగా అనుభవించి, ఆపైన తనచేతిలో ఉన్న పొడుగు కత్తితో నరికివేశాడు. దూరంగా తరిమివేయబడ్డ చిన్నపిల్లాడు పెద్దలతో చెప్పాడు. వారు పోలీసులతో చెప్పారు. వాళ్లు దర్యాప్తుచేస్తున్నారు.

ఆ వార్త శ్యామలకి చూపించాడు కృష్ణ. "ఎవడో నల్లవాడయి ఉంటాడు" అంది శ్యామల. శ్యామలకి హంతకులు దొంగలు నల్లగా ఉంటారని నమ్మకం. ఆ కారణంగా ఆ మానవ రాక్షసుడు నీగ్రో అని నమ్మింది.

ఆ రోజు యూనివర్సిటీలో కాఫీబల్ల దగ్గర ఈ విషయం చర్చకి వచ్చింది. కృష్ణ, నారాయణకాక పళనిస్వామి అన్న తమిలుడు, జ్ఞానరత్నం అనే సింహాళ తమిళుడు, పెరారా అనే సింహాళ సింహాళీయుడు, శర్మ అనే పంజాబీ, క్లార్క్ అనే ఆంగ్లేయుడు, క్రిస్‌చంద్రూ అనే పశ్చిమ భారతదీవులకి చెందిన భారతీయుడు ఉన్నారు. నీగ్రోజాతివాళ్లెవరు సాధారణంగా కాఫీ తాగటానికి రాకపోవటం కృష్ణ గమనించాడు. ప్రతిరోజు తప్పకుండా కాఫీబైముకి వెళ్ళి తాగేవాళ్లు విదేశీయులైన సింహాళీయులు, భారతీయులు మాత్రమే. ఒకరోజు ఈమాటే కృష్ణ నారాయణతో అంటే,

"వాళ్ళసలు యూవికి వస్తేకదా! క్లాసులు మనలాంటివాళ్ళకప్పచెప్పి, వాళ్లు వేరే విధాలుగా డబ్బు చేసుకోడంతో కాలం గడుపుతారు. మీ ప్రొఫెసర్ జంక్ మాత్రం చాలా రెగ్యులర్‌గా వస్తాడు. మా హెడ్ గుణశేఖరన్ సింహాళీయుడు. వాడికి తప్పక వాడూ వస్తాడు. మిగిలినవాళ్లు ఏడాదిలో ఎప్పుడో కనిపిస్తారు" అన్నాడు నారాయణ.

ఆ రోజు కాఫీబల్ల దగ్గర శకుంతల బలాత్కారం చర్చకి వచ్చింది.

"ఇంత పయొలెన్సు మాదేశంలో లేదు" అన్నాడు పెరారా.

"లేదంటే నేను ఒప్పుకోను. అర్ధరాత్రిపూట మా ఇల్లూ పొలాలు తగలబెట్ట బట్టేకదా నేను స్వంత దేశంలో ఉద్యోగం వదిలిపెట్టుకొని ఇక్కడకి వచ్చాను" అన్నాడు జ్ఞానరత్నం అక్కసుగ.

"సిలోన్‌మాట తెలియదుకాని, ఇండియా చాలా క్షేమకరమైన దేశం" అన్నాడు శర్మ.

"మరే ఢిల్లో బస్సులో రాత్రి తొమ్మిది తరువాత వంటరిగా ఎక్కిన అమ్మాయి క్షేమంగా ఇంటికి చేర్తుందికదూ!" అన్నాడు కృష్ణ వేళాకోళంగా.

"మా తమిళనాడు చాలా క్షేమం" అన్నాడు పళనిస్వామి. అతని ఉచ్చారణఅర్థం చేసుకోటానికి విద్యార్థులు చాలా బాధపడ్తారని నారాయణ చెప్పాడు. 'సంచయ్‌కాంతి' అని 'పలనిచామి' అంటే దాని అర్థం తెల్సా? అని అడిగి ధాని అర్థం సంజయ్‌గాంధీ అని చెప్పాడు. "ఒక తమిళ పత్రిక ఉంది. దాంట్లో విశేషాలన్నీ తమిళనాడులో మానభంగాల గురించి, హత్యల గురించే" అన్నాడు కృష్ణ.

"ఆడ మగ అన్న తేడాలున్నంతవరకు ఈ రేప్స్ ఉంటాయి. ఎవరి జాగ్రత్తలో వాళ్లుండాలి. ఏ సమయంలోను కొత్తవాళ్ల దగ్గర లిఫ్టితీసుకోరాదని మేము పిల్లలకి చెప్తాం. అటువంటిది రాత్రిపూట వయస్సులో ఉన్న ఆడపిల్ల అటువంటి సాహసం చెయ్యారా

దు'' అన్నాడు క్లార్కు.

"ఎలాగైనా ఈమధ్య క్రైమ్ బాగా పెరిగింది'' అనుకొన్నారు అందరూ.

అప్పుడు క్రిస్ చెంద్రూ నోరు విప్పాడు, "క్రైమ్ ఎప్పుడూ ఉంది, అన్ని దేశాల్లో ఉంది. రామ్ కాలంలో రావణ్ ఉన్నాడు. అయితే మీడియాలో కవరేజి పెరిగి ఏమూల ఏ క్రైమ్ జరిగినా అందరికీ తెలుస్తోంది. పూర్వం ఆ కబురు అందేది కాదు. అందుకని అప్పుడు క్రైమ్ లేదని ఇప్పుడు ఉందని అనుకొంటున్నాం. ఈ దేశాల్లోనే బానిసల మీద, కూలీల మీద ఆంగ్లేయులు రోజూ అత్యాచారాలు చేస్తూనే ఉండేవారు కాదా!''

ఎవరూ మాట్లాడలేదు. మరునటి వారం సెయింట్ ఆగస్టిన్ స్కూలు దగ్గర ఆ స్కూలుకి చెందిన పదిహేడేళ్ల అమ్మాయి బలాత్కరింపబడి ఆ తరువాత హత్య చేయబడింది అన్న వార్త వచ్చినపుడు మళ్లీ ఆ విషయం చర్చకి వచ్చింది.

"పోలీసులు ఈ దేశంలో ఉత్త చేతకానివాళ్లు'' అన్నాడు శర్మ.

"వాళ్లు అందరు నల్లవాళ్లే'' అన్నాడు క్రిస్ చెంద్రూ.

"అదెలా జరిగింది?'' అని కృష్ణ అడిగాడు.

"రాజకీయ అధికారం స్వాతంత్ర్యానంతరం నల్లవారి చేతిలోకి, చదువు, వ్యాపారం ఇండియన్ జాతివారి చేతిలోకి వెళ్లాయి. రాజకీయ అధికారాన్ని పోగొట్టుకోడానికిష్టపడని నల్లవారు పోలీసుశాఖని తమ చేతుల్లో ఉంచుకొనే ప్రయత్నంగా ఆరు అడుగుల కంటే తక్కువ పొడుగున్నవారు పోలీసుశాఖలో ఉద్యోగాలకి పనికిరారన్నారు. దానితో మావాళ్లెవరికి జేరే అవకాశం లేకపోయింది'' అని క్రిస్ చెంద్రూ చెప్పాడు.

"ఇక్కడికి పంజాబీలు కూలీలుగా వచ్చి ఉంటే ఈ ఎత్తు సమస్య ఉండేది కాదు'' అన్నాడు శర్మ.

"మీరంత పొడుగు జాతా?'' క్లార్కు అడిగాడు.

"మామూలుగా మద్రాసీలకంటే నార్తులో మనుషులు పొడుగు. నార్తులో అందరికంటే పంజాబీలు పొడుగ్గా, బలంగా ఉంటారు'' శర్మ ఆ అభిప్రాయం వెలిబుచ్చగానే నారాయణ కస్సుమని లేచాడు.

ఈదేశం వచ్చిన కూలీలందరు రమారమి యు.పి, బీహార్ల నుంచి వచ్చినవాళ్లు. క్రిస్ చెప్పినదాన్నిబట్టి వాళ్ళెవ్వరూ కూడా ఆరడుగుల ఎత్తు లేరు. అంటే నార్త్ ఇండియన్లు పొడుగు కాదని తేలిపోయింది కదా! ఇంకా పంజాబీలు. నువ్వు పంజాబీ వాడివి. నేను, కృష్ణ మద్రాసీలమి. మేమిద్దరం ఆరడుగులున్నాం, నువ్వు అయిదున్నర ఉన్నావు. కనుక నీది అభిప్రాయమేకాని సత్యం కాదు'' అన్నాడు.

"అక్కడితో చర్చ నిలిచిపోయింది. నల్లవారికి, భారతీయులకి ఉన్న మనస్పర్థలు, ఎంత దూరంపోయినా వింధ్యపర్వతాలకి అవతల ఇవతల అన్న తేడా పోకపోడం కృష్ణ దృష్టికి మరోసారి వచ్చాయి.

రూట్స్ టివిలో చూపిస్తున్నారు. ఆఫ్రికన్లని షిప్స్‌లో పశువులకంటే హీనంగా కట్టి తీసుకువెళ్లటం ఆడబానిసల్ని తెల్లవారు తమ కామంతీర్చుకోడానికి, వాడుకోటం, మగవారిని కొరడాలతో కొట్టడం అదీ చాలా భయంకరంగా, రెచ్చగొట్టేటట్టు ఉంది ఆ సీరియల్. ఒకరోజు రాత్రి పదిగంటలకి పక్కింటి లైన్ వచ్చి తలుపు కొట్టి 'మీ టి.విలో నేనీరోజు రూట్స్ చూడవచ్చా?'' అని అడిగాడు.

తను విన్నదానిని కృష్ణ శ్యామలకి చెప్తూ ఉండటంతో శ్యామలకి లైను చూడటానికి వస్తాననటం భయం కలిగించింది. అతనేదైనా చెడు తలపెడ్తే కృష్ణ అడ్డుకోగలడా అని ఆలోచించింది. రాక్షసులు నల్లగా ఉంటారు. నల్లగా ఉన్నవారు చెడ్డవాళ్లు అన్నభావం ఆమె అంతరాంతరాల్లో పాతుకుపోయింది. కాని ఆమెకి ఆ క్షణంలో గుర్తుకురాని విషయం తను కూడానల్లనిదేనని "వద్దు'' అన్నట్టు శ్యామల కృష్ణకేసి చూసింది. అతను దాన్ని పట్టించుకోకుండా "తప్పకరండి. చూద్దురుగాని'' అని లైన్‌కి కృష్ణ తలుపు బార్లాతెరిచాడు.

లైన్ వచ్చి కూర్చున్నాడు. డ్రాయర్ మీద ఒక బనియన్ మాత్రం తొడుక్కున్న అతన్ని




చూస్తే శ్యామలకి భయం పెరిగింది.

"నాకు నిద్రవస్తోంది" అంటూ పైకివెళ్లి పడుకొంది. లైన్ "రూట్స్" వచ్చినంతసేపు కూర్చుని, ఆ తరువాత లేచి వెళ్తూ,

"క్రిస్టీ పిల్లాడి తండ్రి జాన్ నా స్నేహితుడు. అతనికి అద్వైత వేదాంతం పట్ల చాలా గౌరవం ఉంది. అతన్ని ఒకరోజు తీసుకువస్తాను. నీతో మాట్లాడటానికి అతను ఉత్సాహం చూపిస్తాడు అనిపిస్తుంది" అన్నాడు.

"తప్పకుండా తీసుకురండి" అన్నాడు కృష్ణ.

నల్లవారికి భారతీయులపట్ల గౌరవం లేక పోవడానికి, ఈ నల్లవాడికి అతని స్నేహితుడికి హిందూమతంపట్ల అంత గౌరవం ఉండటానికి పొంతన కుదరలేదు కృష్ణకి. జాతిబట్టి వ్యక్తులమీద అభిప్రాయాలు ఏర్పరచుకోరాదు అన్నవిషయం అతనికి ఆ తరువాత అర్థమైనప్పుడు, కులంబట్టి కూడా ఏర్పరచుకోరాదని అన్ని మతాల్లోను, అన్ని జాతుల్లోను మంచి చెడు కలగాపులగంగా ఉంటాయని, మంచి ఏ ఒక్కరి సొత్తు కాదని అనుకొన్నాడు.

శుక్రవారంనాడు కృష్ణ లైబ్రరీలో పుస్తకాలు తీసుకొంటున్నాడు. ఒక పద్దెనిమిదేళ్ల పిల్ల తీసుకొంటున్న పుస్తకాల పేర్లు కంప్యూటర్‌కి ఫీడ్ చేస్తోంది. ఆమె కొంచెం వంగుని బటన్స్ నొక్కుతుంటే బొత్తాలు లేని ఆమె ఫ్రాక్ మెడలోంచి ఆమె చిన్న రొమ్ములు కనిపించాయి.

"హలో" అని వినిపిస్తే కృష్ణ పక్కకి తలతిప్పాడు- లైను కనిపించాడు.

"హలో" అన్నాడు కృష్ణ.

"పుస్తకాలిచ్చేసిపోదామని వచ్చాను" అన్నాడు లైన్.

"ఈ పెద్దమనిషి పని చూస్తున్నాను. కొద్దిగా ఆగాలి" అంది ఆ కంప్యూటర్‌కి ఫీడ్ చేస్తున్న కుర్రది.

"నో ప్రొబ్లెమ్. ఎంతసేపైనా వేచి ఉండగలను- నీ అందమైన మొహం, పళ్లూ చూస్తూ" అన్నాడు లైన్ వినయంగా.

కృష్ణ అక్కడో పెద్ద రభస జరుగుతుందనుకొన్నాడు. ఆ పిల్ల నవ్వి ఊరుకొంది. ఆ నల్లపిల్ల నల్లని బుగ్గలు కూడా కొద్ది ఎరుపు తిరగటం గమనించాడు. ఆ పిల్ల దానిని కాంప్లిమెంట్‌గా తీసుకొంది. లైన్ కూడా ఆ ఉద్దేశంతోనే ఇచ్చాడు కాబోలు. ఆ పిల్ల విషయం పట్టించుకోకుండా కృష్ణతో కబుర్లలో పడ్డాడు.

ఆ వారాంతంలో లైబ్రరీ పిల్ల లైనింటికి వచ్చింది. లైన్ మ్యూజిక్ పెట్టాడు. అతను స్టీరియోని ఇండియాలో దేవుడి గుడి ముందర మైకులంత గట్టిగా పెట్టాడు. అందులోంచి "ఓ..ఓ.." అంటూ డిస్కో మ్యూజిక్ వినిపిస్తోంది. శుక్రవారం సాయంత్రం మొదలైన పక్కింటి నృత్యం సోమవారం పొద్దున్నదాకా సాగింది. తాగుతూ ఉండటం, మధ్యలో ఏదైనా తినటం, డాన్సు చెయ్యటం, హుషారు ఎక్కువైతే ఆ పిల్ల వెంట లైను, లైను వెంట ఆ పిల్ల పరిగెత్తటం, చాలా గోలగా తయారైతే రెండు మూడుసార్లు కృష్ణ వెళ్లి తనకి ఇబ్బందిగా ఉందని చెప్పి వచ్చాడు. చెప్పివచ్చిన కాస్సేపు పాటు గోల తగ్గేది. బహుశా ఆ సమయంలో వాళ్లు పడకటింట్లో విశ్రమించి ఉంటారనుకొన్నారు శ్యామల, కృష్ణ.

కృష్ణ పదే పదే చెప్పటానికి బయల్దేర్తుంటే "అసలే మోటుముండాకొడుకులీనల్లవాళ్లు. మిమ్మల్ని కొట్టినా కొడ్తాడు వెళ్లకండి" అంది శ్యామల.

కృష్ణ సమాధానపడ్డాడు. "వీళ్లకి దేహపరమైన కోర్కెలు హెచ్చు" అంది శ్యామల బలవంతంగా కళ్లు మూసుకొంటూ.



**1845**వ సంవత్సరం మే 30న ఇండియా నుంచి ఓడలో కూలీలు ఎన్నో కష్టాలకి ఓర్చుకొని ట్రినిడాడ్ చేరుకొన్నారు. విముక్తి పొందిన నీగ్రో బానిసలు తమకన్నా దుస్థితిలో ఉన్న ఈ

కూలీలను చూసి సంతోషించారు తప్ప జాలిపడలేదు. విముక్తి పొందిన నీగ్రోలు వ్యవసాయాన్ని తమ గతబానినత్వంతో ముడిపెట్టుకొని వ్యవసాయం చేయడానికి ఇచ్ఛగించలేదు. అందుకే భారతదేశం నుంచి శ్రామికులు వచ్చారు. భారతదేశంలో తామనుభవిస్తున్న దుర్భర దారిద్ర్యంతో పోలిస్తే, ఏ దేశంలోనైనా అంతకంటే పడే కష్టం పెద్ద ఏముండగలదనే మొండి భరోసాతోనే వీరు వచ్చారు. తమని చూసి నవ్వుతున్న నీగ్రోల మీద భారతీయులకి సదభిప్రాయం ఏర్పడలేదు. ఆవిధంగా ఆ రెండు జాతులు 1845 నుంచి పరస్పరం అనుమానాలు పెంచుకొని అవమానించుకోసాగాయి.

ఎటువంటి నేలలోనైనా పంటలు పండించగల భారతీయులు ట్రినిడాడ్‌ని వ్యవసాయకంగా అభివృద్ధిచేశారు. సంవత్సరాల సాగుబడి అనంతరం వారిలో కావాలనుకొన్నవారికి కూలీకి బదులుగా భూమి లభించింది. భూమిని స్వీకరించి పశ్చిమదీవులను, స్వదేశం చేసుకొన్న భారతీయుల్లో అధికభాగం ఉత్తరప్రదేశ్‌వారు, బీహారీలు, తెలుగువారు, తమిళులు కొద్దిగా ఉన్నారు. ఈనాడు కనిపించే గుజరాతీల్లో ఎక్కువమంది భారతీయులు ఆ దీవుల్లో సంపన్నులయ్యాక వారి ప్రత్యేకమైన అవసరాల దృష్ట్యా వ్యాపారం చేయటానికి వచ్చారు. ఆ దీవుల్లో పెద్దపెద్ద డిపార్ట్‌మెంటు స్టోర్స్ నడిపేవారు సింధీలు. ఆవిధంగానే భారతీయ జనాభాకి మతపరమైన కర్మకాండ నడిపించేందుకు కొద్దిమంది బ్రాహ్మణులు కూడా నెమ్మదిగా చేరుకొన్నారు ఆ దీవులకి.

కృష్ణకి శ్యామలకి మే నెల చివరి ఆదివారం ఇండియా డే అన్న విషయం పెద్ద పెద్ద పోస్టర్ల ద్వారా తెలిసింది. లక్ష్మి హిందు హైస్కూల్‌లో సభ జరుగుతుందని హిందూ సభ ప్రకటించింది. ఆ పాఠశాల వీరుంటున్న ఫ్లాట్స్ పక్కనే ఉండటంతో చూద్దామని వెళ్లారు ఆ రోజు. లక్ష్మి హిందూ హైస్కూల్ ఆడపిల్లల స్కూలు. స్కూలు ఆవరణ అంతా కార్లతో నిండిపోయింది. వంటలు భారీగా జరుగుతున్నాయి ఓ మూలగా. పిల్లలు కోకాకోలాలు తాగుతూ హడావిడిగా పరుగెత్తుతున్నారు.

ఉపన్యాసాలు మొదలయ్యాయి. ఒకాయన ఉద్రేకంగా చెప్పాడు-

"హిందూ సభ ఇక్కడే పుట్టిపెరిగిన సంస్థ. ఇండియాతో ఏ సంబంధమూ లేని సంస్థ. మన ఆఫ్రికన్ సోదరులు మన వేళ్ళు ఇండియాలోనే ఉన్నాయన్నీ ఇండియాలోని సంస్థలు మనని నడిపిస్తాయని అంటారు. అది అబద్ధం. ఈ సంస్థ పూర్తిగా పశ్చిమ దీవుల సంస్థ- ట్రినిడాడియన్ను సంస్థ. 105 దేవాలయాలు పాఠశాలలు కళాశాలలు నడుపుతున్న సంస్థ. మన పిల్లలు మంత్రాలు పఠించగలగాలి. కొరాన్ పఠించగలగాలి. అందుకని మనం మన మాతృభాషలు అయిన హిందీ, ఉర్దూలు నేర్చుకోవాలి. మన పిల్లలకి 'నమస్తే' అనటం నేర్పాలి. ఈ 'గుడ్‌మార్నింగ్'అర్థంలేనిది. ఇంక మన స్కూళ్ల విషయానికి వస్తే మతబోధ గంట ఖాళీ. ఉపాధ్యాయులు లేరు మన మతాలు బోధించడానికి, క్రిస్టియన్స్ నడిపే స్కూళ్లల్లో మిగిలిన సబ్జెక్ట్సు నేర్పడానికి టీచర్స్ లేకపోయినా, మతబోధ చెయ్యడానికి ఎప్పుడూ ఉంటారు. మనదేశం అన్ని జాతులు, అన్ని మతాలు ఉన్న దేశం. ఈరోజు జోథ్‌పూర్ మహారాజుగారు మన మధ్య ఉన్నారు. ఆయన ఇండియాలో ఓ పెద్ద మహల్‌లో ఉంటారు. ఆయనని మాట్లాడమని కోరుతున్నాను"

ఇండియన్ హైకమీషనర్ అయిన జోథ్‌పూర్ రాజు చాలా కొద్దిగా మాట్లాడారు.

భోజనాల సమయం అవటంతో కృష్ణ, శ్యామల తిరిగి తమ ఇంటికి వెళ్లారు. టేబుల్ మీద మామిడికాయ పచ్చడి, పులుసు, కోడి కూర పెట్టింది. ఇచ్చే జీతంతో పోలిస్తే కోళ్లు చాలా చవక. అందుకని అక్కడకు వెళ్లిన అందరు భారతీయ మాంసాహారులలాగానే శ్యామల కూడా పూట పూట కోడిని వండుతోంది. భోంచేస్తూ కృష్ణ "ట్రినిడాడ్‌లో 105 దేవాలయాలున్నాయట. మనం కారు రాగానే కొన్ని ముఖ్యమైనవాటిని చూసివద్దాం" అన్నాడు

మరుసటివారం కృష్ణ బుక్ చేసిన ఆస్టిన్ 850 మిని కారు వచ్చింది. మొట్టమొదటగా క్యూరెప్‌లో చూసిన గుడికి వెళ్లారు.




అది ఒక రామాలయం. ఒక గదిలో రాముడిది, సీతది, హనుమంతుడి పటాలు, రామపట్టాభిషేకం పటం ఉన్నాయి. వరండాలో నాలుగు బెంచీలున్నాయి. ఒక నల్లగా ఉన్న భారతీయుడు పెద్ద కుంకుమబొట్టుతో కూర్చుని ఉన్నాడు. అతనికి గౌను మీద ఓణీ వేసుకొన్న హిందూ స్త్రీ నమస్కరిస్తోంది. అతను ఆశీర్వదించాడు ఆమెను. కృష్ణకి, శ్యామలకి అతను పూజారో సన్యాసో అర్థం కాలేదు. అందుకని అడిగారు. తను పూజారినని చెప్పాడు. అక్కడున్న మందారచెట్టు పూలు రెండు కోసి దేవుడికి సమర్పించారు. పళ్లెంలో రెండు డాలర్లు వేసారు.

"మీరే ప్రాంతంవాళ్లు?"

"ఆంధ్రులం"

"మీకు మాచెర్ల తెలుసా?"

"తెలును"

"మా పూర్వీకులు ఆ ఊరువాళ్లు"

"మీ పేరు?"

"రామయ్య"

"మీ ఇంటి పేరు?

"కురిమి"

"బ్రాహ్మలా?"

"కాము... కుమ్మర్లం"

"మరి మీరు ఇక్కడ పూజారినంటున్నారు"

"నా కులం మార్చుకొన్నాను. సత్కర్మచేసి బ్రాహ్మడిగా మారాను. మాంసం తినను. మద్యం తాగను. రోజూ పూజచేస్తాను. మరి నేను బ్రాహ్మడినే కదా! ఇంకా నేను పండిట్ పరీక్షలు రాయలేదు. రాస్తే పెళ్లిళ్లు చేయించవచ్చు, తద్దినాలు పెట్టించవచ్చు. కాని నాకు డబ్బుమీద ఆశ లేదు"

ఆ తరువాత రామయ్యా తన తల్లిదండ్రుల నుంచి నేర్చుకొన్న ఒకటి రెండు తెలుగు మాటలు మాట్లాడాడు. ఆపైన తనకాళ్లకి మొక్కమన్నాడు. అతనలా అంటే ఎందుకో వాళ్లకి మొక్కాలనిపించలేదు. నమస్కారం పెట్టి ఊర్కొన్నారు. "దేవుడు మీకు బహు సంతానాన్ని ఇచ్చుగాక" అని దీవించాడు.

"దేవుడిచ్చినా మా ప్రభుత్వం పుచ్చుకోవద్దంటూ గోలపెడుతోంది" అన్నాడు కృష్ణ నవ్వుతూ.

"ఎంతమందిని వీలైతే అంతమందిని కనాలి. ఇక్కడ భారతీయులంతా వీలైనంత మంది పిల్లల్ని కంటారు. ఈ ద్వీపాన్ని రాజకీయంగా మేము స్వాధీనపరచుకొనేరోజులు త్వరలోనే వస్తాయి. మొదట్లో 30 శాతం ఉన్న మా జనాభాని 50 శాతానికి పెంచాం. నల్లవాళ్లకి పెళ్లిళ్లు పెటాకులు పిల్లల్ని కనటాలు పెంచటాలు లేవు. వివాహవ్యవస్థ బలమైనదిగాక వాళ్ళ జాతి క్షీణిస్తోంది. మనది అభివృద్ధి పొందుతోంది"

జాతులమధ్యనున్న వైషమ్యం కృష్ణ దృష్టికి ఆవిధంగా ఆ పూజారి మరోసారి తీసుకువచ్చాడు.

నారాయణ తమ ఇంటికి వచ్చినప్పుడు కృష్ణ శ్యామల ఈ కులాల మార్పిడి గురించి అడిగారు. "కూలీలుగా వచ్చిన భారతీయులు ఓడమీద ఎన్నోరోజులు గడపాల్సివచ్చింది. ఆవిధంగా కలిసి ఓడమీద కష్టసుఖాలు పంచుకోవడంతో వాళ్లమధ్య ఓడ సోదరత్వం (జహాజ్ భాయి) ఏర్పడింది. అన్నపానాలు కలిసిపోయాయి; అడ్డగీతలు చెరిగిపోయాయి కులాలమధ్య. ఒకరికి ఒకరు తెలియని కొత్త ప్రదేశంలో, ఉంచుకొన్నవాళ్లు పాత కులాలు ఉంచుకొన్నారు, లేనివారు వారికి నచ్చిన కులాలకి మారిపోయారు. "నీదీ కులం కాదు" అనడానికి ఎవరిదే కులమో మిగిలినవారికి తెలియదు. "నువ్వు కులభ్రష్టుడివి" అనటానికి, అక్కడ కాకుండాపోయినవాళ్లెవరూ లేకపోయారు. ఆవిధంగా కులాలమధ్య దాటగలిగిన అస్పష్టపు గీతలుతప్ప, అనుల్లంఘనీయమైన అడ్డుగోడలు ఇండియాలోలాగా లేకపోయాయి. మీకు ఇంటరెస్టుంటే వాళ్ల చరిత్ర గురించి మన లైబ్రరీలో పుస్తకాలున్నాయి చదవండి" అన్నాడు.

పైగా "సెంట్ జేమ్సులో నయపాల్‌వాళ్ల కృష్ణుడి గుడి ఉంది చూడండి. బావుంటుంది" అని సలహా ఇచ్చాడు.

ఆ మరునటి ఆదివారం ఆ గుడికి వెళ్లారు. అది చూస్తుంటే హైదరాబాద్‌లో బిర్లా



మందిరం గుర్తుకు వచ్చింది. గుడిలో చర్చిలో లాగా కూర్చోడానికి ఎత్తు తక్కువ బెంచీలు న్నాయి. గుడిచుట్టూ ఆవరణ ఉంది ప్రదక్షిణ చెయ్యటానికి. పూజలు పునస్కారాలు ఉన్నాయి. అక్కడ పెళ్లిళ్లుచేసుకొంటారట. గుడి చాల ప్రశాంతంగా ఉంది. కాని దక్షిణ భారతదేశంలోవాళ్లు అలవాటుపడిన గుళ్ల లాగా లేక కొంచెం నిరాశ కలిగించింది. ఉత్తర భారతంలోని గుళ్ల నమూనాలో ఉందని, ట్రినిడాడ్ ఇండియన్సులో ఔత్తరాహికులే ఎక్కువని వాళ్లకా సమయంలో అనిపించలేదు. 'గుడి' అనే భావంకి దక్షిణ భారతదేశంలోని గుడి రూపం ఇచ్చుకొన్నారు కనక తద్భిన్నమైనవి గుడిగా అనిపించకపోవటం, కలగాల్సిన భక్తి భావం కలగకపోవటం జరిగింది.

ఒక పెద్దావిడ వచ్చి పలకరించింది. ఆవిడ చీరే కట్టుకొంది. "నేను నయపాల్ తల్లిని. ఈ గుడి మా ఆధ్వర్యంలో నడుస్తోంది" అని చెప్పి శ్యామల బుగ్గమీద ముద్దుపెట్టుకొంది. అనుకోని ముద్దుకి శ్యామలకి తను ఏవిధంగా స్పందించాలో తెలియలేదు. "నమస్తే" అని ఊరుకొంది. ఇంగ్లీషువారినుంచి భారతీయులు బుగ్గ ముద్దులు కూడా స్వీకరించి తమ ఆచారంగా చేసుకొన్నారని నెమ్మదిగా తరువాత అర్థమైంది వాళ్లకి.

"ఇక్కడ నిజం గుళ్లు లేవా 105 గుళ్లలో?" అని శ్యామల కొంత హాస్యంగాను, కొంత వ్యథతోను అడిగింది నారాయణని.

"కొంతమంది సౌతిండియన్స్ ఒక అరవ అయ్యర్‌ను తీసుకువచ్చారు. అతని ఆధ్వర్యంలో ఎల్‌డురాడోలో ఒక శివాలయం నడుపుతున్నారు. ఆ వీధి మొగలో ఉన్న కోపరేటివ్ స్టోర్స్‌లో మీకు గోధుమపిండి దొరుకుతుంది. అందుకైనా మీరా గుడికి వెళ్లవచ్చు. నేను వచ్చి తీసుకెళ్తాను. నాకు గోధుమపిండి కావాలి" అని చెప్పాడు నారాయణ.

నారాయణ వాళ్లని తన కార్లో ఎల్‌డురాడో తీసుకువెళ్లాడు. అది ఒక పాత శిథిల శివాలయంలా ఉంది. అందులో ఒక తమలపాకు తీగ ఉంది. పూజ నిమిత్తం పెంచుతున్నారుట. పోకచెట్టు కూడా ఉంది. అది చూడగానే గుడి భావం కలిగింది శ్యామలకి- కృష్ణకి. గుళ్లో పూజారి అయ్యరు పోయాడని మరెవరో నడుపుతున్నట్టు తెలిసింది.

గుడి చూసుకొని కోపరేటివ్ స్టోర్స్‌లో కావాల్సినవి కొనుక్కొని వెనక్కివచ్చారు.

"మనసులో లేని దేవుళ్లు గుళ్లల్లోనూ లేరు" అనుకొని శ్యామల ఇంట్లోనే తను తెచ్చుకొన్న పటాలకి పూజ మొదలుపెట్టింది. కృష్ణకి దేవుడు మనసులో కూడా అంత బలంగా లేడు.

* * *

ఒక ఆదివారం సాయంత్రం కృష్ణ సహోద్యోగులైన శర్మ కుటుంబాన్ని, పళనిస్వామి కుటుంబాన్ని, జ్ఞానరత్నం కుటుంబాన్ని టీకి పిలిచాడు. అందరు పకోడీలు తింటూ కబుర్లు చెప్పుకొంటుంటే ఒక ముసలావిడ పరిగెత్తుకొని వచ్చి, పిలవకుండా లోపలికి వచ్చి కూర్చుని ఒగర్చటం మొదలుపెట్టింది. ఆమె నుదురంతా చెమటపట్టి ఉంది. అరవై సంవత్సరాలు ఉంటాయి. యూరోపియన్ జాతికి చెందింది. ఆయాసపడ్తూనే,

"మీ ఫ్లాట్స్ చివర ఒక మనిషి ఉన్నాడు. వాడు నన్ను పట్టుకొన్నాడు. తరువాత వాడి లాగూ విప్పటం మొదలుపెట్టాడు. మగాళ్లు వెళ్లి వాడిని ఏమైనా చెయ్యండి. నేను ఎలాగో తప్పించుకొని వచ్చాను" అంది.

కృష్ణ, శర్మ, పళనిస్వామి, జ్ఞానరత్నం లేచి ఫ్లాట్స్ చివరికి వెళ్లారు. అక్కడ బక్కపలచని, అయిదడుగుల నాలుగు అంగుళాల ఆఫ్రికన్ జాతివాడు లాగూ పైకి లాక్కుంటూ కనిపించాడు. వయస్సు ఇరవై అయిదు ముప్పై మధ్య ఉంటుంది.

"ఏం చేస్తున్నావిక్కడ?" కృష్ణ గట్టిగా అడిగాడు.

"ఏం చేస్తున్నాను మాన్! ఏం చెయ్యడం లేదు!"

"ఇంగ్లీషు లేడీని ఏం చేశావ్?"

"ఏం చేస్తాను... ఏమీ చెయ్యలేదు! వెళ్లిపోయింది"

"పో ఇక్కణ్ణుంచి! మళ్లీ ఈ చుట్టుపట్ల కనిపిస్తే తంతాను" కృష్ణ తెలుగు ఆవేశం చూపించాడు.





**అక్కలతకు**

అబ్బా, ఎన్నాళ్ళకీ అవకాశం వచ్చింది. ఈ రోజు పూర్ణమి. వెన్నెల ఎంతబాగుంది. నీకీలేఖ వ్రాయడానికి ఎన్నాళ్ళనుంచో ప్రయత్నం. వారానికి ఏవో కొన్ని గంటలు ఆటవిడుపు. ఆ కొద్దికాలం ఏదో కాలక్షేపం. ఆనందం, సరదా అంటే ఏమిటో ఎప్పుడో మర్చిపోయాం. ఎప్పుడూ ఏదో ఒకటి కంఠతాపట్టడం, వ్రాయటం, లేకపోతే తిట్లు, జరిమానాలు, బెదిరింపులు, అమ్మానాన్న ఏమనుకుంటారోనని భయం. ప్రతిక్షణం భయంతో, బరువుతో కాలం గడిచిపోతోంది. ఇదంతా క్రమశిక్షణ అనే పేరుతో చలామణి అవుతోంది. వ్యక్తి వికాసానికిగాని, సృజనాత్మకతను పెంపు చేసేదిగాని, మాశక్తిసామర్థ్యాలను పెంపొందించేదికాదు. **M.P., Bi.P** గ్రూపులని, ప్రతివారు ఇంజినీరో, డాక్టరో కావాలనే పగటికల వల్ల కొని తెచ్చుకున్న బాధ. ఇంజినీర్లు, డాక్టర్లు గాక వేరుగా బ్రతకలేమా? నాకనిపిస్తోంది, డాక్టర్లు, ఇంజినీర్లు, పోలీసులు లేని ప్రపంచం ఎంత అందంగా, ఆరోగ్యంగా, ఆనందంగా ఉంటుందో ఒకసారి ఊహించుకో.

తెలవారుతోందంటే భయం. మాస్టారొస్తారు, ఏవో బోర్డు మీద వ్రాస్తుంటారు. ఏ సబ్జెక్టులో ఎందుకవసరమో, ఎందుకుపయోగపడుతుందో నిజజీవితంలో దాని అవసరమేమిటో, చెప్పేవారికిగాని, వినేవారికిగాని తెలియదు. ఎవరూ, ఎవరిని అడిగే ప్రశ్న లేదు. ఇదీ మాకు నేర్పుతున్న శాస్త్ర విజ్ఞానం. యవ్వనంలో రెండేండ్ల ఈరకమైన జైళ్ళలో గడిపిన తరువాత మా మనస్తత్వం ఎలా మారుతుందో, మేము ఏ పోటీలో నెగ్గుతామో ఊహించండి. అందుకే చదువంటే విరక్తి, వినుగు ఏర్పడుతున్నాయి. మొన్న సెలవులకు మన ఊరొచ్చినప్పుడు శరత్ కలిసాడు. వాడెంత ఉత్సాహంగా ఉన్నాడో గమనించారుగా, ఏవేవో కోర్సుల గురించి చెప్తుంటే ఆశ్చర్యం వేసింది. వాడి విద్యాలయానికి, మా దానికి ఎంత తేడా ఉందో గమనించగలను. వాడిలాగా నేనూ గుంటూరు బ్రాడీపేటలో గల రవికళాశాలలో చేరివుంటే ఎంత బాగుండేది? విద్యాలయాలు అందరూ నడపవచ్చుగాని, నడిపే వ్యక్తి యొక్క లక్ష్యాలు, ఆశయాలు ముఖ్యం. 34 సంవత్సరాలచరిత్ర గల ఆ కళాశాల సాధించిన విజయాలు వింటుంటే ఎంతో ఆనందం వేసింది. దానిక్కారణం, మనస్తత్వవేత్త అయిన సి.వి.ఎన్. ధన్ డైరక్టరట. అలా ఉండాలి రెసిడెన్షియల్ కాలేజి అంటే అనిపించింది. చాలా పొద్దుపోయింది. అమ్మకు, నాన్నకు నమస్కారములని చెప్పు. సదా నీ ప్రేమానురాగాలు కోరుకునే

నీ తమ్ముడు

సత్యం

ADVT

మిగతా ముగ్గురు కృష్ణని తగ్గమని సూచించారు. శర్మ హిందీలో చెప్పాడు. "ఆఫ్రికన్లతో ఇండియన్ నేషనల్స్ దెబ్బలాడి గెలవటం కష్టం. పోలీసువాళ్ళంతా వాళ్లవేపే. జాగ్రత్త!"

కృష్ణకి కోపం తగ్గలేదు. వాడిని అలాగే వదిలివేస్తే రేపు శ్యామలని పట్టుకొంటాడు. ముసలి ఆవిడే అయినా ఇంగ్లీషుది కనక వాడి ధాటికి నిలబడింది. శ్యామలకి మెంటల్ షాకై పోతుంది.

ఆ నీగ్రో గ్రహించాడు కృష్ణని అందరు తనతో దెబ్బలాడవద్దని చెప్తున్నారని.

"మీరంతా మాదేశం వచ్చి మామీద జులుం చెయ్యాలని చూడకండి. ఈ దేశం మా పూర్వీకులు రక్తం ధారపోసి, మీలాంటివాళ్లు వచ్చి సుఖపడే స్థితికి తెచ్చారు. మీలాంటి ఇండియన్స్‌ని ఏం చెయ్యాలో నాకు బాగా తెలుసు" అని బెదిరించాడు.

"ఈ దేశం నీ తాతగారి సొమ్ము" అంటూ కృష్ణ వాడిమీద చెయ్యి వేసి తోశాడు.

ఎంతైనా ఇండియన్సు నలుగురున్నారనుకొని అతను వెళ్లిపోయాడు. అందరు మళ్లీ కృష్ణ ఫ్లాట్‌కి చేరుకొన్నారు. అప్పటికి ఆ ఆగంతకురాలు టీ తాగి సేదతీరింది.

"మిమ్మల్ని ఇంటిదగ్గర దింపుతాను" అని కృష్ణ సహాయం చేస్తానన్నాడు.

"అక్కర్లేదు. నా భర్త, కొడుకు వస్తారు. బయట షాపు దగ్గరదాకా తోడు రండి చాలు" అంది.

కృష్ణ వెళ్లి ఆమెను ఫ్లాట్స్ బయట ఉన్న మందుల షాపు దగ్గర దింపాడు.

"ఇంతసేపు ఎక్కడున్నావ్?" అని ఆమె భర్త వచ్చాడు షాపులోంచి-

"గార్డెన్ చూద్దామని ఫ్లాట్స్‌కేసి నడిచాను. ఆ తరువాత వీళ్లింట్లో కూర్చున్నాను... ఇతను నా భర్త. నాకింక ధైర్యమే. మీరింక వెళ్లవచ్చు" అంది.

కృష్ణ ఆమెను భర్త దగ్గర వదిలిపెట్టి ఫ్లాట్‌కి వచ్చాడు.





"ఈ దేశంలో మగాళ్లను విడిచిపెట్టి ఒంటరిగా తిరగటం ప్రమాదం" అంది శర్మ భార్య సరళ.

"అంత అధైర్యపడి పిరికిగా ఎలా ఉంటాం?" అంది శ్యామల.

"మేమందుకే తూనావునా షాపులకి కూడా వెళ్లం" అంది పళనిస్వామి భార్య వత్సల.

"మాసిలోన్‌లో ఇటువంటి భయాలు లేవు" అంది జ్ఞానరత్నం భార్య పుష్ప.

"మీరంతగా వాడితో దెబ్బలాట వేసుకోకుండా ఉండాల్సింది!" అన్నాడు శర్మ.

"అంత భయపడటానికి వాడేమన్నా పామా... పగవడ్తాడా?"

"పాములు పగపడ్తాయో లేదోకాని నీగ్రోలని నమ్మటానికి లేదు"

"ఇదే ఫ్లాట్స్‌లో పూర్వం ఉన్న ఇండియన్ ఫామిలీకి ఏమైందో కృష్ణకి తెలుసుండదు" అన్నాడు జ్ఞానరత్నం.

"ఏమైంది?"

"నీగ్రోతో ఎవరితోనో పోట్లాటవేసుకొన్నారు. ఆ సాయంత్రం నలుగురు డ్రాయింగ్ రూమ్‌లోకి దూసుకువచ్చి ఆవిడను ఆయన్ని కదలకుండా అక్కడే బలవంతంగా కూర్చుండబెట్టి జోక్స్ వేస్తూ ఫర్నిచర్ విరగకొట్టి, టి.వి పప్పు చేసి వెళ్లారు" శర్మ చెప్పాడు.

కబుర్లు నీగ్రోల దౌర్జన్యం చుట్టూ తిరిగాయి. నలుపురంగు చెడ్డతనానికి ప్రతీకగా చెప్పుకొన్నారు. శ్యామల నిజానికి నల్లనిదే, పళనిస్వామి, ఆయన భార్య నల్లనివారే. కాని వాళ్లకా సమయంలో ఆ విషయం గుర్తుకు రాలేదు.

"ప్రతీ జాతిలోను, ప్రతీ కులంలోను, ప్రతీ దేశంలోను మంచిచెడు ఉంటుంది. ఏ ఒక్క జాతిని మనం రాక్షసజాతి అని తీర్మానించలేము. రాక్షసుల కథల్లో కూడా మంచి రాక్షసులున్నారు. దేవతల్లో కూడా నీచంగా ప్రవర్తించిన వారున్నారు. ఆఖరికి విష్ణువు కూడా మొగుడిని ఏమీ చెయ్యలేక పెళ్లాన్ని చెడిపాడు" అన్నాడు కృష్ణతో,

మనుషులు తమని తాము ఏదో విధంగా విభజించుకొని చీలిపోయి దెబ్బలాడుకొంటారు. కోడిగుడ్డు ఏటు పగలగొట్టాలన్న విషయం మీద భేదాభిప్రాయలేర్పడటం గురించి గలి

వర్ ట్రావెల్స్‌లో ఉంది. క్రిస్టియన్లు, ముస్లింలు దెబ్బలాడుకొంటారు. క్రిస్టియన్లు క్రిస్టియన్లే దెబ్బలాడుకొంటారు. శైవులు, వైష్ణవులు దెబ్బలాడుకొంటారు. ఒకళ్లనొకళ్లు నాశనం చేసుకొంటారు. కృష్ణకివన్నీ గుర్తుకు వచ్చి మాట్లాడలేదు. అందరూ ఈ కబురు ఆ కబురు చెప్పి వెళ్లిపోయారు.

రాత్రి టి.వి చూసి, భోజనం చేసి పక్క ఎక్కారు కృష్ణ, శ్యామల.

"ఆ ఇంగ్లీషు ముసలావిడ మగవాళ్లంతా వాడిని వెతుక్కుంటూ వెళ్లాక అసలేం జరిగిందో చెప్పింది" అంది శ్యామల.

"అసలేం జరిగిందిట?" అని అడిగాడు కృష్ణ.

"వాడు ఆవిడ చెయ్యి పట్టుకొని ఫ్లాట్స్ చివర వున్న వాటర్ టాంకుల చాటుకి లాక్కు వెళ్లాడట. అక్కడ ఆవిడను పట్టుకొని గట్టిగా స్క్వీజ్ చేశాడుట. ఆపైన లాగూ విప్పుకొన్నాడుట. అంతేగాని రేప్ చెయ్యాలని చూడలేదుట"

"ఎగ్జిబిషనిస్టు అయి ఉంటాడు. వాడిని మేము కేకలు వేశాం. ఆవిడని ఏం జరిగిందని ఏమడుగుతాం అసహ్యంగా- అందుకని అడగలేదు. ఆవిడ అసలే బెదిరిపోయి ఉందికదా!"

"ఆవిడ మొగుడు ఆవిడను పదేపదే వాడు నిన్నేం చేశాడు, ఇంకా ఏం చేశాడని చెలం కథల్లోలాగా అడుగుతాడంటారా?"

"వాళ్ల నీతినియమాలు వేరు, మనవి వేరు శ్యామలా! స్త్రీలను పరపురుషులు ముట్టుకొంటేనే చాలు విడిచిపెట్టేంతగా, "ఇంకా ఏంచేశాడు?" అని వేధించుకొని తినేంతగా స్త్రీల శీలానికి విలువ ఇచ్చే జాతికాదు వాళ్లది. అది కేవలం ఆధ్యాత్మిక దేశం అయిన భారత దేశంలోనే సాధ్యం. మనదేశంలో మా మగాళ్లం, మావంతూ, మీవంతూ కూడా పవిత్రంగా ఉండాల్సిన బాధ్యత మీమీదే ఉంచి నిశ్చింతగా ఉంటున్నాం"

శ్యామలను కృష్ణ దగ్గరగా తీసుకొని "ఇంతకూ వాడు చెయ్యి ఇలా వేసాడంటావా? కాదా! మరైతే ఇలాగా" అంటూ నవ్వాడు.

"బావుంది సరసం! నేను చూసొచ్చానా... అనుభవించానా?" అంది శ్యామల.

"గాడ్ ఫర్‌బిడ్! అటువంటి అనుభవం నీకు వద్దు శ్యామలా"

"విడిచిపెడ్తారా అటువంటి అనుభవం నాకైతే?" శ్యామల ప్రశ్న వేసింది. అందులో అనుమానం ధ్వనించింది.

"నేను సాధారుడుని. నిన్ను విడిచిపెట్టాల్సినంత పని చెయ్యాల్సి వచ్చేందుకు, అంతకు మించిన పెద్ద బాధ్యతలు నాకు లేవు, శ్రీరామ చంద్రుడికున్నట్టుగా"

ఆ మర్నాడు యూనివర్సిటీకి వెళ్తుంటే ఆ నీగ్రో కృష్ణకి కనిపించి నవ్వాడు. "వీడి ధైర్యంమండా!" అనుకొన్నాడు కృష్ణ.

ఆ రోజు కృష్ణకి ఆ క్రితం రోజు జరిగిన సంఘటన గురించి ఆలోచించడానికి మళ్లీ సమయం దొరకలేదు. రాత్రి మళ్లీ ఆ ప్రసక్తి వచ్చింది శ్యామల, కృష్ణ టి.వి చూడటం పూర్తిచేసి మేడమీదకు వెళ్లాక.

శ్యామల చీర తీసేసింది. శ్యామలకి పరికిణి జాకెట్టులతో పడుకునే అలవాటు. ప్రత్యేకించి తను నైటు డ్రెస్సంటూ వేరే ఏమీ వేసుకోదు. కృష్ణ కూడా నైట్ డ్రెస్ వేసుకోడు. పంచ, లాల్చీ రాత్రిళ్లు కట్టుకొంటాడు. పగలు ఆ డ్రెస్ బయట కూడా వేసుకొంటాడు. కనక పంచ, లాల్చీ రాత్రి వేషంగా భావించడు. శ్యామల ఒకసారి పొడుగాటి గౌను రాత్రిళ్ల కోసం కొనుక్కుంటాననంటే, "అందులో సుఖం లేదు. పరికిణీ జాకెట్టులో నా కళ్లకి సెక్సీగా ఉంటావు. పైగా ఈజీలీ ఏక్సెస్‌బుల్ డ్రెస్ ఆ కారణం చేత అవి అతి పీలైన వస్త్రములు" అని నవ్వి కొట్టిపారేశాడు.

ఆ రోజు రాత్రి శ్యామల చీర, జాకెట్టు విప్పి, బ్రా కొక్కాలు సడలించి దాన్ని తొలగించి యథాలాపంగా వెనీషియన్ బ్లైండ్స్ వైపు చూసింది. కిటికీ అవతల ఓ నల్లని ఉంగరాల జుట్టు మనిషి కూర్చుని పళ్లు ఇకిలిస్తూ శ్యామల చేస్తున్న స్ట్రిప్పింగ్ చూస్తున్నాడు.

"కృష్ణా!" అంటూ శ్యామల అరిచింది. కృష్ణ ఏమిటన్నట్టు చూశాడు. శ్యామల చూపించింది. కృష్ణ కోపం కట్టలు తెంచుకొంది.

"గెటాఫ్ ది విండోసిల్ యూ బాస్టర్డ్"



అంటూ అరిచి బాత్రూమ్ నుంచి నేల తుడిచే 'మాప్' కర్ర పుచ్చుకొని వచ్చి వెనీషియన్ బ్లైండ్స్‌లోంచి ఆ నీగ్రోని పొడిచాడు. వాడు పైనుంచి కిందకి దూకి పారిపోయాడు.

ఆ చెక్క వెనీషియన్ బ్లైండ్స్ తాలూకు చెక్కముక్కలు బయటనుంచి తీసేసి మనిషి దూరి లోపలికి వచ్చేలా బిగించిఉన్నాయి. ఆ నీగ్రో అంత పని చేస్తాడేమో అని రాత్రంతా నిద్ర మానుకొని కృష్ణ శ్యామలకి కాపలాకాశాడు.

మర్నాడు శ్యామలకి జాగ్రత్తలు చెప్పి యూనివర్సిటీకి బయల్దేర్తుంటే కృష్ణ కారులో తనూ వస్తానన్నాడు పక్క ఫ్లాట్ నీగ్రో లైన్.

కృష్ణ అతన్ని ఎక్కించుకొని కారు స్టార్ట్ చేశాడు. లైన్ అడిగాడు-

"రాత్రి మీ ఇంట్లోంచి అరుపు వినిపించింది. ఏమిటి?" అని అడిగాడు.

కృష్ణ ఆ క్రితం రాత్రి జరిగింది, ఆదివారం సాయంత్రం జరిగింది చెప్పాడు లైన్‌కి.

"ఓ శామీనా! వాడో పిచ్చివాడు" అన్నాడు లైన్.

కృష్ణకి తమని పియార్కో ఎయిర్‌పోర్ట్ నుంచి ఈ ఫ్లాట్స్‌కి తీసుకువచ్చిన డ్రైవర్ మిసెస్ డేవీస్‌తో ఈ పిచ్చి శామీ గురించి దార్లో అనటం గుర్తుకు వచ్చింది. ఈ పిచ్చివాడు ఈ ఫ్లాట్స్‌కి పాతకాపు అన్నమాట.

"ఏం పిచ్చి ఇది- మదపిచ్చి!" అన్నాడు కృష్ణ.

"అవును. ఈ దీవులలో సిఫిలిస్ ఎక్కువ. అటువంటి తల్లిదండ్రుల సంతానం గుడ్డిగాను, పిచ్చిగాను పుడ్తారు. వీడదేజాతి. మీరు గమనించారో లేదోగాని వంటిమీద పొడలుంటాయి" అన్నాడు లైన్.

"ఏం చేద్దాం?"

"పదండి తూనాపూనా పోలీస్‌స్టేషన్‌లో కంప్లైంట్ చేద్దాం" లైను సూచించాడు.

కృష్ణ కారు అక్కడకు పోనిచ్చాడు. పోలీసులు అంతా విని నవ్వారు.

"వాడిని జైల్లో నుంచి విడిచిపెట్టి మూడురోజులైంది. వెంటనే డాక్టర్ ఫ్లాట్స్‌దగ్గర తన ఎక్టివిటీ మొదలుపెట్టాడన్నమాట. ఎన్నిసార్లు జైల్లో పెట్టాలి? విసుగెత్తి విడిచిపెడ్తాం. వాడు మళ్ళీ మొదటికి వస్తాడు. కొన్నాళ్లు మెంటల్ హాస్పిటల్లో ఉంటాడు. వాళ్లు బాగుపడ్డాడని విడిచిపెడ్తారు. వాడల్లరి చేస్తాడు. మేము అరెస్టు చేస్తాం. రెండుమూడుసార్లు అరెస్టయ్యాక "వీణ్ణి పరీక్షించమని జడ్జి మళ్లీ డాక్టర్లకు చెప్తాడు. వాళ్లు మళ్లీ కొన్నాళ్లు ఎసైలమ్‌లో ఉంచుతారు. కథ రిపీట్ అవుతూ ఉంటుంది. ఐ సే సమ్‌తిన్ మాన్! గో అండ్ టెల్ హిజ్ అంకుల్"

అని పోలీస్ స్టేషన్‌లో శామీ మేనమామ చిరునామా ఇచ్చారు. లైన్, కృష్ణ ఆ సంగతి తేల్చుకొంటేగాని విశ్రాంతి తీసుకోదలుచుకోలేదు. ఆ చిరునామా ప్రకారం వెళ్లి శామి మేనమామని కలుసుకొన్నారు. యాభై ఏళ్లున్నాయి అతనికి. పాంటు బనియన్ వేసుకొన్నాడు, టోపీ పెట్టుకొన్నాడు, పాతకాలపు వాసనలు, పెద్దమనిషి తరహా ఉన్నాయి. చూడటానికి దైవభీతి ఉన్నవాడిలా కనిపించాడు.

"సారి మాన్! ఐ అపాలొజైజ్. వాడికి నట్స్ లూజ్- ఏం చేయను. రోజులో చాలాసేపు ఇంట్లోనే కట్టడిలో పెడ్తాను. ఎప్పుడో తప్పించుకుపోతాడు. మై సిస్టర్ నాట్ మేరిడ్. వాడి తండ్రి ఎవరో వెధవ. జబ్బులంటించాడు. నా చెల్లెలు వీడికి అయిదు సంవత్సరాలు వచ్చేసరికి జబ్బుతో చచ్చిపోయింది. ఉయ్ ఆర్ పేయింగ్ ఫర్ ఆవర్‌సిన్స్" అన్నాడు.

కృష్ణ ప్రతీవాళ్లు వాళ్ల పాపఫలం అనుభవించటం గురించి ఆ తరువాత ఆ దీవిలో చాలాసార్లు విన్నాడు. లైన్ కృష్ణ ముఖాముఖాలు చూసుకొని ఏం చెయ్యాలో తెలియక బయల్దేరారు.

"ఐ విల్ టెల్ హిమ్ నాట్టూ గోటు డాక్టర్ ఫ్లాట్స్" అని ఆ మేనమామ ధైర్యం ఇచ్చాడు. "థాంక్స్" అన్నాడు లైన్.

మళ్లీ శామి దర్శనం ఆ చుట్టుపట్ల అవలేదు. శుక్రవారం రాత్రి లైన్ కృష్ణని, శ్యామలని భోజనాలు అయ్యాక తనింటికి పిలిచాడు. చివరింటి పెళ్లి కాని క్రిస్టీ కొడుకుతో వచ్చింది. క్రిస్టీ సెక్స్యువల్ పార్ట్‌నర్ జాన్ వచ్చాడు. అందరు కూర్చున్నాక లైన్ రమ్ అండ్ కోకకోలా తెచ్చాడు.




"దీన్ని పంచ్‌యాన్ రమ్ అంటారు. 98 శాతం శుద్ధపరచబడింది"

"98 శాతానికి అర్థం?" కృష్ణకి తెలియక అడిగాడు.

"బీర్‌లో 5-10 శాతం వైన్స్‌లో 30 శాతం విస్కీలో నలభైశాతం ఉండే ఆల్కహాల్ ఇందులో 98 శాతం ఉంటుంది. ఇది నీళ్ళు, అయిస్ కోక్ కలపకుండా తాగితే మీ శివుడు మింగిన గరళంలాగా గొంతుని కాల్చేస్తుంది" అన్నాడు జాన్.

"మీకు మా కథలు బాగానే తెలుసునే!"

"మీ అద్వైత వేదాంతం నాకు చాలా ఇష్టం! కొంచెం చదివాను"

శ్యామల అతనికేసి ఆశ్చర్యంగా చూసింది. తాము అద్వైతులే. అయినా తనకి దాని గురించి ఏమీ తెలియదు. పదివేలమైళ్ల దూరంలో, వివాహంతో ప్రసక్తి లేకుండా ఓ స్త్రీతో నిర్లజ్జగా పక్కపంచుకొని పిల్లవాడిని కన్న దుర్నీతిపరుడికి అద్వైతం గురించి తెలుసునా!

"వాట్ విల్ లేడీస్ హావ్?" లైన్ ఇంటి యజమానిగా మర్యాద చేస్తూ అడిగాడు.

"బోలెడు కోక్, గిద్దెడు రమ్" అంది క్రిస్టీ. శ్యామల తనకి కూడా అంతేనంది. వాళ్లకి ఆ విధంగా కలిపి ఇచ్చి మగవారికి ఘాటుగా కలిపాడు.

చేతిలో గ్లాసులు పుచ్చుకొని వేదాంత చర్చలో పడ్డారు.

"మీరు అద్వైతులు కదా! మీది జ్ఞానమార్గం అయిఉండగా మీలో చాలామంది పూజలు పునస్కారాలు ఎందుకు చేస్తారు"

జాన్ అడిగిన ప్రశ్నకి కృష్ణకి ఏం సమాధానం చెప్పాలో తెలియదు.

"మాయ ఉల్లిపాయ పొరల్లాగా ఆవరించుకొని ఉంటుంది. ఒక్కొక్క పొరే తొలగించుకొంటూ పోతే ఆత్మజ్ఞానం కలుగుతుంది. మాయా ఛేదనానికి భక్తి మొదటిమెట్టు అయితే ఛాలామంది అక్కడే ఆగిపోతారు. అయినా నేను ఏదో పుట్టుక చేత హిందువుని, అద్వైతిని. కాని ఆలోచించి ఏర్పరచుకొన్న మార్గం కాదు కదా! నాకు అంతగా తెలియదు" అన్నాడు ఆఖరికి.

తరువాత హరేరామ హరేకృష్ణవారి భక్తిమార్గం గురించి అడిగాడు జాన్. తాగుతున్నా మాట తూలడం లేదు.

"ఇండియాలో అది అంత పాప్యులర్ కాదు"

"ఇక్కడ సెంటాగస్టేషన్‌లో వాళ్ల ఆశ్రమం ఉంది... వెళ్లారా?"

"లేదు"

"సాయిబాబా గురించి మీ అభిప్రాయం ఏమిటి?"

"చాలా మహిమగల వ్యక్తి అని చెప్తారు"

"మీరు వెళ్లి చూడలేదా?"

"లేదు. నెహ్రూని చూడలేదు. ఇందిరా గాంధీని చూడలేదు. సాయిబాబాని చూడలేదు. ఇండియా చాలా పెద్ద దేశం- ఎందరో మహానుభావులు, అందరినీ చూడటం పడదు"

"జాన్ తెలుసుకోదలుచుకొన్నది ఏమిటంటే సాయిబాబా గురించి నీ అభిప్రాయం! అందరు అనుకొనేది కాదు" లైన్ వివరించాడు.

"ఏం చెప్పను!... సాయిబాబా ప్రసక్తి లేకుండా ఇండియాలో నా జీవితం హాయిగా గడిచిపోయింది. సమస్యలున్న వారు వెళ్తారుట. నాకు లేవు, నేను వెళ్లలేదు. జ్ఞానార్జన కోసం వెళ్లవచ్చు. కాని ముందర నాకు ఆసక్తి ఉండాలికదా! పైగా కొంచెం అయినా చదువుకొని, సందేహాలు కలిగితే మనకంటే బాగా తెలిసినవారినడిగి తెలుసుకోవచ్చు. నాకు సందేహాలు రావు"

"నీకు పెద్దగా నమ్మకం లేదని అర్థమౌతోంది" అన్నాడు జాన్.

"నేను వేర్వేరు మఠాధిపతులైన శంకరాచార్యుల్నీ చూడలేదు. బాబాల్ని చూడలేదు. నాకు సమస్యలు లేవు. ఉన్నా వారు ఉపశమనం కలిగించగలరే కాని తొలగించగలరని, దేవుడు ఆ అధికారం వాళ్లకిచ్చాడని నమ్మను.

నా కర్మననుసరించి మాత్రమే నేను సుఖశాంతుల్ని అనుభవిస్తానని అనుకొంటాను" కృష్ణ సాయిబాబా విషయం తప్పుదాటువేశాడు.

"మీకు కర్మ సిద్ధాంతంమీద నమ్మకం



ఉందా?'' జాన్ ఆసక్తితో అడిగాడు.

''కర్మ ఒక మోడల్, నేను మీతో మంచిగా ఉంటే మీరు నాతో మంచిగా ఉంటారు లేకపోతే ఉండరు. అంటే నేను చేసే వనులనుబట్టీ ఫలితం ఉంటుంది. ఆ ఫలితం నేను అనుభవిస్తూనే ఉంటాను, నిత్యం. శామీ చేసే వనులకి ఎప్పుడో తన్నులుతింటాడు!''

''కర్మ అనేది లేకపోతే శామిపిచ్చివాడుగా ఎందుకు పుట్టాలి?'' జాన్ అందరూ అడిగే



"నువ్వు మిగిలిన ఇండియన్స్‌లాగా మీ దేశం గురించి మతం గురించి, మనమ్యల, గురించి గొప్పలు చెప్తావనుకొన్నాను" అన్నాడు జాన్ నవ్వుతూ.

"బహుశా అలా చెప్పటానికి చాలా విజ్ఞానం కావాలనుకొంటాను- నాకులేదది"

లైన్‌లేచి మరో రౌండ్ డ్రింక్స్ ఇచ్చాడు కర్రపెండలంతో చేసిన చిప్స్ ఇచ్చాడు. క్రిస్టీ కొడుకునిద్దరపోయాడు. లైన్ మ్యూజిక్‌పెట్టాడు.

లైన్, క్రిస్టీ డాన్స్ మొదలుపెట్టారు.

"మేము వెళ్తాం" అని లేచాడు కృష్ణ.

"నేను మీ ఆవిడతో డాన్సు చేయనా అని అడుగుదామనుకొంటుంటే!" అన్నాడు జాన్.

"నాకు డాన్స్ రాదు" అంది శ్యామల.

"పోనీ కృష్ణ క్రిస్టీతో చెయ్యవచ్చు"

"దట్ విల్ బి వండర్ ఫుల్ కాని నాకు రాదు- ఏమి అనుకోకండి" అంటూ కృష్ణ క్షమాపణలు చెప్పుకొన్నాడు.

సెలవు తీసుకొని కృష్ణ, శ్యామల ఇంటికి చేరారు.

శనివారం సాయంత్రం క్రిస్టీ ఫ్లాట్ దగ్గర గొడవ జరుగుతుంటే ముందర సభ్యతకాదని ఊరుకొన్నా అక్కడ లైన్ గొంతుక కూడా వినబడటంతో కృష్ణ, శ్యామల వెళ్లారు.

ప్రశ్న అడిగాడు. అందరికి కలిగే సందేహమే అది.

"నేను ముందరే చెప్పినట్టు అది ఒక మోడల్. శామిపిచ్చివాడుగా ఎందుకు పుట్టాడో మనకి తెలియదనుకొందాం. అప్పుడు కర్మ కారణం అని చెప్తే ఈ ప్రశ్నకి సమాధానం వచ్చినట్టే. పిచ్చిగురించి సందేహం తీరినా కర్మగురించి కొత్త సందేహాలు కలుగుతాయి. కర్మని వివరించటం కష్టం. కర్మకి 'ఆది' ఏమిటి? నాకు తెలియదు. నేను ఆలోచించను"

"పిల్లవాడి బట్టలు ఆరవేసినవి తెద్దామని ఇక్కడికి వచ్చాను. ఆ పిచ్చి శామీ నన్ను ఎటాక్ చేశాడు. అరుస్తుంటే గొంతుకు నొక్కబోయాడు" అని చెప్పింది క్రిస్టీ.

"ఏం జరిగింది తరువాత?" శ్యామల అడిగింది

"జాన్ నాగొంతుకు వినివచ్చాడు. శామీప ట్టు తప్పించాడు. ఇంతలో మా ఇంట్లో టీ తాగుతున్న లైన్ జాన్‌కి సహాయంగా వచ్చాడు. ఇద్దరు కలిసి శామీకి బాగా తగల్నిచ్చారు. ఇంక ఈ చుట్టుపట్లకిరాడు" అంది సంతోషంగా క్రిస్టీ.

"ఈ శామీ ఎప్పుడూ ఈ ఫ్లాట్స్ చుట్టూనే తిరుగుతూ ఉంటాడా? ఇంకెక్కడా ఆడవాళ్లని ఎటాక్ చెయ్యడా?" శ్యామలకి ఆ శామీ కార్యకలాపాలు ఈ ఫ్లాట్స్‌కే పరిమితం అయితే ఇక్కడ నుంచి వెంటనే ఇల్లు ఖాళీ చేసి వెళ్లిపోవాలనిపించింది.

"హినోస్- ఇక్కడ యూనివర్సిటీలో చేరడానికి కొత్తగా వచ్చినవాళ్లు దిగుతారని వాళ్లకి తనని తన్నే ధైర్యం ఉండదని తెలుసును. ఇంతకుముందున్న భారతీయ కుటుంబాలు వాడి నమ్మకాన్ని వమ్ము చేయలేదు" లైన్ భారతీయుల పిరికితనాన్ని ఎత్తిచూపుతూ అన్నాడు.

"అప్పుడు మీరు లేరా?" కృష్ణ అడిగాడు.

"ఉన్నాం- మాతో స్నేహంగా ఉన్న మొదటి భారతీయ కుటుంబం మీదే. మీ దేశస్తులకి కూడా కలర్ కాంప్లెక్స్ చాలానే ఉంది" క్రిస్టీ అన్నమాటలు శ్యామలకి, కృష్ణకి చురుకుగా తగిలాయి.

నిజానికి ఇండియన్లెవరూ తెల్లవాళ్లతో స్నేహం చెయ్యడానికి ముందుకు వెళ్లినట్టుగా నల్లవారితో స్నేహం చెయ్యడానికి వెళ్లరు. పైగా భయపడ్తారు. తప్పించుకు తిరుగుతారు.

"ఇంతకుముందున్న భారతీయులు శామికి రెండు తగలనిచ్చినా, కనీసం మమ్మల్ని పిలిచి మాచేత తన్నించినా వాడి ఆగడాలు ఇంత శృతిమించేవికావు. ఒకసారి ఒక ఇండియన్ లేడీ మీద శామీ చేతులు వేస్తుండగా నేను చూసి సహాయం చేద్దామని వెళ్లాను. శామీ పారిపోయాడు. కాని అతను చేసిన దానికంటే అది నేను చూశానన్న విషయం వాళ్లని ఎక్కువ బాధపెట్టింది. ఏమీ జరగలేదని నన్ను నమ్మించడానికి ఎక్కువ ప్రయత్నంచేశారు. అందుకనే నీ విషయంలో నువ్వు చెప్పే దాకా నేను సహాయం అందించడానికి ముందుకు రాలేదు" అన్నాడు లైను.

"నేనిక్కడ ఉండను బాబు" అంది శ్యామల.

డాప్ స్ట్రీట్‌లోని ఇళ్లల్లోకి మారిపోండి. అవి యూనివర్సిటీ క్వార్టర్స్. అక్కడికి శామి రాడు. అదో చిన్న ఇండియన్ కాలనీ" అని సలహా ఇచ్చాడు లైన్.

ఆ రాత్రి శ్యామల, "మనం డాప్ స్ట్రీట్‌లోని క్వార్టర్స్‌లోకి మారిపోదాం. నేనీ నీగ్రో గొడవతో ఇక్కడ ఉండలేను" అంది కృష్ణతో.

"వీళ్లంతా ఉండటంలేదా?"

"వాళ్లకేం! ఆ పిచ్చివాడికి, ఈ మొండి వెధవలకి సరిపోతుంది"

"క్రిస్టీ ఒక్కత్తే ఉండటంలేదా?"

"అందుకనే అసలు వద్దంటున్నాను. నిన్న దాని డాన్సు చూసినప్పటి నుంచి మీకు ఇక్కడ్నుంచి మారాలని అనిపించదని అనుకొంటూనే ఉన్నాను"

శ్యామల ప్రయోగించిన అస్త్రానికి కృష్ణ చిత్తుగా ఓడిపోయాడు.

"అలాగే మారదాం" అన్నాడు.



కృష్ణ శ్యామల కొత్తఇంట్లోకి మారారు. చుట్టూ ఇండియన్‌లు ఉన్నారు. శ్యామలకి బావుంది. ఒకపక్కనున్న ఇంట్లోకి శర్మ, సరళ

వాళ్లు వీళ్లతోపాటే మారారు. కుమార్‌వాళ్లు రెండిళ్ల అవతల ఉన్నారు. ఒకవైపు క్రిస్ చంద్రూ అతనిభార్య సీత ఉన్నారు. వాళ్లు స్థానికులు, భారతీయులుగారు, భారతజాతీయులు. ఇంకో ఇంట్లో శ్యామ్‌భట్ కుటుంబం ఉన్నారు. శ్యామ్‌భట్ భారతదేశంనుంచి వచ్చి ట్రినిడాడ్‌లో స్థిరపడ్డారు. ఎదురుఇళ్లలో హుస్సేనీ అతనిభార్య పర్వీన్, కూతురు షరీన్ వాళ్లున్నారు. అంతా చిన్నసైజు ఇండియాలా ఉంది.

ఇల్లుమారగానే నారాయణ, జార్జి, లత వచ్చి పలుకరించివెళ్లారు.

క్రిస్ చంద్రూ, సీత ఒకరాత్రి శ్యామలని కృష్ణని భోజనానికి పిలిచారు.

కబుర్లలో సీత బార్బడోస్‌కి చెందిన అమ్మాయని, ఆమె తండ్రికి బట్టలషాపులున్నాయని తన తల్లిదండ్రులు రైతులని చెప్పాడు క్రిస్.

సీత, "మీరిక్కడ ఎన్ని సంవత్సరాలుంటారు?" అని అడిగింది.

"అంటే?" శ్యామల కర్థంకాలేదు.

"పర్మనెంటుగా ఉండటానికి వచ్చారా? అని అడుగుతున్నాను" అంది సీత. సీత అందమైంది. అందుకని శ్యామల ఆప్రశ్నను అపార్థం చేసుకోక,

"ఒక కాంట్రాక్టు పీరియడ్ ఉంటాం" అని చెప్పింది.

"ఇక్కడ బీచెస్ చాలా బాగుంటాయి. వెళ్లి చూడండి. టుబాగోదగ్గరున్న బోకోరీస్ చాలా అందమైంది. అదీ ఇక్కడిదగ్గరలో కేవ్స్ ఉన్నాయి. వాటిలో ఆయిల్‌బర్డ్స్ ఉంటాయి. కొండలమీద చర్చిలు, కోటలు ఉన్నాయి. వెళ్లే లోపల ఇవన్నీ చూడండి" అని క్రిస్ చెప్పాడు.

"చూస్తాం"

"మేము మా సెబాటికల్, క్రితంసారి బెంగుళూరులో గడిపాం. మాకు ఇండియా నచ్చింది" అంది సీత.

"మీరూట్స్ అక్కడేకదా ఉన్నాయి!" అంది శ్యామల.

కాస్సేపు సంభాషణ రూట్స్‌మీద జరిగింది. భోజనం అంతా ఇండియన్ భోజనం వడ్డించింది సీత వంటమనిషనిపెట్టి. తృప్తిగా తిన్నారు శ్యామల, కృష్ణ. ఏవిఎక్కడ దొరుకుతాయో చెప్పారు. "మీకు ఏమన్నా కావాలంటే మమ్మల్నిఅడగండి. మాకు చేతనైన సహాయం చేస్తాం" అని చెప్పారు. కృష్ణ, శ్యామల సెలవు తీసుకున్నారు.

"చాలా కల్చర్డ్ ఫామిలీలా ఉన్నారు" అంది శ్యామల.

"అవును"

"ఇక్కడికి వచ్చినా వీళ్లకి మనసంస్కృతి దానివాసనలు పోలేదు. నీగ్రోలదగ్గర ఇల్లాంటి కల్చర్ ఎక్స్‌పెక్ట్ చెయ్యలేము"

"మనం కల్చర్డ్ నీగ్రోలని పెద్దగా కలవలేదు. లైన్‌క్రిస్టీ. ఆమె మగస్నేహితుడు, కల్చర్ ఉన్నవాళ్లుకారా వారి జీవనవిధానం తేడాగా ఉన్నా!" అన్నాడు కృష్ణ.

శ్యామల వాదించలేదు. కాని భారతీయులంత గొప్పవాళ్లు ఆఫ్రికన్లుకారన్న అభిప్రాయాన్ని ఆమె విడిచిపెట్టలేదు.

* * *

వచ్చి ఆరునెల్లయింది, నవంబర్ నడుస్తోంది. తెలుగు మాట్లాడటానికి నారాయణతప్ప మరెవరూ లేరు. శ్యామలకి విసుగు కలుగుతోంది. ప్రతీ శని ఆదివారాల్లోను బీచ్‌లకి వెళ్తున్నారు. శ్యామలకి, తనకి సంవత్సరానికి ఫామిలీ స్విమ్మింగ్‌పూల్ పాస్ తీసుకున్నాడు ముప్పైడాలర్లుపెట్టి. పనిదినాల్లో స్విమ్మింగ్‌పూల్‌కి వెళ్తున్నారు. మొదట్లో సిగ్గుపడినా శ్యామల నెమ్మదిగా ఈతదుస్తులు వేసుకోడానికి అలవాటుపడింది. ఈతనేర్చుకొంది. ఈతతో విసుగును దూరంగా నెట్టగలిగింది. మిగిలిన భారతీయులలో కొందరు మగవాళ్లు ఎప్పుడైనా ఈతకి వచ్చేవారు. వారి స్త్రీలు వచ్చేవారు కారు. ఆడవాళ్లు "ఏమోబాబు! మగవాళ్ల మధ్య గుడ్డలు విప్పుకొని తిరగాలంటే మాకుసిగ్గు" అన్నధోరణిలో శ్యామలతో మాట్లాడేవారు. శ్యామలకి తెలిసిన భారతీయ పురుషులున్నప్పుడు ఈదటంకంటే ఈ మాటలు ఎక్కువ ఇబ్బంది పెట్టసాగాయి.

"ఏమండి. చూశారా! ఆకుమార్ భార్య చంచల్! తనేమో ఇంట్లోను, పెరట్లోను ఎప్పుడూ చీరకట్టుకోకుండా పరికిణీజాకెట్టులతో

తిరుగుతూ ఉంటుంది. అల్లా ఉన్నప్పుడు మిమ్మల్ని పలకరించడానికికూడా సిగ్గుపడదు''

''నార్త్‌లో చీరలేకుండా లంగా, జాకెట్టులో తిరగటం తప్పనిపించుకోదు''

''స్విమ్మింగ్‌పూల్ దగ్గర స్విమ్మింగ్‌డ్రెస్‌లో తిరగటంకూడా అనిపించుకోదు కదా అయితే!''

శ్యామల ఆలోచనాధోరణి కొంచెం మారింది. కానీ లండన్ రైళ్లలో యువజంటల్లాగా ప్రవర్తించగలిగినంతకాకపోయినా ''నిజమే శ్యామలా! కాని మనలో ఇతర్లగురించి ఆలోచించేటప్పుడు సంస్కారం చూపించేగుణం తక్కువ. మనం ఏంచేస్తే అదే ఘనకార్యం. వాళ్లకికూడా భర్తలతో స్విమ్మింగ్‌కి వెళ్లాలన్న కోర్కె అంతర్గతంగా ఉండి, అది బయటపడక, పడలేక, తమతీరని కోర్కెవల్ల జనించిన అసంతృప్తికి బాహ్యరూపం ఇతర్లను విమర్శించడం అవుతూ ఉంటుంది''

ఒకసారి పళనిబూమి, వత్సలతోకలసి బీచ్‌కి వెళ్లారు. పళనిబూమి మాత్రం నీళ్లలో దిగాడు. వత్సల బయటే ఉండిపోయింది. అందుకని శ్యామల ఆమెకు తోడుగా ఎండలో ఇసుకలో కూర్చుండిపోయింది.

''సముద్రంలో స్నానంచేద్దాం పదండి'' అంది శ్యామల. ''ఛ అసహ్యంగా'' అంది వత్సల.

''మరి మగవాళ్లిద్దరూ చేస్తున్నారుగా!''

''వాళ్లు మగవాళ్లు!''

ప్రపంచంలో ఉన్న సరదాలు, సుఖాలు అన్నీ మగవారికేనా అందులో ఆడవారికి పాలుండదా? స్త్రీలు పాలుపంచుకోకపోయినా కనీసం పంచుకొనే అవకాశంవుండటం ధర్మం అన్న స్పృహకూడా లేకుండా పడివుండటం శ్యామలకి నచ్చలేదు.

ఆ రోజు సాయంత్రం ఇంట్లో శ్యామల ఆ విషయం ఎత్తినప్పుడు,

''ఒక విధంగా వత్సలకంటే నువ్వు భిన్నమైనదానివి కావు. ఓ బహిరంగ స్నానాల విషయంలో సమానతని నువ్వు కోరుకుంటున్నావు. కాని నువ్వే క్రిస్టీ జీవన పద్ధతిని తప్పుపడ్తావు. పెళ్లి ప్రసక్తిలేకుండా సెక్సు సుఖాన్నిపొందే మగవారిని క్షమించినట్టు, ఆడవాళ్లుకూడా అదేవిధంగా సెక్సుసుఖాన్ని పొందటాన్ని నువ్వు క్షమించడంలేదు''

''మీకు ఎలాగైనా క్రిస్టీ నచ్చుతోంది. ఆరోజు ఆమె డాన్సు చూసినప్పటినుంచి అలాంటి స్త్రీలుంటే మీలాంటివారికి లాభం'' అంది కసుభమని.

''యూ ఆర్ ఫీలింగ్ ఇన్‌సెక్యూర్! అందుకని ఆమెపట్ల నీకు కోపం. నువ్వు స్విమ్మింగ్ డ్రెస్‌లో అర్ధనగ్నంగా వాళ్ల భర్తలకంటపడితే వాళ్ల కొంపలు మునుగు తాయేమోనని వాళ్ల భయం''

''వాళ్లని తిరగమంటున్నానుగా!''

''క్రిస్టీ నిన్ను తనలా ఉండద్దు అందా... లేదే! నువ్వు ఉండలేవు. నువ్వు అవతల స్త్రీలాగా ఒక కట్టును తెంచుకోలేని బలహీనత వల్ల... లేక తెంచుకోని ఉత్తమ వ్యక్తిత్వంవల్ల ఏదైతేనేం... నువ్వు అనుసరించే కట్టుబాటుని అవతలి స్త్రీ ఉల్లంఘించినప్పుడు, ఆ ఉల్లంఘనవల్ల ఆమెపట్ల నీ మగాడికి ఆకర్షణ పెరుగుతుందని నువ్వు అనుమానించినప్పుడు, ఈ భయాలు ఆ దెప్పిపొడుపులూ తప్పవు''

ఈ చర్చలవల్ల శ్యామల తన అభిప్రాయం మార్చుకోలేదు. కాని కృష్ణ బీచికి ఇతర ఇండియన్లని తమతో రమ్మని పిలవటం తగ్గించాడు.

నవంబరులో చిరుచలిగా ఉంది. కాని చలికాలంలా లేదు. అందుకని బేబీ ఆస్టిన్ కార్లో ద్వీపం అంతా చుట్టపెట్టడానికి వాతావరణం అనువుగా ఉంది. ద్వీపానికి దక్షిణాన ఉన్న మయేరో బీచ్‌కి వెళ్లారు. ఒక ఆదివారం రోడ్డుమీద కారాపుకొని సముద్రం కేసినడిచారు. దార్లో అన్నీ కొబ్బరిచెట్లు. నేలమీద చెట్టునుంచి రాలిన కొబ్బరికాయలు- ఎవరూ తీసుకొనే వాళ్లులేరు. వందల కొద్దీ అలా ఇసుకలో పడివున్నాయి. ఇండియాలో అయితే స్వంతదారుడు అలా వదిలేస్తే మర్నాటికి ఒకటీ మిగలదు అనుకొన్నారు.

బీచంతా కలయజూస్తే ఒక కుటుంబం తప్ప ఎవరూ కనిపించలేదు. వార్తాపత్రికల నిండా బలాత్కారపు వార్తలు చదివిచదివివు




న్న కృష్ణ.

"మనుమలెవరు లేనిచోట వద్దు- నలుగురు వచ్చి నిన్ను ఎత్తుకుపోతే నేను రక్షించలేను. అందుకని ఆ కుటుంబం ఉన్న చోటికి పోదాం" అన్నాడు.

"ఏం మగాళ్ళండీబాబు! ఇన్నాళ్ళకి మీకు కాస్త ఏకాంతంగా నాతో సరిగంగస్నానాలు చేసే అవకాశంవస్తే మనుమలదగ్గరికి పోదాం అంటారు" అంది శ్యామల. శ్యామలకి ఆ నిర్జనప్రదేశంలో భర్తతప్ప ఎవరూ లేనిచోట అతని సహచర్యాన్ని పూర్తిగా అనుభవించాలనే కోర్కె బలంగా కలిగింది.

"సాధారణపు మగవాడిని... ఎన్టీరామారావుని, నాగేశ్వరరావుని కాను. రౌడీలు క్యూలో వచ్చినా ఒకడినికూడా సరిగా తన్నడంరాని పుస్తకాల పురుగుని, మేధావిని. అందుకని నా మాటవిని రా అక్కడికిపోదాం" అన్నాడు కృష్ణ. అతను యధార్థవాది.

"మనం రాకముందు ఆ కుటుంబం ఒకటే ఉందికదా! వాళ్ళకి భయం వేసివుండదా?"

"శ్యామలా... వాళ్ళు నేటివ్స్ అయివుంటారు. వాళ్ళు ప్రమాదాలెటువంటివో, వాటిని తప్పించుకోడం ఎలాగో తెలిసినవాళ్ళు"

"వాళ్ళల్లోనే రౌడీలుంటే నాకు ప్రమాదమేనే!"

"అక్కడున్నవాళ్ళలో స్త్రీలు, పిల్లలున్నారు. స్వజనంలో ఉన్నప్పుడు రౌడీలుకూడా ప్రమాదకారులు కారు"

కృష్ణ చర్చ కొనసాగించకుండా బట్టలనంచీ, తిండినంచీ పుచ్చుకొని అటు నడిచాడు. మనిషి సంఘజీవి. నిర్జన ప్రదేశంలో మరో మనిషికోసం వెతుక్కుంటూ వెళ్ళాడు.

అక్కడ స్నానాలు చేస్తున్న కుటుంబం భారతీయ జాతికి చెందినవారు. శ్యామల చీరకట్టుకోడం చూసి "సీతారామ్" అని అభివాదం చేశారు వాళ్ళిద్దరికి.

నమస్తే అనడానికి బదులుగా "సీతారామ్", "హరేరామ్" అంటూ స్థానికులైన హిందువులు పలకరించడానికి అలవాటు పడివుండటంతో,

"నమస్తే" అని బదులు చెప్పారు.

ఒక యాభైయేళ్ళ ఆయన, ఆయన నలభైనలభైఅయిదేళ్ళ భార్య, ముగ్గురు కూతుళ్ళు, నలుగురు కొడుకులు, ముసలి తల్లి అందరూ ఆప్యాయంగా పలకరించారు.

ఆడపిల్లలకి పధ్నాలుగు నుంచి ఇరవైదాకా వయస్సుంది. పెద్దపిల్లకి పెళ్ళైనట్టుంది. ఓ పసి పిల్లాడు. ఆ పసివాడిని ఆ పిల్ల నాయనమ్మ ఎత్తుకుని ఒడ్డున కూర్చుంది. నలుగురు కొడుకులు కారని పెద్దవాడు అల్లుడని తెలుసుకొన్నారు.

శ్యామల ఇంటిదగ్గరే చీరలోపల స్విమ్మింగ్ డ్రెస్ వేసుకొని రావటంవల్ల అంతమంది ఉన్నా ఇబ్బంది పడకుండా డ్రెస్ మార్చుకొంది. కృష్ణ కూడా పంచవిప్పి ఈతలాగూ కట్టుకొని సముద్రంలోకి నడిచాడు. చల్లని, ఉప్పటి నీటిలో ఓ అరగంటసేపు హాయిగా ఆడుకొన్నాక, ఒడ్డున కూర్చున్నారు శ్యామల, కృష్ణ. తాము తెచ్చుకొన్న తిండి నాలుగు బ్రెడ్డు ముక్కలు. అంతమంది ఉన్నప్పుడు అందరికి పెట్టలేని స్థితి.

ఆ హిందూ కుటుంబం కూడా కాస్సేపు స్నానాలు ఆపి, వీరి పక్కనే కూర్చుని వారిబుట్ట విప్పారు. వారు తెచ్చుకొన్న రొట్టెలు, కూర, పచ్చడి కొద్దిగా తీసి శ్యామలకి, కృష్ణకి పెట్టారు.

"మేమూ తెచ్చుకొన్నాం" అని శ్యామల సాండ్విచెస్ బయటికి తీసింది.

"మీరు తెచ్చుకోలేదనికాదు- మా తిండి రుచి చూడండి" శ్యామల మొహమాటపడింది.

"మేము మహారాజులం. అనుమానించక తినండి. ఇందులో మాంసం ఏమీ లేదు" అన్నాడు ఆ కుంటుంబం పెద్ద.

"మేము బ్రాహ్మలంకాదు. మాకు ఆ పట్టింపులేదు" అని కృష్ణ అవి అందుకొన్నాడు.

"భాబీ... నాకు హిందీ పాటలు వచ్చు" అంది పధ్నాలుగేళ్ళ మిస్ మహారాజ్. శ్యామలకి ఆ పిల్ల తననే భాబీ అంటోందని కొంచెం ఆలస్యంగా అర్థమై ఒక పాటపాడమని కోరింది.

"టు లసి మేరి అంగణ్ కీ", "టేరేబినా" అంటూ ఆపిల్ల రెండు పాటలు పాడింది.

ఉచ్చారణ కొన్నిచోట్ల ఇండియన్ ఉచ్చారణ లాగా, కొన్నిచోట్ల ఇంగ్లీషు వాళ్ళు మాట్లాడిన ప్పుడులాగా 'తులసి'కి 'టులసి' 'తేరే'కి 'టేరే'లాగాను ఉంటే శ్యామలకి నవ్వు వచ్చింది. కాని బయటికి నవ్వలేదు.

"చాలా బాగాపాడావు" అని పొగిడింది మనస్ఫూర్తిగా. అందులో ఆ పిల్ల తనని ఆప్యాయంగా "వదినా" అని పిలవటంతో ఆ దూర దేశంలో అనుకోకుండా లభించిన ఆ ప్యాయతకి మనస్సు పరవశించింది.

ఆ పిల్ల బోలెడు కబుర్లు చెప్పింది. తనకి పెళ్ళి నిశ్చయమైనట్టు చెప్పింది కృష్ణ ఆ పిల్ల వయస్సుకి మాటకి పొంతన దొరకక.

"చిన్నపిల్ల కదా! అప్పుడే పెళ్ళా" అని ఆశ్చర్యంగా అడిగాడు. "చిన్నపిల్లేమిటి! వాళ్ళమ్మకి దీనివయస్సుకి పిల్ల కూడాను" అన్నాడు మహారాజ్.

"వివాహానికి మినిమమ్ ఏజ్ లేదా?" పాశ్చాత్య నాగరకత ప్రతిబింబించే ఈ దీవులలో భారతీయులు బాల్య వివాహాలు చేస్తున్నారంటే కృష్ణకి అంతులేని ఆశ్చర్యం కలిగింది.

"పిల్ల తనంతటతను పెళ్ళిచేసుకోవాలంటే పదహారేళ్ళుండాలి. తల్లి దండ్రులు సంబంధం చూసి చేసే పక్షంలో పద్నాలుగేళ్ళు చాలు. అయినా నా కూతురికి రమారమి పదహారేళ్లు" అన్నాడాయన.

పశ్చిమదీవులకి వచ్చిన భారతీయులంతా పొట్టిగా, పీలగా ఉండే జాతివారని గుర్తుకు వచ్చింది కృష్ణకి. అందుకని ముఖ్యంగా ఆడపిల్లలు ఇరవై ఏళ్ళవాళ్లు కూడా పెద్దగా ఎదగక పదహారేళ్లవాళ్లలా ఉంటారు. కృష్ణ ఏమనలేదు.

వీళ్లంతా శారదా వివాహచట్టం ఇండియాలో రాకపూర్వం ఇండియానుంచి వెళ్ళి, కాలంలో ఘనీభవించినఆనాటి ఆచారాలను పట్టుకు వేళ్లాడుతున్నారు. ముస్లిమ్ దేశాల్లో ముస్లిమ్లంతా ముందడుగు వేస్తుంటే భారతదేశంలో స్థిరపడిన ముస్లిమ్‌లు కాలానుగుణంగా ముందంజ వెయ్యకపోవడం ఇలాంటిదే అనుకొన్నాడు కృష్ణ.

"మీరెప్పుడైనా ధర్మేంద్రని, హేమమాలిని కలుసుకొన్నారా?" ఆ పిల్ల అడిగింది కుతూహలంగా.

"లేదు" శ్యామల చెప్పింది.

"ఎందుకని?"

"వాళ్లు బొంబాయిలో ఉంటారు. మేము వెయ్యి మైళ్ల దూరంలో ఉంటాం".

"మేము శాన్‌ఫెర్నాండాలో ఉంటాం కాని పోర్ట్ ఆఫ్ స్పెయిన్‌లో ఉన్న చాలామంది తెలుసుకదా: మీకు బొంబాయిలో తెలియరా?" ఆ పిల్ల అమాయకంగా అడిగింది.

శాన్‌ఫెర్నాండుకి, పోర్ట్ ఆఫ్ స్పెయిన్‌కి మధ్యదూరం యాభైమైళ్ళని, ట్రినిడాడ్ మొత్తం జనాభా బొంబాయి జనాభాలో ఆరోవంతో, ఇంకా తక్కువో అని చెప్పడానికి శ్యామల ప్రయత్నం చేస్తుంటే, కృష్ణ-

"మేము బొంబాయి వెళ్ళినప్పుడు ఒకటి రెండుసార్లు ఫోన్‌చేస్తే ధరమ్ ఇంట్లో లేడు, హేమ ఊళ్లోలేదు. వాళ్లు మా ఊరు వచ్చినప్పుడు మాకు వేరేపార్టీ ఉండి కలవలేదు" అన్నాడు.

"చాలా ఫ్రెండ్లీట కదా:"

"అవును... ఇంటికి వెళ్తే వాళ్ళింట్లో ఉండమని పట్టుపడ్తారు".

ఆ పిల్ల ఆ సమాధానాలకి సంతోషించింది. ఆ చిన్నదేశంలో టి.వి.స్టార్స్ చాలామందితో ఆ పిల్లకి పరిచయం ఉందని చెప్పింది.

"శాన్ ఫెర్నాండో వస్తే మా యింటికి రండి, మాకు పళ్ల తోటలున్నాయి చూపిస్తాను" అని మహారాజు ఆహ్వానించాడు.

కృష్ణ సరేనన్నాడు.

కృష్ణ, శ్యామల లేచి సెలవు తీసుకొన్నారు. కారువద్దకు వస్తూ దారిలో బీచ్‌లో దొర్లుతున్న కొబ్బరి కాయలు నాలుగు ఏరుకొన్నారు. అవి వలవటానికి చాలా కష్టపడాల్సి వస్తుందని ఆ క్షణంలో వారికి గుర్తుకురాలేదు.

★ ★ ★

రామాయణ యజ్ఞం క్యూరెప్‌జంక్షన్ దగ్గర ఈస్టర్న్ మెయిన్‌రోడ్‌మీద జరుగుతోంది. అదేమిటో చూద్దామని శ్యామల, కృష్ణ వెళ్లారు. అక్కడ బీచ్‌లో కనిపించిన మహారాజ్




కుటుంబం తిరిగి కనిపించింది.

"నెలరోజులపాటు పండిట్‌జీ రామాయణం చదివి పూర్తిచేస్తారు. కథ చాలాబావుంటుంది మీరెప్పుడైనా విన్నారో లేదో!" అన్నాడు మహారాజ్.

రామాయణం కథ భారతీయులు వినకపోవడమా! కృష్ణ జవాబు చెప్పేలోగా-

"వస్తాను" అంటూ మహారాజ్ హడావిడిగా మరొకర్ని కలుసుకోవడానికి వెళ్ళిపోయాడు.

ఆలస్యంగా పండిట్‌జీవచ్చి వేదికనెక్కి దిళ్లనానుకుని కూర్చుని సరళాల్ని పరుషాలుగా పలుకుతూ రామాయణ పఠనం మొదలుపెట్టాడు. ఆకథ చెప్పేవిధానం మన పురాణకాలక్షేపంలాగాను, హరికథా కాలక్షేపంలాను ఉంది. సభలో జనం చిన్మయానంద ఉపన్యాసం వినడానికివచ్చే జనంలా ఉన్నారు.

శ్యామలకి- కృష్ణకి కొంచెంబోర్‌కొట్టి కబుర్లలో పడ్డారు. ముందువరుసలో కూర్చున్న జనం వెనక్కి తిరిగిచూశారు.

"మీరు తెలుగుమాట్లాడుతున్నారా?" అని అడిగాడు ముందున్న ఆయన. నలభై అయిదేళ్లుంటాయి ఆయనకి. ఆ ప్రశ్న ఆయన తెలుగులో అడిగాడు.

"అవును... మీరు తెలుగువాళ్లా?" అని కృష్ణ చాటంతముఖం చేసుకొని అడిగాడు.

"అవును... మాది విశాఖపట్నం" అన్నాడాయన.

"మాది గుంటూరు"

"మీరెక్కడుంటారు?"

"యు.వి. ఇళ్లల్లో డాష్‌స్ట్రీట్‌లో... మీరు?"

"ఎల్‌డురాడోలో. నేను బ్రిస్టోప్లాన్‌లో కన్‌సల్టెంట్‌ని"

"మీకభ్యంతరం లేకపోతే మాఇంటికి రండి. దగ్గరేకదా- చక్కగా తెలుగులో మాట్లాడుకొందాం" అని కృష్ణ ఆహ్వానించాడు.

"పదండి" అని ఆయన లేచాడు. ఆయనతో ఆయన భార్య, కూతురు లేచారు.

కృష్ణ కారు దారితీయగా ఆయనకారు అనుసరించింది.

ఇంటికి చేరుకొని కుర్చీలో కూర్చున్నాక-

"నేను కృష్ణ, ఈమె నాభార్య శ్యామల. నేను యు.వి.లో ఇంజనీరింగ్ ఫాకల్టీలో లెక్చరర్‌గా ఉన్నాను" అన్నాడు.

"నాపేరు నరసింహం. నాభార్య లక్ష్మి, కూతురు వసంత. మేమువచ్చి రెండు సంవత్సరాలైంది. ఆంధ్రా పి.డబ్ల్యు.డి.లో ఉండేవాళ్లం. మీరువచ్చి ఎన్నాళ్లైంది?"

"మేము మేనెలలో వచ్చాం. అంటే ఆర్నెల్లు అయింది. ఇక్కడ ఇంక ఎవరైనా తెలుగువాళ్లున్నారా?"

"బోలెడుమంది. వినుగువచ్చేంతమంది. ఈ అయిలెండులోను చుట్టుపట్ల అయిలెండ్స్‌లోను ఉన్న డాక్టర్లందరూ తెలుగువాళ్లే. ఇండియాలో డాక్టర్లకి ఉద్యోగాలు దొరకటం లేదు కదా. పైగా వీళ్లలో చాలామంది పెద్దపెద్ద డొనేషన్లుకట్టి సీట్లు సంపాదించి చదువుకొన్నారు. ఇక్కడ జీతాలు ఎక్కువకదా! అందుకని మొదట్లో ఎవరో ఏక్సిడెంటల్‌గా వచ్చి ఉంటారు. అక్కణ్ణుంచి ఒకరి తరువాత ఒకరు చీమలబారులా వచ్చారు. ఈ వెస్టిండీస్ అంతావీళ్లే!"

"కలుసుకొంటే బావుండును"

"నేను తీసుకువెళ్లి ఇంటర్‌డ్యూస్ చేస్తాను. లేకపోతే మా ఇంటికి కొంతమందిని భోజనానికి పిలుస్తాను. అప్పుడు మీట్ అవుదురుగాని"

భోజనంప్రసక్తి రాగానే శ్యామల "మీరీపూట మాఇంట్లో భోజనం చెయ్యండి"

"ఎందుకు మీకు శ్రమ? వండుకుని వచ్చాము" అంది లక్ష్మి.

శ్యామల బలవంతంచేయగా వాళ్లు భోజనానికి ఉండిపోయారు.

వసంత ఏమీ మాట్లాడకుండా వింటూ కూర్చుంది.

"మీరు చికెన్ తింటారా?" శ్యామల దొంకతిరుగుడుగా అడిగింది.

"తినం" అంది లక్ష్మి.

"మీరు వెజిటేరియన్సా?" కృష్ణ అడిగాడు.

"అవును"

"బ్రాహ్మిన్సా?"

"అవును"



"ముందరే బ్రాహ్మిన్సా అని అడిగి ఉండా ల్సింది" అంది శ్యామల.

"అదేం లేదండీ! మాకు మాంసం తినటాని కి అభ్యంతరం లేదు. కాని సయించదు. తినం. పోతే ఇక్కడున్న చాలామంది బ్రాహ్మ లు డిప్రిజ్‌ల్లో ప్రొటీన్ ఫుడ్ దాచుకొంటారు"

"దాచుకోవడం ఎందుకు? ధైర్యంగా తినవ చ్చుగదా!" కృష్ణ ఆశ్చర్యంగా అడిగాడు. స్వజ నానికి దూరమైనప్పుడు ఏ పనైనా ధైర్యంగా చేస్తారుకదా! ముస్లిమ్‌లు చుట్టాలకి దూరంగా ఉన్నప్పుడు వాళ్ళ స్త్రీలకి బురఖాలు తీసేస్తా రు. భారతీయ స్త్రీలు స్విమ్మింగ్ ట్రంక్స్ తొడు గుతారు. పురుషులు యధేచ్ఛగా తాగుతారు.

"దీనికి జవాబు చెప్పాలంటే ఇక్కడి పరిస్థి తులగురించి చెప్పాలి ముందు. మీకు ముందో చిన్న సంఘటన చెప్తాను. నాకీ దేశం వచ్చిన కొత్తలో పంచకట్టుకొని వీధిలో తిరిగే అలవాటు బాగా ఉండేది. ఒకరోజు సాయంత్రం తూనా పూనా మార్కెట్‌లో చుట్ట కాలుస్తూ నడుస్తున్నా ను. నాకేసి స్థానిక ఇండియన్లు ఆశ్చర్యంగా చూడటం గమనించాను. కాని నాకర్థం కాలేదు. ఇంతలో ఒక నీగ్రో మీ ప్రీస్టులు చుట్టలు కాలుస్తారే అని ఒక స్థానిక హిందూని వేళా కోళం చేసాడు. ఆ హిందూ ఆ అవమానం భరించలేక నా దగ్గరికివచ్చి 'సీతారామ్' అంటూ నమస్కరించాడు. 'సీతారామ్' అన్నా ను నమస్కారం అందుకొంటూ. 'మీరు బ్రాహ్మ ణులేనా?' అని అడిగాడు. 'అవును' అన్నాను. 'పండిట్జీలా?' అని అడిగాడు 'ఎందుకలా అడుగుతున్నారు?'

"పంచకట్టుకొన్నారు కదా!"

"మహారాజ్‌లు పంచకట్టుకోరా! ఇండియ న్లు కట్టుకోరా"

"ఇక్కడ పండిట్‌జీలు తప్ప కట్టుకోరు"

"నేను పూజారిని కాను"

"అయితే ఇంకెప్పుడూ పంచకట్టుకొని బయటికి రాకండి. వస్తే రోడ్డు మీద సిగార్స్ కాల్చడం, మాంసం తినటం, బీర్ రమ్‌ల లాంటివి తాగడం చెయ్యకండి. డోన్ట్ బ్రింగ్ బాడ్‌నేమ్‌టు అవర్ పండిట్జీస్!" అతని బాధ నాకర్థమైంది. నన్ను శాస్త్రులు అనుకొన్నాడు. ఇక్కడ ఆచార వ్యవహారాలు తెలియక అలా చేశానని క్షమాపణలు చెప్పుకొన్నాను.

ఇక్కడ హిందువులు చాలా తమాషా అయిన జాతి. వీళ్ళు వంద సంవత్సరాల క్రితం వచ్చినప్పుడు కేవలం కూలీలు. తరు వాత భూస్వాములుగా, వ్యాపారస్థులుగా, ఉద్యో గస్తులుగా మారి స్వతంత్ర ట్రినిడాడ్‌లో ఐశ్వర్య వంతులయ్యారు. డబ్బుచేతిలో ఉండగానే డబ్బు ఇచ్చే సుఖాలన్నీ అందుబాటులోకి వచ్చాయి. కాని వాళ్ళకి వంశ ప్రతిష్ఠ అన్నది చెప్పుకోతగ్గది ఏమీ లేదు. కనక దాన్ని కొత్తగా సృష్టించుకోవలసిన అవసరం కలిగింది. దాంతో వాళ్ళలో మహారాజ్‌లమని చెప్పుకొనేవా రిని కొందరిని భారతదేశం పంపించారు. వాళ్ళు కొన్ని వ్రతాలు చేయించడం, పెళ్ళి తతంగం నడపడం, తద్దినాలు పెట్టించడం నేర్చుకొని వచ్చారు. హిందూ వివాహాల్ని చట్టస మ్మతం. చేయించి రిజిస్టర్ చెయ్యటం, శవా లని సైర్లమీదే అయినా తగలెయ్యడానికి అను మతిస్తూ చట్టంచేయించడం సాధించారు. తోటి ఆఫ్రికన్లకంటే, వారి క్రిస్టియానిటీ కంటే, తాము, తమ మతం గొప్పవన్న ప్రచారం మొదలుపెట్టారు. అసలే బలమైన కుటుంబ వ్యవస్థఉన్న భారతీయులు మతపరంగా కూడా బలపడ్డారు. వారి మతానికి అవమానం జరిగేపని వాళ్ళు చెయ్యరు. వాళ్ళ పండిట్జీలు మన పురోహితులు. ఒకటే తేడా. ఇక్కడ పురో హితులు చాలా డబ్బు, అధికారం కలవాళ్ళు. రామాయణం చదువుతున్న ఆయన అది పూర్తయ్యేసరికి ఏ పదివేల డాలర్లో కానుకలరూ పంలో సంపాదిస్తాడు. అతనికి పెద్దగా సంస్కృతం, హిందీ రాకపోవచ్చును. నిజానికి పెద్దగా పండితుడైగూడా ఉండడు. కాని మాంసం తినడు. మద్యం ముట్టడు, పొగ పీల్చడు"

నరసింహం చెప్పినదంతా విని " కాని మన బ్రాహ్మణులు ఇక్కడ బహిరంగంగా మాంసం తినకపోడానికి కారణం చెప్పారుకా దు" అన్నాడు కృష్ణ.

"అదే చెప్పబోతున్నాను. వీళ్లు భారతదే శంనుంచి దిగుమతి చేసుకొన్నది హిందూమ తంకాదు బ్రాహ్మనిజం. ఇక్కడ జందెప్పోగు





ఉండి నాలుగు సంస్కృతపు మాటలు వల్లించగలిగితే జనాన్ని మభ్యపెట్టి డబ్బు సంపాదించవచ్చు. ఇక్కడ ప్రతి హిందువు వ్రతాలు చేస్తాడు. వ్రతం చేసినప్పుడల్లా ఇంటి ముందు ఓ జండా పాతుతాడు. ఎవడింటి ముందు ఎక్కువ జండాలుంటే వాడంత రెలిజియస్. బ్రాహ్మలకి భోజనం పెడ్తే పుణ్యాకార్యంకింద లెక్క. నేను బ్రాహ్మడినని తెలిసి చాలామంది నన్ను పిలిచేవారు మొదట్లో అయితే వారు నమ్మే హిందూమతానికి నేను నమ్మేదానికి చాలా తేడా ఉంది. వాళ్ల ఇండియా 1850 నాటి ఇండియా, మన ఇండియా 1970 ఇండియా. మనం చాలా మారాం. వాళ్లకా మార్పుతో పరిచయంలేదు. వాళ్ల తాతలు చెప్పిన కథల్లోని ఇండియాని, పశ్చిమదీవులని అనుగుణమైన ధోరణిలో పునః సృష్టించెయ్యాలని ప్రయత్నిస్తారు. ఇక్కడి హిందూ మతం క్రిస్టియానిటికీ రియాక్షన్. వాళ్లు నమ్మే వాల్యూస్ మనం నమ్మే వాల్యూస్ వేరు. నేను బ్రాహ్మడిని కనుక అధికుడిని అని అనుకోలేక దూరంగా జరిగాను. బ్రాహ్మణులకున్న లాభాలు పోగొట్టుకోడం ఇష్టంలేనివాళ్లు ఇంట్లో ఒకటి చేస్తూ బయట కుహనా వేదాంతం మాట్లాడ్తూ లాభం పొందుతూ ఉంటారు. శివుడు లేక రుద్రుడు బలి పశువుల రక్తం పులమగా ఎర్రనయ్యాడని, వేదమతంలో బలి (వచ్చి మాంసం) బదులు హోమం అంటే కాల్చి అర్పించటం వచ్చినా మాంసం నైవేద్య యోగ్యమేనని, వెజిటేరియిజంకి బ్రాహ్మణ కులానికి సంబంధం కాలంలో వచ్చిన మార్పులవల్ల జైన, బౌద్ధమతాల ప్రభావాన్ని అరికట్టడానికి వచ్చిందేగాని హిందూమతంలో భాగంకాదని, మన దేశంలోనే చాలామంది అనుకోరు"

"రండి భోజనానికి లెండి" అంది వంట పూర్తిచేసి శ్యామల.

లక్ష్మి, వసంత బల్లమీద అన్నీ అమర్చటంలో సహాయం చేశారు.

"ఏం చదువుతున్నది మీ అమ్మాయి?" అని శ్యామల లక్ష్మిని అడిగింది.

"ఎలెవెల్... సిక్త్స్‌ఫామ్ మొదటి సంవత్సరం"

"అంటే మన ప్రి యూనివర్సిటీ లాంటిది. రెండు సంవత్సరాల కోర్సు. ఓ లెవెల్ లేక ఫిఫ్త్ ఫామ్ అంటే మన టెన్త్ క్లాస్" నరసింహం వివరించాడు.

అంతవరకు వసంత నోరువిప్పకపోవడం గమనించి, "మీ స్కూలు పేరేమిటి?" అని శ్యామల ఆ పిల్లని అడిగింది.

"సెంటాగస్టిన్ గరల్స్ హైస్కూల్" అని పిల్లచెప్పింది.

"మంచి స్కూలేనా... నీకిష్టమేనా?"

"ఊఁ" తలూపింది వసంత.

"నాకు ఉద్యోగం దొరుకుతుందా? ఖాళీలు ఉన్నాయా?"

"ఉండచ్చు. మా ప్రిన్సిపాల్‌ని అడగండి"

"మంచిదేనా?"

"తినబోతూ రుచులడగనేల" అన్నాడు నరసింహం.

"అంటే?" శ్యామలకర్థం కాలేదు.

"మా అయనకి ఆవిడకి పడలేదు అంతే. ఆవిడ మంచిదే. మనదేశంలో ఆడవాళ్లలాగా అంటే కనీసం నాలాగా చప్పుగా ఉండదు. చాలా ఎగ్రెసివ్ మనిషి. మంత్రులతో పరిచయాలున్నాయి. పెళ్లికాలేదు" అంది లక్ష్మి.

"ఆవిడ పేరు"

"ఎలిజా మహేశ్వరి"

"తమాషా పేరు"

"ఆవిడ అమ్మమ్మో ఎవరో మతం పుచ్చుకొంది. అంతవరకు హిందువే. తమాషా మనిషి కూడాను" అన్నాడు నరసింహం.

తనివితీరా కబుర్లు తెలుగులో చెప్పుకొన్నాక నరసింహం కుటుంబం సెలవు తీసుకొని వెళ్లిపోయారు.

సెంటాగస్టీన్ గర్ల్స్ స్కూలు యూనివర్సిటీ పక్కనేకదా కృష్ణతోవెళ్లి ఉద్యోగ విషయం తెలుసుకొనివద్దామని బయల్దేరింది. చీర కట్టుకొని బొట్టుపెట్టుకొంది. మంగళసూత్రాలు తప్ప నగలన్నీ తీసివేసి బాగ్‌లో వడేసుకొంది.

ప్రిన్సిపాల్‌కి నలభై యాభై సంవత్సరాల మధ్య ఉండవచ్చు. జుట్టు కత్తిరించుకొంది. పూర్తిగా దేహాన్ని కప్పే బట్టలు తొడుక్కుని కొన్ని

గౌరవం కలిగించేలా ఉంది.

"మేము ఇండియానుంచి వచ్చాం నా భర్తకి యు.విలో ఉద్యోగం. నేను ఇండియాలో కాలేజీలో ఎ లెవెల్‌కి డిగ్రీ మొదటి సంవత్సరానికి పాఠం చెప్పేదాన్ని. మీ స్కూలు గురించి విని పనిచేయాలన్న ఉత్సాహంతో వచ్చాను" అంది శ్యామల వినయంగా.

ఎలిజా మహేశ్వరి కృష్ణని ఇండియా గురించి యు.వి గురించి. చాలా ప్రశ్నలువేసింది. తన స్కూల్‌లో తను చాలా క్రమశిక్షణ అమలులో పెడ్తానని చెప్పింది. చివరికి "ఇక్కడ ఉద్యోగాలులేవు. లక్ష్మీ హిందూ స్కూలు మీదే! అక్కడ ప్రయత్నించండి" అంది.

దరిదాపుగా అన్ని మాటలు కృష్ణతోనే మాట్లాడింది- శ్యామలకేసి చూడకుండా.

'అమ్మముండా! నీకు మాట్లాడటానికి మగవాళ్ళుతప్ప ఆడవాళ్ళు నచ్చరా! పైగా హిందూస్కూలు మాదా. నువ్వెవ్వత్తివే! నీ అమ్మమ్మ ఎవత్తే?' అని మనసులో శ్యామల తిట్టుకొంది ఆమెను.

కృష్ణ, శ్యామల సెలవు తీసుకొని బయటకివచ్చారు. "ఎలాగో ఈ రోజు ఈపనికి ఖర్చుపెడ్దాం. లక్ష్మీ హిందూ స్కూలు యూనివర్సిటీకి మెయిన్‌గేటుకి దగ్గరేకదా" అని శ్యామలతో అని అటు తీసుకువెళ్లాడు.

అక్కడ ప్రిన్సిపాల్ మర్నాడో ఆ మర్నాడో రమ్మనక మర్యాదగా ఆహ్వానించి కూర్చోబెట్టింది. "మాకు ప్రస్తుతం మీ సబ్జెక్టులో మనుషులున్నారు. మేము ఉద్యోగం ఇచ్చినా మీకు వర్క్ పర్మిట్ ప్రభుత్వం ఇవ్వాలి. మీరు విద్యాశాఖమంత్రి కార్యాలయంవారిని కలుసుకొంటే ఎక్కడైనా ఖాళీలుంటే చెప్తారు. పైగా వాళ్ళు తలుచుకుంటే వర్క్ పర్మిట్ చాలా సులభం" అని వాళ్ల చిరునామా ఇచ్చింది. పోర్ట్ ఆఫ్ స్పెయిన్‌కివాళే వెళ్దాం అని ఇంట్లో శ్యామలను దించి తను మళ్ళీ యు.వికి వెళ్ళిపోయాడు కృష్ణ.

ఆ సాయంత్రం శ్యామలను తీసుకొని కొత్తగా ఏర్పడ్డ తెలుగు స్నేహితులైన నరసింహం ఇంటికి వెళ్లాడు.

"ఏమైంది?" అని అడిగింది లక్ష్మి కాఫీ కలిపిఇచ్చి. శ్యామల జరిగింది చెప్పి "ఆవిడకు ఆడవాళ్లన్నా హిందువులన్నా అయిష్టంలాఉంది" అంది.

"మా ప్రిన్సిక్ ప్రిన్స్ ఛార్మింగ్‌లంటే ఇష్టం" అంది వసంత. వసంత తనంతటతాను మాట్లాడ్తే ఆశ్చర్యంగా చూసింది శ్యామల.

"మా స్కూల్లో పిల్లలు ఆవిడ మగవాళ్లతో స్మార్ట్‌గా మాట్లాడ్తూ [illegible] అన్నట్టు నవ్వుతారు" అంది వసంత మళ్ళీ.

వసంతకి ఉత్సాహం కలిగించే టాపిక్ వాళ్ల ప్రిన్సిపాల్.

'పోర్ట్ ఆఫ్ స్పెయిన్‌కి వెళ్లాలి" అంది శ్యామల. "మనిద్దరం వెళ్దాం" అంది లక్ష్మి.

ఆ మర్నాడు నరసింహం లక్ష్మిని శ్యామల వద్ద దింపి వెళ్ళిపోయాడు. శ్యామల, లక్ష్మి ఈస్టర్న్ మెయిన్‌రోడ్‌మీద నిలబడి పోర్ట్ ఆఫ్ స్పెయిన్ వెళ్తున్న టాక్సీ ఎక్కారు. శ్యామల పక్కన ఒకనల్లటి భీకరాకారుడు కూర్చున్నాడు. ముందుసీట్లో తెల్ల వనిత కూర్చుంది. టాక్సీ డ్రైవర్ నీగ్రో స్త్రీ. ఆ ఆఫ్రికన్ జాతివాడు ఎక్కడమీద పడ్తాడో అన్న భయంతో బిగదీసుకుకూర్చుంది శ్యామల. టాక్సీలోని టేప్ కాలిప్సోలను పాడ్తోంది. ఆ భీకరాకారుడు అవి తన్మయత్వంతో వింటూ కూర్చున్నాడు- తన పక్కనున్నది స్త్రీ అన్న స్పృహలేకుండా పోర్ట్ ఆఫ్ స్పెయిన్‌లో అందరూ దిగిపోయారు. శ్యామల తమిద్దరికి కలిపి మూడు డాలర్లు ఇచ్చింది.

ఎడ్యుకేషనల్ డిపార్ట్‌మెంట్‌వాళ్ల ఆఫీసు వెతుక్కుంటూ వెళ్ళి పట్టుకొన్నారు. అక్కడున్న ఒక స్త్రీ ఉద్యోగాలు చాలా ఉన్నట్టుచెప్పి ఆఫీసర్ని కలుసుకోమని చెప్పింది.

లక్ష్మి, శ్యామల ఆఫీసర్ని చూడటానికి వెళ్లారు. ఆ ఆఫీసరు వీళ్ళు చెప్పినదల్లావిని బయోడేటాలు ఇమ్మన్నాడు. ఇచ్చాక అవి తాపీగా ఫైల్‌చేశాడు.

"మీరు వెస్టిండియన్లు కారు!" అన్నాడు.

"కాము... ఇండియన్లము"

"ఐసీ. మీకు ఉద్యోగం చెయ్యాల్సిన అవసరం ఏముంది?"

"కాలక్షేపం కోసం. చదువు సద్వినియో





గంచేయటంకోసం"

"మీ దేశంలో ఇల్లిటరసీ ఎక్కువకాదా! అక్కడే ఉండిపోయి చదువులేనివాళ్ళకి చెప్ప వచ్చుకదా!"

"భర్తలతో ఈ దేశం వచ్చాం"

"మీ భర్తలకి పెద్ద ఉద్యోగాలేమోకదా!"

"పెద్దవికావు"

"పెద్దవి గాకపోతే మీదేశం వదిలి ఇన్ని మైళ్ళు వచ్చేవారు గాదుకదా!"

పెద్దజీతాల ఉద్యోగాలేనని లక్ష్మి, శ్యామల ఒప్పుకున్నారు.

"కనక మీరు మీ భర్తల జీతాలతో సుఖంగా ఉండండి. బీచిల్లో బాస్క్ అవండి. ఇళ్లల్లో రిలాక్స్ అవండి. నో జాబ్స్ ఫర్‌యు ఎట్ ప్రెజెంట్... ఉంటే మేమే రాస్తాము"

అతని మాటలు గౌరవంగా లేవుకాని ఎక్కడా అవమానించినట్టు అనలేదు. అతనికి భారతీయులపట్ల ద్వేషం ఉందేమో అనుకొన్నారు. లేక కలోనియల్ కాలంలో బ్రిటిష్ ప్రభుత్వాధికారుల భార్యలు బీచిల్లో సూర్యరశ్మిలో దేహాల్ని బ్రౌన్‌చేసుకోవడం మాత్రమే చెయ్యడం చూసి అతనికి ఉన్నతోద్యోగుల భార్యలు ఉద్యోగాలకి ఎగబడరాదన్న అభిప్రాయం ఉండచ్చునేమో! శ్యామల కొంచెం నొచ్చుకుంది.

"ఇక్కడ మనుషులు చెప్పేదేదో కాస్త మోటుగా చెప్పేస్తారు. వెనకాతల అనవ్యాంగా మాట్లాడరు. తెల్లవాళ్ళ అర్థంపర్థంలేని పాలిష్‌డ్ మాటలకంటే ఇది సుఖం. మనం ఎక్కడున్నామో మనకి తెలుస్తుంది" అంది లక్ష్మి.

ఎలాగో పోర్ట్ ఆఫ్ స్పెయిన్‌కివచ్చాం కదా అని ఇద్దరు కృవలాని లాంటి పెద్ద షాపులు చూసుకుంటూ తీరుబడిగా నడిచి టాక్సీ స్టాండ్‌కి నడిచారు. తిరిగివెళ్లటానికి ఫేర్ లక్ష్మి పేచేసింది.

"నాకీదేశంలో ఉద్యోగం వస్తుందనుకోను" అంది శ్యామల నిస్పృహతో.

"యు.విలో బయాలజీ డిపార్ట్‌మెంట్ ఉందికదా ట్రైచేద్దాం" అన్నాడు కృష్ణ.

"అంతవరకు?"

"భర్తడబ్బు ఖర్చుపెడ్తూ జల్సాచెయ్యమని అతను చెప్పాడుగా- అలాచెయ్యి"

"మీ అనుమతుందా?"

"తప్పకుండాను"

"థాంక్స్"

"వెల్‌కమ్"

"భోజనానికి లేవండి"

★ ★ ★

"ఏమండీ... ఎల్లా ఉన్నారు?" అంటూ ఓ బుధవారం నారాయణ వచ్చాడు.

"బహుకాల దర్శనం- రండి" అంటూ ఆహ్వానించింది శ్యామల.

"దీపావళికి ఏం చేస్తున్నారు?"

"ఏం చేద్దాం?"

"వూల్‌వర్త్‌లో స్పార్క్‌లర్స్, క్రాకర్స్ అమ్ముతారు. యూవిలో ఇండియన్స్ దీపాలతో అలంకారాలు చేస్తారు- పాటలుంటాయి"

"అయితే యూ.వి.లో దీపాలు చూసి పాటలు విని ఇంటికి వచ్చి మనం టపాకాయలు కాల్చుకొందాం" అన్నాడు కృష్ణ.

ట్రినిడాడ్‌లో దీపావళి పెద్దపండుగ. గవర్నమెంట్ హాలిడే. హిందువులు దాన్ని కొత్త సంవత్సరపు మొదటిదినంగా భావిస్తారు.

నారాయణ నాలుగు గంటలకే వచ్చాడు. నారాయణతో కలిసి క్రిస్ చంద్రూని, సీతని చూడటానికి వెళ్లారు. "రండి రండి" అంటూ క్రిస్ ఆహ్వానించాడు.

లాన్‌లో వేసిన కుర్చీల్లో కూర్చున్నారు. సీత స్వీట్సు, శీతల పానీయాలు తెచ్చి ఇచ్చింది. "సంవత్సరాదికి శుభాకాంక్షలు" అన్నాడు నారాయణ. కృష్ణ, శ్యామల కూడా శుభాకాంక్షలు చెప్పారు. "మీక్కూడా" అన్నారు సీత, క్రిస్‌లు.

"నీకఫ్తాన్ బావుంది" అంది సీతతో శ్యామల.

"వాళ్ల నాన్నకి బార్బెడోస్‌లో బట్టలషాపుంది. అన్నీ ఒకసారి సీతా, వాళ్ల అక్క చెల్లెళ్లు కట్టుకొన్నాకే ఆయన వాటిని అమ్ముతాడు"

"అన్నీ అబద్ధాలే శ్యామలా! మా నాన్న

టిపికల్ ఇండియన్. కూతుళ్లకి, అల్లుళ్లకి చాలా బహుమానాలిస్తాడు. దీపావళికి మాకు బట్టలు పంపాడు''

''మర్చిపోయాను. నేను వేసుకొన్న సఫారీ సూట్ మామావగారు పెట్టిందే. ఏడాదిపాటు ఇది కొట్లో ఉంటే ఎవరూ కొనలేదుట. మొన్న సగం ధరకి సేల్‌లో పెట్టాడుట. అయినా దీనికేసి ఎవరూ చూసిన పాపానపోలేదు. అప్పుడు ఆయనకి అల్లుడు గుర్తువచ్చాడు- నాకు పంపించాడు''

''ఇంకానయం! మా మావగారికి నేనెప్పుడూ గుర్తురాను'' అన్నాడుకృష్ణ.

''మానాన్ననంతమాట అనకండి. ఆయన ప్రతీనెలా మన పెళ్ళికి చేసిన అప్పుకి వాయిదాలు కడ్తాడు కదా! అప్పుడు తప్పకుండా మిమ్మల్ని తలుచుకొంటాడుట'' అంది శ్యామల.

''బాగా చెప్పారండి మీరు'' అన్నాడు నారాయణ.

''నీకూ ఓ మావగారుంటే తెలిసేది'' అన్నాడు కృష్ణ.

మరే అన్నాడు క్రిస్.

సీత లోపలికివెళ్ళి ఓ కఫ్తాన్ తెచ్చి, ''శ్యామలా! నువ్వు ఇది తీసుకోవాలి. ఇది నీకు న్యూ ఇయర్ డేకి నాగిఫ్ట్'' అంది.

శ్యామల వద్దంది. సీతవినలేదు. శ్యామల అది తీసుకొని తన మెళ్ళో ఉన్న పూసల దండతీసి సీతకిస్తూ, ''ఇది నువ్వు తీసుకో'' అంది.

సీత ఆనందంగా ఇండియా నుంచి వచ్చిన ఆ వస్తువుని స్వీకరించింది.

చీకటి పడుతుండగా యూనివర్సిటీకి వెళ్లి కారు పార్క్ చేసారు. అక్కడ్నుంచి ఆడిటోరియంవైపు నడిచారు. దార్లో వెదురుబద్దలన్ని అందంగా వంచి వాటిమీద అమర్చిన దీపాలను చూసుకొంటూవెళ్లారు. ఆడిటోరియం పక్క గదిలో భారతీయ కళలని ప్రతిబింబించే వస్తు ప్రదర్శనని చూసారు. వంద సంవత్సరాలపాటు వాళ్లవైన కళలని పెద్దలు పిన్నలకి నేర్పుతూ రావటం ద్వారా అవి నిలబడిఉన్నాయి. ఒక్కసారి ఇండియా వెళ్ళినట్టుగా అనిపించింది నారాయణకి, కృష్ణకి శ్యామలకి.

ఆడిటోరియంలోకి వెళ్లి కూర్చున్నారు. కాసేపటికి సంస్కృతిక కార్యక్రమాలు మొదలయ్యాయి. ఎక్కువగా సంగీతం, అందులోను ఎక్కువగా డప్పుడోలు ప్రధానత వహించాయి. ''టపాకాయల అవసరం లేకుండా ఈ చప్పుడే ఎక్కువగా ఉంది కదూ'' అన్నాడు నారాయణ. ''ఇది మన ప్రాంతాలలో కొన్ని కులాలువారు అమ్మవారి పండుగలకి వాయించే డప్పులా లేదూ!'' అన్నాడు కృష్ణ.

''వాళ్లుకొట్టేది డప్పే అయినా ఎంతలీనమై వాయిస్తున్నారో! వీళ్ల పూర్వీకులు వ్యవసాయ కూలీలుగా వచ్చారేమో వాళ్లతో ఈ కళని ఇంతదూరం తీసుకువచ్చారు. మనం చదువు కొన్నవాళ్లం అంతపని చెయ్యలేము'' అన్నాడు నారాయణ.

రామదున్‌మోగాక కృష్ణ, శ్యామల, నారాయణతో తమ ఇంటికి వెళ్లి కొవ్వొత్తులతో దీపాలు పెట్టి కాకరపూవత్తులు, సీమటపాగాయలు కాల్చారు. భారతదేశం గురించి కబుర్లు నంచుకొంటూ పులిహోర, పాయసాలతో భోంచేశారు.



కృష్ణ యూనివర్సిటీలో తన ఆఫీసురూమ్‌లో కూర్చుని లాబ్ రికార్డులు దిద్దుతుంటే లత వచ్చింది.

''రండి'' అని ఆహ్వానించి కుర్చీ చూపించాడు. లత మౌనంగా వచ్చి కూర్చుంది.

''ఏమిటి విశేషం?'' అని పలకరించాడు కృష్ణ.

''నావర్క్ చాలా స్లోగా అవుతోంది. నేను

ఇండియన్ షార్ట్ స్టోరీమీద ప్రాజెక్ట్ చేస్తున్నాను. తెలుగు కథకుల గురించి తెలుసుకోవాలని వచ్చాను"

"మీ గైడ్‌కి తెలుగు అనే ఒక భాష ఇండియాలో ఉందని తెలుసా? మీరు కన్నడం గురించి ఏమన్నా చెప్పారా?"

"నేను స్టూడెంటుని కదా! నామాటలు వినడం ఆయనకి చిన్నతనం మీమాట వినవచ్చు"

"మన ఇద్దరి వయస్సు రమారమి ఒకటే కదా!"

"మీరు లెక్చరర్, నేను స్టూడెంటు, ఇద్దరి స్టేటస్‌లలో చాలా తేడా ఉంది"

"ఆల్‌రైట్! ఎప్పుడైనా ఆయన కనిపిస్తే నాకు పరిచయం చేయండి"

"వస్తే తీసుకువెళ్తాను"

"నా అంతట నేను వెళ్లి ఆయనకి తెలుగు కథల గురించి పరిచయం చెయ్యాల్సిన అవసరం లేదుకదా! ఆయనకి తెలుసుకోవాలని ఉంటే ఆయన నాదగ్గరకి రావటం సమంజసం"

"ట్రినిడాడియన్సు ఇతర్ల దగ్గరకి వెళ్లడంవల్ల వాళ్లకేదో లాభం లేకపోతే, వెళ్లరు"

"నా దగ్గరకి మీగైడ్‌వస్తే ఆయనకి ఇండియన్ లిటరేటర్‌లో నాలెడ్జి పెరగవచ్చును కదా!"

"నాలెడ్జిని డబ్బుతో కొలవగలిగితే వస్తాడు. ఇక్కడ అన్నీ డబ్బుతోనే కొలవాలి. లాభం అని నేనప్పుడు నా ఉద్దేశంలో ఉన్నది ధనసంబంధమైన లాభం. పెట్రోలు దొరికాకవీళ్ల జీవితాలకి డబ్బుకి లంకె పెరిగిపోయింది. ఆఖరికి తండ్రీ పిల్లలకి, భార్యాభర్తలకి కూడా! ఉదాహరణకి నా కొడుకు ఆరేళ్లవాడు. వాడికి జార్జి ఒక్క సెంటు కూడా ఊరికే ఇయ్యడు. కారు తుడిచిపెట్టేనో లేక అలాంటి సహాయం చేస్తేనో ఇస్తాడు"

"పిల్లలు పాతికేళ్ళు వచ్చినా తల్లిదండ్రుల డబ్బు జల్సాగా ఖర్చుచెయ్యటమేకాని కానీ సంపాదించరు ఇండియాలో. అంతకంటే చిన్నప్పటినుంచి డబ్బు ఉట్టినే రాదన్న విషయం తెలియజేస్తూ బాధ్యతాయుతంగా పెంచటం నయంకదా!"

"ఇది బాధ్యతాయుతంగా పెంచటమా! కొడుకుమీద ఖర్చుపెట్టిన ప్రతీ సెంటు వడ్డీతో సహా రాబట్టుకోవాలనే తపన తప్పించి. వచ్చి వచ్చి ఈ ట్రినిడాడ్‌లో పడ్డాను. నాకు మోక్షంలేదు" ఆమె కళ్లనుంచీ నీరు కారింది.

"క్షమించండి మీ వ్యక్తిగత విషయాలని చర్చిస్తున్నందుకు. కాని అంత ఇష్టం లేనప్పుడు జార్జినెందుకు పెళ్లిచేసుకొన్నారు? చేసుకొన్నాక ఎందుకు విడిచిపెట్టలేదు"

లత కన్నీరు తుడుచుకొని, "నాకు కొద్ది రోజులుగా మనసు బాగాలేదు. మిమ్మల్ని నారాయణని చూస్తే ఆత్మీయులనిపిస్తుంది. నారాయణకి నాబాధలు చాలాసార్లు చెప్పుకొని బోరు కొట్టాను. దాంతో మా ఇంటికి రావటం మానేశాడు" అంది.

"జార్జి ఎదురుగానే మీరు నారాయణకి జార్జి గురించి చెప్పారా?"

"లేదు- జార్జి షాపులో ఉంటాడు కదా!"

"జార్జి లేనిసమయంలో నారాయణ వచ్చి మీఇంట్లో మీతో అన్నేసి గంటలు గడిపితే జార్జికి అనుమానంరాదా?" ఆశ్చర్యంగా అడిగాడు కృష్ణ.

"అనుమానం ప్రసక్తి లేదు. మా ఇద్దరిమధ్య లైంగిక సంబంధం ఉందనే జార్జి అనుకొంటాడు"

"అనుకొని కూడా మిమ్మల్ని ఏమీ అనలేదా?"

"ఏమీ అనలేదు. ఏమని అంటాడు! అతనికి ట్రినిడాడ్‌లో మూడు ఊళ్లలో ముగ్గురు

భార్యలున్నారు. అతనే ఊళ్లో పనిమీద ఉంటే ఆ భార్యతో ఉంటాడు. అతనే ఊళ్లో ఉండడో ఆ ఊళ్లో భార్య మరొకడితో గడుపుతూ ఉంటుంది. మనకి వీళ్ల జీవనవిధానం ఘోరంగా ఉంటుంది. కాని వాళ్లకి ఉండదు. మొరటుగా చెప్తున్నానని ఏమీ అనుకోకండి. ఇక్కడ ఇన్ని సంవత్సరాలుండి, బిడియాలు, జంకులు, మర్యాదలూ మర్చిపోయాను. రాత్రికింత అని మనసులో లెక్కకట్టి తనతో పడుకొనే ప్రతి స్త్రీకి జార్జి డబ్బు ఇస్తాడు ఆమె భార్య అయినాసరే, కిరాయిస్త్రీ అయినాసరే! నేను పై సంపాదన చూసుకొంటే అతనికేమిటి అభ్యంతరం" లత కళ్లల్లో తిరిగి నీరు నిండింది.

"మీ మాటలు నన్ను ఆశ్చర్య పరుస్తున్నాయి! మీ నోట ఇటువంటి మాటలు వింటుంటే మీ పరిస్థితికి చాలా విచారం కలుగుతోంది. మీకే జార్జి ఎక్కడ ఎలా తగిలాడు?" అని అడిగాడు కృష్ణ.

"నారాయణకి తెలును. మీకు చెప్పాడనుకొన్నాను. చెప్పలేదన్నమాట. నాకు సిగ్గేమిటి నేనే చెప్తాను. నేను,మా ఆయన అంటే జార్జి కాదు పదేళ్లక్రితం ట్రినిడాడ్ వచ్చాం. నాకప్పుడు ఇరవై ఐదేళ్ళు"

"మీకు ముప్పై అయిదేళ్లా!"

"అవును... స్కర్ట్సు వేసుకునే ఆడవాళ్ల వయస్సు తెలుసుకోవటం కష్టం. మీరు నాకంటే చిన్నవాళ్లు. మా ఆయన యు.వి.లో పనిచెయ్యటానికి వచ్చారు మీలాగనే. అప్పటికి నాకు ఒక సంవత్సరం పిల్లవాడు. తొమ్మిదేళ్ళ క్రితం ఇప్పుడున్నంత ట్రాఫిక్‌లేదు. ఇంత పయొలెన్సు లేదు. కాని మా ఆయన యాక్సిడెంట్‌లో పోయాడు. ఇక్కడ ఇన్సూరెన్సు డబ్బులు రాబట్టుకోవటం చాలా కష్టం. నాకు మా ఆయన పోయేనరికి రెండేళ్ల కొడుకు ఇరవై ఆరేళ్ల యౌవనం. నాకున్నది కూతురైతే వెంటనే ఇండియా వెళ్లిపోదునేమో! కొడుకు కనక వాడికి మంచి బవిష్యత్తు కలిగించాలంటే డబ్బు ముఖ్యం కదా! అందుకని ఆ పాపిష్టి డబ్బు తీసుకొని ఇండియా వెళ్లామనుకొన్నాను. డబ్బురావటానికి రమారమి సంవత్సరం పట్టింది. ఆ సంవత్సరం ఎలా బతికాను ఈ ట్రానిడాడ్‌లో అనుకొంటున్నారు? భయంభయంగా. యూనివర్శిటీవాళ్లు మా ఆయన సర్వీస్‌లో పోయినందుకు డబ్బిచ్చారు. అదిపెట్టుకొని ఇల్లుతీసుకొని ఉన్నాను. మా ఆయన బతికున్న రోజుల్లో జార్జి షాపులో వస్తువులు కొంటూ ఉండేవాళ్లం. ఆ అలవాటుకొద్దీ అతను పలకరిస్తూ ఉండేవాడు. అతని షాపులో నాకు సేల్స్‌గర్ల్ ఉద్యోగం ఇచ్చాడు. ఏడాదిఅయ్యేసరికి అంటే నా కొడిక్కి మూడేళ్ల వయసులో నాకు అన్నిచోట్ల నుంచి రావలసిన డబ్బు చేతికి వచ్చింది. ఆ రోజుల్లోనే ఒక వానరోజు షాపులో వ్యాపారం లేని సమయంలో నేను జార్జిచేసిన చొరవకి లొంగిపోయాను. నన్ను పెళ్లి చేసుకొంటానన్నాడు జార్జి. నాకున్నది కూతురై ఉంటే దాని భవిష్యత్తు దృష్ట్యా ఈ దేశానికి దూరంగా పోయుండేదానిని. కాని కొడుకు! ఈ ట్రినిడాడ్‌లో ఉంటే నష్టం లేదని, నేను రెండోపెళ్లి చేసుకొన్నా వాడు చదువుకొని పైకివస్తే ఇండియాలో వాడికి పిల్లనిచ్చేవాళ్ళకి కొదవ ఉండదని తెలుసు. కనుక ధైర్యంగా జార్జిని పెళ్లి చేసుకొన్నాను"

"అయితే జార్జితో పెళ్లయి మీకు ఎనిమిదేళ్లయిందన్నమాట"

"అవును... నాకు జార్జి ద్వారా ఆరేళ్ల కొడుకున్నాడు. నా మొదటి భర్త ద్వారాపదకొండు సంవత్సరాల కొడుకున్నాడు"

"మీ పెద్దవాడెక్కడున్నాడు"

"నాకు దూరంగా బోర్డింగ్ స్కూల్లో! వాడు పెద్దవాడయ్యాక బెంగుళూరులోని రామయ్య మెడికల్ కాలేజీలో జేర్పిస్తాను. వాడి డొనేషన్‌కి డబ్బు దాస్తున్నాను. అందుకే యు.వి.లో రిసెర్చికి జేరాను. లేకపోతే నామొహం నాకు పి.హెచ్.డి. ఏమిటి!"

"జార్జి సహాయం చెయ్యడా?"

"ఆయనే ఉంటే మంగలెందుకని మీ తెలుగు సామెత ఉందే అలాంటిదే ఇది. స్వంత కొడుక్కేకానీ ఇవ్వడు. సవితి కొడిక్కిస్తాడా! అతను సవ్యమైన భర్త అయితే నాకీ బాధ ఎందుకు!"





"విడిపోరాదా?"

"విడిపోయి ఏంచెయ్యను! నన్ను బాగానే చూసుకొంటాడుకదా! నా మొదటి పిల్లవాడికి నాడబ్బుఇస్తే అభ్యంతరం పెట్టడు. వీళ్లు వీళ్ల డబ్బు ఇవ్వరుకాని మనదేశంలోలాగా భార్యడబ్బు మాత్రం ఆశించరు. ఆ విషయంలో చాలా నయం. నా రెండో కొడుక్కి అన్నంపెడ్తాడు. బట్టలు కొంటాడు. జల్సాలకి డబ్బు ఇవ్వడు. నాకిల్లు ఇచ్చాడు ఉండటానికి. తిండిపెడ్తున్నాడు. ఏదో కాస్త రక్షణ ఉంది జీవితానికి"

"నిజమేలెండి. మనదేశంలో భర్త పోయిన స్త్రీలలో చాలామంది జీవితాలకంటే మీది చాలానయం"

"నిజమే! కాని బెంగుళూరులో నావాళ్లు నన్ను రానియ్యరు. నామొదటి భర్త తాలూకు వాళ్లకి నేను చెడిపోయిన దానితో సమానం. ఇక్కడి మనుష్యులు డబ్బు మనుష్యులు. ఎప్పుడైనా నావాళ్లు అనుకునే వాళ్లదగ్గర కూర్చుని నా బాధలు చెప్పుకోవాలని ఉంటుంది. మిమ్మల్ని చూడగానే ఎన్నాళ్లగానో నాలోదాగిన దుఃఖం కట్టలుతెంచుకొని బయటికి వస్తోంది" అంటూ లత టేబులుమీద తలపెట్టుకొని ఏడవటం మొదలు పెట్టింది.

కృష్ణ టైము చూసుకొన్నాడు. నాలుగూ నలభై. యు.వి టైము దాటిపోయింది. ఎదురుగా పార్కింగ్ ప్లేస్‌లో కార్లు అన్నీ వెళ్లిపోయాయి. వీళ్లు తొమ్మిందింటికి యు.వి. తెరిస్తే తొమ్మిదిన్నరకి వస్తారు. నాలుగున్నరకి మూస్తే నాలుగుకే వెళ్లిపోతారు.

"మీ కారుందా?" అని అడిగాడు లతని.

"మా డిపార్ట్‌మెంటు దగ్గరుంది నాకారు" అని వెక్కుతూ చెప్పింది.

"ప్లీజ్ లతగారు! ఏడవకండి"

అతను ఓదార్పగానే మరోసారి గట్టిగా రోదించింది లత. కృష్ణ ఆమె భుజంచుట్టూ చెయ్యివేసి రెండో చేత్తో తలఎత్తి పట్టాడు. ముఖం అంతా కన్నీళ్ల చారికలు. ముఖాన్నిపట్టుకొన్న చెయ్యితీసి తన కుర్చీమీదున్న తువ్వాలు అందుకొని ఆ తువ్వాలుతో ముఖం తుడిచాడు. లత దీనంగా అతని కళ్లల్లోకి చూసింది. కృష్ణ కరిగిపోయాడు. ఆడదాని ఆకర్షణనైనా వాడు తటుకోగలడేమోకాని, జాలిగొలిపే స్త్రీని ఓదార్చని పురుషుడుండడు! ఆ క్షణంలో ఆ వత్తిడికి కృష్ణ ఆలోచించకుండా ఆమెను దగ్గర తీసుకొన్నాడు. కృష్ణ భుజంమీద లత మూగగా రోదించింది కాస్సేపు. ఆపైన తువ్వాలు తీసుకొని బాత్‌రూంకి వెళ్లి ముఖం కడుక్కొని వచ్చింది. నిలబడి సెలవుతీసుకొంటూ తన హేండ్‌బేగ్ కోసం కృష్ణ టేబుల్ మీదకు వంగింది. అప్పుడు ఆమె లూజ్‌నెక్‌టాప్ వేసుకొంది. స్కర్ట్‌మీద అవి గమనించాడు కృష్ణ. ఆమె వెనక్కి తిరిగి వెళ్తుంటే లయబద్ధంగా కదిలే పిరుదులు, బలమైన పిక్కలు కృష్ణ కళ్ళని లాగివట్టాయి. "లత అందమైందే!" అనుకున్నాడు.

* * *

క్రిస్‌మస్‌కి యూనివర్శిటీ ఓ ఇరవై రోజుల పాటు మూస్తారు. మూసేముందు వైస్ ఛాన్సలర్ అందరికి డ్రింక్స్, స్నాక్స్‌లతో పార్టీ ఇచ్చేఅలవాటు. ఆ ఏడు కూడ వైస్ ఛాన్సలర్ పార్టీకి పిలిచాడు.

ఆ పార్టీకి కృష్ణ, శ్యామల వెళ్లారు. కృష్ణ పంచా, లాల్చీ వేసుకున్నాడు. శ్యామల వెంకటగిరి చీర కట్టుకొంది. వాళ్లు ఆస్టిన్‌మినిలో వెళ్లారు. అక్కడ శర్మ, సరళ, పళనిబాబు, వత్సల, జ్ఞానరత్నం, పుష్ప, క్రిస్‌చంద్రా, సీత ఉన్నారు. పార్టీ జోరుగా సాగుతోంది.

కుమార్ వచ్చి పలకరించాడు బీర్ గ్లాసుతో.

"మొహమాట పడకుండా తాగండి. ఈ వైస్ ఛాన్సలర్ మనమీద ఖర్చుపెట్టేది సంవత్సరానికోసారే!" అంటూ.

కృష్ణ మొదటిగ్లాసు పూర్తి చేసేలోపల కుమార్ మూడు గ్లాసులు పుచ్చుకున్నాడు.

"మీరు మరీ మొహమాటస్తుల్లాగా ఉన్నారు" అన్నాడు కుమార్.

"నేను తిరిగి ఇంటికి డ్రైవ్‌చెయ్యాలి అన్నాడు" కృష్ణ. "అందుకే ఇలాంటి పార్టీలకు మా కారు తీసుకురాము. మేము శర్మ, సరళలతో వచ్చాం" అంది కుమార్ భార్య చంచల.

"మంచి [illegible]వైనవని" అంది శ్యామల, పొగడ్తో, వెటకారమో తెలియకుండా.

శ్యామల బీర్ గ్లాసు పుచ్చుకొని కృష్ణకి



కంపెనీ ఇస్తోంది. చంచల సోడాలో విస్కీ మొగుడితో సమానంగా పోటీపడుతూ తాగుతోంది. కుమార్, చంచల కృష్ణ, శ్యామలలను విడిచిపెట్టి వెళ్ళాక శర్మ, సరళ వచ్చారు.

"కుమార్ మంచి హైగా ఉన్నాడు" అన్నాడు కృష్ణ.

"ఊళ్లోవాళ్ల సొమ్ముతో ఎప్పుడూ ఉత్సాహంగానే తాగుతాడు" అన్నాడు శర్మ.

"వాళ్ళింటికి వెళ్తేమాత్రం చాయ్ ఇస్తాడు" అంది సరళ.

"కొని ఇంట్లో పెట్టడనుకొంటాను. ఇంట్లో ఉండదు కనక ఇవ్వడు" అన్నాడు కృష్ణ.

"నేను తాగను అని ఎవరైనా అంటే అది ప్రిన్సిపల్ అని గౌరవిస్తాను. కాని ఎవరైనా, తాగుతానుకాని ఇతర్ల డబ్బుతో మాత్రమే అంటే నాకు అందులో పిసినారితనం కనిపిస్తుంది" అన్నాడు శర్మ.

"కుమార్ మనం ఇస్తే తాగుతాడు కాని మనల్ని ఇమ్మనడుగా!" అని కృష్ణ అంటే.

"అనడూ! మన ఇంటికి వచ్చినప్పుడు అడిగి మరీ తాగుతాడు. ఈ మధ్య 'నీకు



ప్రిన్సిపల్స్ ఉన్నాయి. నిన్ను పాడుచెయ్యను', అని చెప్పి అందరికి డ్రింక్స్ఇచ్చి తనకి టీ ఇచ్చానోసారి ఏమన్నాడో తెల్సా! 'బీర్ చలేగా!' నీకు నిజంగా బీరంటే ఇష్టం అయితే కొని ఇంట్లో పెట్టేవాడివి. నువ్వుకొనవంటే నీ కిష్టం లేదనే కద అర్థం. అలాంటి సత్ప్రవర్తన కలిగిన నీకు నేను బీరివ్వను' అని చెప్పాను. కాని అతనికున్నది చర్మంకాదు తోలు, థిక్స్కిన్డ్ఫెలో. ఇంకెవరికోసమో ఫిల్‌చేసి తెచ్చిన ఎంగిలి గ్లాసందుకొని గడగడా తాగేశాడు" అన్నాడు శర్మ.

"మీరు చాలా ఫ్రెండ్స్ అనుకున్నాం" అంది శ్యామల.

"ఫ్రెండ్స్! హిందీ మాట్లాడేవాళ్ళంతా మా ఫ్రెండ్సే. మా ఇంట్లో భోజనం చేసే వాళ్ళూ మా ఫ్రెండ్సే!" అంది సరళ.

"సర్లా! కుమార్ మరీ అంతచెడ్డవాడుకాదు. నిజానికి డబ్బు ఖర్చు పెట్టడు కాని ఫిజికల్ హెల్ప్ చేస్తాడు. ఈ రోజుల్లో దానికి చాలా విలువుంది" అని శర్మ సర్దేసాడు.

కృష్ణ తనకో విస్కీ తెచ్చుకొని, శ్యామలకో వైన్ తెచ్చిపెట్టాడు. ఈ లోపల శర్మ, సరళ వెళ్ళిపోయారు. జ్ఞానరత్నం, పుష్ప వచ్చారు.

"చూడు! శ్యామలగూడ తాగుతోంది" అంది పుష్ప జ్ఞానరత్నంతో.

"నేను తాగటంలేదు కదా!" అన్నాడు జ్ఞానరత్నం.

"అతను తాగడు నన్ను తాగనీయడు" అని వుప్ప ఫిర్యాదు చేసింది.

"మా అత్తగారు సిలోన్‌లో డాక్టర్. ఫ్రీగా వచ్చిన గ్రైప్‌వాటర్స్ అవీ తాగటంతో మా ఆవిడకి చిన్నప్పటినుంచి ఆల్కహాల్ అలవాటయింది" అన్నాడు జ్ఞానరత్నం నవ్వుతూ.

"మరోలా అనుకోవద్దు" అని కృష్ణ వెళ్ళి వుప్పకి ఓ వైన్ తెచ్చి ఇచ్చాడు.

అది పుచ్చుకొని వుప్ప కదిలింది వెనకాతలే జ్ఞానరత్నం వెళ్ళాడు.

"ఆవిడ మొగుడు వద్దంటుంటే మీ రెందుకు ఆవిడకు డ్రింక్ తెచ్చిచ్చారు?"

"ఆవిడ కావాలంటోంది కదా?"

"పరాయి స్త్రీకి డ్రింక్ ఇవ్వాల్సిన అవసరం ఏమిటి మీకు?"

"అయామ్‌సారీ! ఏదో పండగ మూడ్‌లో అంత ఆలోచించలేదు"

"కొంచెం డోస్ ఎక్కువైతేనరి!"

సరిగ్గా అదే సమయంలో డోస్ ఎక్కువైన వెస్టిండియన్ ప్రొఫెసర్ ఒకాయన స్టీల్ బాండ్‌కి అనుగుణంగా స్టెప్స్ వేయటం మొదలుపెట్టాడు. జనం లయగా చప్పట్లు చరచటం మొదలుపెట్టారు. పార్టీ వేగాన్ని పుంజుకొంది.

లైన్ వచ్చాడు, "స్యామ్లా! కమ్ అండ్ డాన్స్ విత్‌మి. నువ్వివ్వాళ కళ్లు చెదిరేలా ఉన్నావ్" అన్నాడు.

"ఇవాళ మీ అందరి కళ్ళూ తాగి చెదిరి ఉన్నాయి. నేను మామూలుగానే ఉన్నాను" అంది శ్యామల.

"ఐ టేక్ ఇట్. మంచి జవాబు ఇచ్చావు" అని నవ్వి వెళ్ళిపోయాడు లైన్.

కృష్ణ, శ్యామల వంక ఆశ్చర్యంగా చూశాడు.

క్రిస్ చంద్రూ, సీత వచ్చి పలకరించారు.

"ఇంక మేం వెళ్తాం. రవిని ఇంట్లో కుక్కదగ్గర వదిలిపెట్టి వచ్చాం" అన్నారు కాస్సేపు నిలబడి.

"మనం కూడ వెళ్దాం" అంది శ్యామల.

వెళ్ళ దల్చు కొంటే వెళ్ళిపోవటమే. ఎవరికీ చెప్పక్కర్లేదు. జస్ట్ డిసఅపియర్" అన్నాడు క్రిస్.

శ్యామల కృష్ణ బయల్దేరారు. దార్లో చంచల కుర్చీలో జారిగలబడి మత్తులో కనిపించింది. పార్టీ అని చీర కట్టుకొని వచ్చింది. ఆ చీర మెరిసే పలచటి చీర. ఆ చీర కొంగు భుజంమీద కాక నేలమీద ఉంది.

"సిద్దార్థుడు బహుశా ఇటువంటి దృశ్యం చూసే సన్యసించి ఉంటాడు" అన్నాడు కృష్ణ.

"పరాయి స్త్రీ అందచందాల్తో మీకేం పని!" శ్యామల కోపంగా అడిగింది.

"పరాయి స్త్రీ అందంగా ఉందని అనరాదు. తెలునును కాని కాదని కూడా అనగూడదా!"

"మీకు కొంచెం డోస్ ఎక్కువైంది."

"అయ్యుండవచ్చు"

"వీళ్ళల్లా తాగి వీళ్ళ కల్చర్ మాత్రం అలవరుచుకోకండి"

"చిత్తం"

ఇంటికి చేరుకొన్నాక మత్తుగా శ్యామలను దగ్గరకు తీసుకొన్నాడు కృష్ణ.

* * *

సంక్రాంతికి నరసింహం, లక్ష్మి, వసంత వచ్చి కృష్ణని, శ్యామలని భోజనానికి పిలిచారు. సంక్రాంతి సందర్భంగా ఆదివారం అయితే డాక్టర్లకి వీలుగా ఉంటుందని పోర్ట్ ఆఫ్ స్పెయిన్‌లోను, శాన్‌ఫెర్నాండోలోను, కోరాలోను తెలుగుడాక్టర్లున్నారని వాళ్ళందరిని భోజనానికి పిలుస్తున్నామని ఆరోజు వస్తే అందర్ని కలునుకోవచ్చని చెప్పి వెళ్ళారు. కృష్ణకి, శ్యామలకి అంతమంది తెలుగువాళ్ళని కలుసుకోబోవటం ఎంతో ఉత్సాహం కలిగించింది.

శ్యామల తను గూడా ఏదైనా చేసి తీసుకువెళ్దామనుకొంది.

ఆదివారం పదకొండు గంటలవగానే బయల్దేరి కృష్ణ, శ్యామల, నర్సింహం ఇంటికి వెళ్ళారు. లక్ష్మి వంట చేస్తుంటే వసంత సహాయం చేస్తోంది.

డాక్టర్లు ఒకక్కరే రావటం మొదలుపెట్టారు. మొదట రెడ్డి అతని భార్య పద్మ వచ్చారు.




అతను పాథాలజిస్టు. వాళ్ళకో మూడేళ్ళ అబ్బాయి. తరువాత చౌదరి అతని భార్య శారద వచ్చారు. అతను కోరా హాస్పిటల్‌లో డాక్టరు. తరువాత గుప్త అతని భార్య రమ వచ్చారు. తరువాత వెంకటరమణ అతని భార్య వచ్చారు. కృష్ణ శ్యామల ఆశ్చర్యంగా చూస్తూ ఉండిపోయారు. విజయ తెలుగుపేరే అయినా అమ్మాయి నీగ్రో అమ్మాయి. చీరకట్టు కొని వచ్చింది. అందరికి నమస్కారం పెట్టింది. వెంకటరమణ ఆ అమ్మాయిని చేసుకోవడానికి గల కారణం తెలియలేదు. అతను వెళ్లాక నరసింహాన్ని అడగాలనుకొన్నారు. అందరికి డ్రింక్స్ కలిపి ఇచ్చాడు నరసింహం. మగవాళ్ళు అందరు విస్కీ తీసుకొన్నారు. స్త్రీలు పళ్ళరసం తీసుకొన్నారు.

"ఇంకా ప్రసాద్ రాలేదు" అన్నాడు రెడ్డి.

"వస్తాడు బ్రహ్మచారికదా! వని నగంలో వదిలిపెట్టి రాలేదు" అన్నాడు గుప్త.

అందరు నవ్వారు. ఇంతలో ప్రసాద్ వచ్చాడు. పొడుగ్గా చూడటానికి సరదాగా ఉన్నాడు.

"నా గురించేనా నవ్వుతున్నారు?" అని అడిగాడు.

"మీ లీలలే తల్చుకొంటున్నాం" అన్నాడు గుప్తా.

"మీరంతా లీలలు పూర్తిచేసేసి భగవద్గీతలు చెప్పే స్థాయికి వచ్చారు. కాని నేను కుర్రాణ్ణి కదా!" అని ప్రసాద్ నవ్వేసి తనూ ఓ విస్కీ గ్లాసు తీసుకొన్నాడు.

విజయ వాళ్ళ ఆయనది విజయనగరం అని అది ఇండియాలో ఆంధ్రాస్టేట్‌లో ఉత్తరాన ఉందని చెప్పింది శ్యామలతో. తనది సెంట్ విన్సెంట్ అనే ద్వీపం అని, ఆయన ఆ ద్వీపంలో డాక్టర్‌గా ఉండిన రోజుల్లో పరిచయం అయిందని, తను పెళ్ళికాక ముందు నర్సుగా పనిచేసేదాన్నని చెప్పింది. "మీ దేశంలో పెళ్ళయ్యాక అంటే గృహిణిగా స్త్రీలు ఉద్యోగాలు చెయ్యరటకదా! రమణ చెప్పాడు" అంది విజయ. "అందరి సంగతి నాకు తెలియదు నాకు ఉద్యోగం ఇచ్చే వాళ్ళుంటే చేస్తాను. నాకు బోరుకొట్టి ఛస్తున్నాను" అంది శ్యామల.

"ఇండియాలో ఇప్పుడు చాలామంది ఆడవాళ్ళు ఉద్యోగాలు చేస్తున్నారు. ఇందిరాగాంధీ చాలా పెద్ద ఉద్యోగమే చేసింది కదా! అవకాశం ఉంటే నేనూ చేస్తాను" అంది లక్ష్మి.

"ఉద్యోగమా? పెళ్ళా? అని నాణెం ఎగరవేసి ఉద్యోగమే నయం అని మా ప్రిన్సిపాల్ ఎలిజా మహేశ్వరి ఉద్యోగం చేస్తోంది. బాయ్ ఫ్రెండ్స్ కో అంటే కోటిమంది. బాస్ చెయ్యడానికి మొగుడుండడు హాయిగా. పిల్లల్ని కంటే ఇన్‌కమ్‌టాక్స్ రిబేట్ కూడాను పెళ్ళవకపోయినా" అంది వసంత.

"వసంతా వంటింట్లో పులిహారమీద మూత పెట్టిరా" అని లక్ష్మి వసంతని లోపలికి వంపించింది. ఆ పిల్ల చర్చలో పాల్గొనడం ఇష్టంలేక.

"ఏమోబాబు నాకు నలుగురి మొగాళ్ళలోకి వెళ్ళాలంటే చచ్చే ఇబ్బందిగా ఉంటుంది" అంది రమ.

"నువ్వు పోర్ట్ ఆఫ్ స్పెయిన్ రోడ్లన్నీ చక్కబెడుతూ ఉంటావుకదా! నీకు భయమేమిటి?" అంది లక్ష్మి.

"నన్నేం చెయ్యమంటావే! ఈ డాక్టర్లు పొద్దున్నపోతే రాత్రిగాని రారు. ఇంటికి కావలసిన వస్తువులు ఎవరు తెస్తారు?" అంది రమ.

"మరి మీకు వంటరిగా మొగాళ్లమధ్య తిరగటానికి భయం వెయ్యదా?" అని అడిగింది శ్యామల.

"సిగ్గన్నాను గాని నాకు భయం అన్నానా! నేనొకసారి బజార్లో నడుస్తుంటే ఓ ఆఫ్రికన్ 'చిక్' 'బిక్' అంటూ నా వెంటవడ్డాడు. నాక్కోపం వచ్చి వెనక్కి తిరిగి నేను 'చికోని కానురా హెనోని చాలా గుద్దుపెట్టాను అని చెప్పాను. నోరుమూసుకుపోయాడు" అంది.

శ్యామల వసంత నవ్వారు. రమ తనూ నవ్వింది. గుప్తా చాలా సంపాదిస్తాడు. ఇండియాకి పంపగలిగనంత పంపుతాడు. మిగతాది భార్యకు బంగారం కొంటాడు. ఆ బంగారంతో రమ పెద్దపెద్ద మంగళసూత్రాలు చేయించుకొంది. ఆ మంగళసూత్రాల్లో ఉన్న బంగారానికి కళ్ళు చెదిరి, బొంబాయిలో కస్టమ్స్‌వాడు అనుమానిస్తే "మాంగల్యాన్ని అనుమానించేవాడివి నువ్వేం ఇండియన్‌వి" అని రమ క్రితంసారి ఇండియా వెళ్లినప్పుడు కస్టమ్స్ వాడిని చివా

ట్లు పెట్టింది. ఆ మంగళసూత్రాలు ఇండియాలో మార్పించి చిన్నవి చేయించుకొని వచ్చింది. తిరిగి వెళ్ళేటప్పుడు మళ్ళీ పెద్ద మంగళసూత్రాల్తో వెళ్తుంది. రమ డబ్బు ఇండియాకి ఎల్లా చేరవేయవచ్చో ప్లాను తీసుకొని చెప్పింది. తన భర్త తను హైదరాబాద్‌లో మంచి స్థలంకొని మేడకట్టుకొని రిటైరయ్యాక అక్కడుంటామని చెప్పింది. 1979లో జీతాలు పెరగటంవల్ల గ్రాట్యుటీవల్ల తమకు గత సంవత్సరం రెండు లక్షలు వచ్చాయని చెప్పింది. మధ్యలో మొగాళ్ల మధ్యకి వెళ్ళి"

"ఎన్నోదిది. రెండుకుమించి తాగితే ఒప్పుకోను, మీరు డ్రైవ్‌చెయ్యాలి కూడాను. ఇంకవద్దు వింటున్నారా?" అని గుప్తని అదిలించివచ్చింది.

కాస్సేపటికి గుప్త, రమ సెలవుతీసుకొని వెళ్ళిపోయారు. డాక్టర్లు మిగిలిన వాళ్ళు కబుర్లలో పడ్డారు. కృష్ణ అందరి మాటలు వింటూ కూర్చున్నాడు. అందులో వెంకటరమణ, చౌదరి మాట్లాడుకోకపోవడం గమనించాడు కృష్ణ.

శారద శ్యామలతో చాలా స్నేహంగా మాట్లాడింది. పద్మ కూడా "మీకు పోర్ట్ ఆఫ్ స్పెయిన్‌లో పన్లుంటాయి కదా! అటువచ్చినప్పుడు మా ఇంటికిరండి" అని శ్యామలని పిలిచింది.

"మీ అబ్బాయి చాలా ముద్దుగాఉన్నాడు. అతనితో ఆడుకోడానికైనా వస్తూఉంటాం" అంది శ్యామల.

రెడ్డిలేచి, "ఇంక మేము వెళ్తాం. మా ఇంటికి ఎవరువస్తే వాళ్లకి ఇడ్లీలు వేసిపెడ్తాం గుర్తుంచుకోండి" అన్నాడు.

"మేము ఖచ్చితంగా వస్తాం" అన్నాడు కృష్ణ.

పిక్టన్ వీధిలోఉన్న తన ఇంటి ఎడ్రసిచ్చాడు రెడ్డి కృష్ణకి.

మరి కాసేపటికి వెంకటరమణ, విజయలేచారు వెళ్లటానికి.

"నన్ను మీలో కలుపుకోండి. మర్చిపోకండి" అంది విజయ. "మిమ్మల్నింత కలువుగోలుగా చూస్తుంటే చాలా సంతోషంగా ఉంది. మేము తప్పకుండా వస్తాం. మీరు కూడా మా ఇంటికి రండి" అంది శ్యామల.

వెంకటరమణ, విజయ వెళ్ళిపోయేదాకా చౌదరి బిగుసుకుపోయాడు. అతను వెళ్లగానే ప్రసాద్‌ని-

"ఏం గురూ! మా ఇంటికి రావటంలేదేం?" అని అడిగాడు.

"నీకు మీ ఆవిడ వచ్చేసింది. నాతో కాలక్షేపం చెయ్యాల్సిన ఖర్మనీకేం. నిన్ను మాటిమాటికి డిస్టర్బ్‌చేస్తే చెప్పొచ్చుకు కొడ్తావ్" అన్నాడు ప్రసాద్.

"మాకు పెళ్లయి చాలా సంవత్సరాలైంది. మమ్మల్ని రోజూ డిస్టర్బ్ చెయ్యండి" అన్నాడు కృష్ణ.

"అల్లాగే వారానికొకరిని డిస్టర్బ్‌చేస్తాను" అన్నాడు ప్రసాద్.

"మిగిలిన ఆర్రోజులు అతను డిస్టర్బ్ అవడు" అన్నాడు చౌదరి.

కాస్సేపు కులాసాగా కాలక్షేపం చేసాక కృష్ణ శ్యామల వెళ్తామని లేచారు. ప్రసాద్, చౌదరి, శారదకూడా లేచారు ఇంటికి వెళ్లడానికి. నరసింహం, లక్ష్మి వసంత గుమ్మందాకా వచ్చారు.

"మీరెక్కడ ఉండేది?" అని శారద శ్యామలని అడిగింది. "సెంటాగస్టీన్‌లోని డాష్ స్ట్రీట్‌లో ఉంది మా ఇల్లు" అంది శ్యామల.

"మాది తూనా పూనా. మా ఇంటి మీదుగానే వెళ్లాలి మీరు. దార్లో మా ఇంట్లో ఆగి వెళ్దురు గాని" శ్యామల, కృష్ణకేసి చూసింది. చౌదరి, "రండి. ఎక్కువసేపు ఉండక్కర్లేదు లెండి" అని మొహమాటంగా పిలిచాడు.

కృష్ణ "వస్తే ఎక్కువసేపు కూర్చుంటాం. మరోసారి వస్తాం" అన్నాడు ఇబ్బందిగా.

"అబ్బా! రండి!" అంది శారద. శారద మాట్లాడ్తుంటే చిన్నపిల్ల మాట్లాడినట్టు ఉంటుంది.

"వెళ్దాం పదండి" అంది శ్యామల, కృష్ణ అంగీకరించాడు. "నన్ను ఎవరూ పిలవలేదు నేను నాగూడుకు పోతున్నాను" అన్నాడు ప్రసాద్.

"నిన్నెవరు పిలుస్తారు గురూ!" అన్నాడు చౌదరి.

"రండి. అన్నయ్యగారూ!" అంది శారద.





"మరోసారి" అన్నాడు ప్రసాద్.

నరసింహం కుటుంబం దగ్గర సెలవుతీసుకొని, తూనాపూనాలో చౌదరి వాళ్ళింటికి వెళ్ళి కాస్సేపు కూర్చుని శ్యామల, కృష్ణ వాళ్ళింటికి వెళ్ళిపోయారు.

'ఎంతమంది తెలుగు వాళ్లో. నాలిక తుప్పు వదిలిపోయింది, అంతమందితో తెలుగు మాట్లాడితే" అంది శ్యామల.

"మరే!" అన్నాడు కృష్ణ.

"ప్రతివారం ఒక్కొక్కళ్ళ ఇంటికి వెళ్లవచ్చు" అంది శ్యామల ఆశగా. "చూద్దాం" అన్నాడు కృష్ణ.



ఫిబ్రవరి నెల వచ్చింది. దీవంతా కళకళలాడటం మొదలుపెట్టింది. అందరిలోనూ చైతన్యమే. ఆ నెల మొదటివారంలో కార్నివాల్ జరుగుతుంది. కాలిప్సోల పోటీ జరుగుతుంది. పోటీలో పాల్గొనే కాలిప్సోలు టి.వి.లో వస్తున్నాయి. అవి రెండు మూడు వద్యపాదాలతో ఉండే పద్యాలు. ఒక కాలిప్సోలో రెండు మూడు పద్యాలుండవచ్చు. అవి సమకాలికమైన విషయంమీద చిన్నచిన్న ఛెణుకులు అందులో ప్రసిద్ధులు వాటిని కట్టి పాడ్తారు. అందులో అందం కృష్ణకి, శ్యామలకి తెలియలేదు. అమాటే అక్కడున్న భారతీయుల్తో అంటే "ఒక వారంపోయాక కార్నివాల్ అయిపోయాక ఈ మాటే మీరంటే ఆలోచిస్తాం" అన్నారు.

రెండుమూడ్రోజుల్లో కృష్ణకి, శ్యామలకి అందులోని లయభావం అనుభవంలోకి రావటం మొదలైంది. నీగ్రోల పాటల్లో, ఆటల్లో ఒకవిధమైన ఊపు, ఉద్రేకం ఉంటాయని పించింది. రెండ్రోజులు కార్నివాల్. ఆరోజులు సెలవులిచ్చారు యూనివర్సిటీకే. కార్నివాల్ ఒక నెల ఉందనగానే ప్రజలు అందులో వాళ్లు వెయ్యదలచుకొన్న వేషాలకి కావలిసిన సామగ్రి తయారుచేసుకొంటూ ఉంటారట. రాజు, రాణులు, పిచ్చివాళ్లు, కంకాళాలు, దయ్యాలు, రాక్షసులు అందరూ నేల ఈనినట్టు బయటవడ్తారట. కృష్ణ, శ్యామల వాళ్ల మినీ ఆస్టిన్‌లో బయల్దేరి రెడ్డిఇంటిముందు ఆపుకొన్నారు. రెడ్డి, పద్మ, పిల్లవాడుకూడా చూడటానికి వీళ్లతో బయల్దేరారు.

ఇండియన్ హైకమిషన్ ముందు నిలబడ్డారు. ప్రొసెషన్ వేషధారులు కదుల్తున్నారు. ఐసులో పెట్టిన కారిబ్ బీరుసీసాలు వందలు, వేలసంఖ్యల్లో అమ్ముడు పోతున్నాయి. ఎంతో శ్రద్ధతో వేషాలు తీర్చిదిద్దుకొని కార్నివాల్‌లో పాల్గొనే ఉత్సాహంతో జనం కదలిపోతున్నారు.

బస్సులుమీద బాండ్ల మ్యూజిక్ హోరెత్తిస్తున్నాయి. ఆ పాటకి అనుగుణంగా అడుగులు వేస్తూ జనం కదుల్తున్నారు. మగ, ఆడలో కూడా దరిదాపులుగా నగ్నంగా ఉన్నవారున్నారు. నల్లటి శరీరాలు నిగనిగలాడ్తున్నాయి. ఆఫ్రికన్ జాతివాళ్లేకాక తెల్లవాళ్లు, పశ్చిమ భారతీయులు అందరూ అందులో పాల్గొన్నారు.

పాటకనుగుణంగా గైరేషన్లు మొదలయ్యాయి. "ఇవి మన జ్యోతిలక్ష్మి, జయమాలిన్ల డాన్సుల్లా లేవూ?" అంది శ్యామల.

"ఉన్నాయి. వాళ్లు అవి మనకోసం చేస్తారు. డబ్బు సంపాదిస్తారు. ఇవి వీళ్లు తమ ఆనందంకోసం చేస్తారు. డబ్బు ఖర్చుపెట్టుకొంటారు" అన్నాడు రెడ్డి.

."సరిగ్గా మరో పదినెలల్లో తండ్రి లేని పిల్లలు వేలల్లో పుడ్తారు" అంది పద్మ.

"అదేమిటి?" అని శ్యామల అడిగింది.

"ఈ రోజు రాత్రి వాళ్లు నిరాటంకంగా ఉద్రేకాలు చల్లార్చుకొంటారు. అందులో పధ్నాలుగు పదిహేనేళ్ల బాలికలు శీలాల్ని కోల్పోతారు. పదినెలలకి అందులో కొందరు పిల్లల్ని కంటారు" అన్నాడు రెడ్డి.

"ఎవరూ పట్టించుకోరా?" కృష్ణ ఆశ్చర్యంగా అడిగాడు.



"ఎవరు పట్టించుకొనేవాళ్లు! వీళ్లలో కొంత మంది అలా పుట్టినవాళ్లే. శీలానికిక్కడ విలువ నున్నా" అంది పద్మ.

శ్యామలకా వాతావరణం భయంగానూ ఉద్రేకంగానూ ఉంది.

కాఫీటైముదాకా అక్కడ గడిపి సాయంత్రం నాలుగింటికి రెడ్డి యింటికి చేరుకొన్నారు. పద్మ కాఫీ కలుపుతూ ఉంటే శ్యామల ఆమెతో వంటింట్లో కబుర్లు చెప్తూ నిలబడింది. పిల్లవాడిని వళ్లో కూర్చోబెట్టుకొని రెడ్డి, కృష్ణతో వరండాలో కబుర్లు చెప్పసాగాడు.

"ఈ వాతావరణం మన భారతీయులకి ఇబ్బందిగా ఉంటుందికదూ?" అన్నాడు కృష్ణ.

"ఏమీ ఉండదు. మన బ్రహ్మచారులందరూ, ఈ వాతావరణాన్ని బాగా వాడుకుంటున్న వాళ్లే. మా డాక్టర్లలో సగంమందికి ఆడరోగులతో, నర్సుల్తో సంబంధాలున్నాయి. రోజుకొకత్తితో పడుకొంటారు" అన్నాడు.

"నిజంగానా?" అన్నాడు కృష్ణ కుతూహలంగా.

"కుటుంబాలతో ఉన్నవాళ్లకిబ్బందిగా ఉంటుందేమోగాని ఇది బ్రహ్మచారులకి స్వర్గం. సుఖవ్యాధుల భయం ఒకటి ఏడ్చింది గాని లేకపోతే ఈ దేశంలో ఆ దృష్టి ఉన్నవాడికి ఎన్నో అవకాశాలు"

"మన తెలుగువాళ్లలో అలాంటివాళ్లున్నారా?" కృష్ణకి కుతూహలం పెరిగిపోతోంది. చెడువట్ల ఆసక్తి అటువంటిది.

"లేకేం. మన చౌదరి, వెంకటరమణ పెళ్లికాని రోజుల్లో కలిసుండేవారు. ఒక కంచాన్న తినలేదు, ఒక మంచాన పడుకోలేదుగాని, ఒకత్తినే ఒక మంచంమీద ఒకళ్ల తరువాత ఒకళ్లు అనుభవించేవారు. ఒక వందమందినైనా రుచి చూసుంటారు. మా డాక్టర్లకి వీళ్లెక్కువ, జబ్బుల బాధ తక్కువకదా!" రెడ్డి చాలా మోటుగా వివరించాడు అక్కడి పరిస్థితి.

"మొన్న నరసింహంగారింట్లో ఇద్దరూ పలకరించుకోలేదు అని అనుకొన్నానే! అంత స్నేహితులని తెలియలేదు."

రెడ్డి నవ్వాడు. "పెళ్లికాకముందు మంచి స్నేహితులే. పెళ్లయ్యాక ఇద్దరికి రెండోవాడి మీద అపనమ్మకాలు మొదలయ్యాయి. ఎవరి భార్యను వాళ్లు రెండోవాడినుంచి రక్షించుకోవాలని చూడసాగారు. వెంకటరమణ వేరే ఇల్లు చూసుకొని మారాడు. ఒకళ్లనొకళ్లు విజిట్ చేసుకోవడాలు మానేశారు. అదయ్యాక మరొక రకం భయంపట్టుకొంది వాళ్లకి. అవతలివాడు కోపంతో తన భార్యతో తనగురించి వచ్చి నిజాలు చెప్పేస్తాడేమోనని. విజయ లోకల్ కనుక వెంకటరమణ లీలలు ఆమెకి తెలియకపోలేదు. శారద చిన్నది, అమాయకురాలు, ఆమెకి చౌదరి లీలలు తెలుసుననుకోను. దాంతో పలకరించుకోవడాలు మానేశారు."

"బావుంది" అన్నాడు కృష్ణ.

పద్మ రావటంతో ఆ చర్చ ఆగిపోయింది. ఆమె ఇడ్లీ పళ్లాలు, కాఫీ తెచ్చి వాళ్ల ముందుంచింది.

"మాట నిలబెట్టుకున్నారు" అన్నాడు కృష్ణ.

"మరి మీలాంటి అతిథులువస్తే మర్యాద చెయ్యవద్దా? పద్మా ఇడ్లీల్లోకి కారప్పొడి, నెయ్యి వేశావా?" అని అడిగాడు రెడ్డి.

"మీరు చెప్పలేదని మానేశాను" అంది పద్మ నవ్వుతూ.

ఇంతలో రెడ్డి దగ్గరున్న రేడియోలాంటి దాంట్లో "బీప్ బీప్" అన్న శబ్దం వచ్చింది.

"ఇండియన్లకి ఆసుపత్రి పనులు అప్పచెప్పి ఇక్కడి వెధవలు ప్రయివేటు ప్రాక్టీస్ నిశ్చింతంగా చేసుకొంటారు" అంది పద్మ.

"నేను ఆస్పత్రికి వెళ్లాలి. పిలుపు వచ్చింది. క్షమించండి. ఏదో అర్జెంటు కేసు" అంటూ రెడ్డి లేచాడు.

మేము వెళ్తాం" అని శ్యామల, కృష్ణ బయల్దేరారు.

ఆ మర్నాడు కృష్ణ శ్యామలతో మళ్ళీ కార్నివాల్‌కి బయల్దేరాడు. కొద్దిగా మధ్యాహ్నం భోజనం, తాగటానికి జ్యూస్‌లు బీరు, అయిస్ సర్దుకొన్నారు ఈరోజు ఏ కుటుంబంతో కలవకుండా వెళ్లాలనుకొంటున్నామని శ్యామలతో చెప్పాడు.

శ్యామల సరేనంది. చీరకట్టుకొంటే తప్ప

తూర్పు భారతీయ స్త్రీ ఎవరో, పశ్చిమభారతీయ స్త్రీ ఎవరో తెలియదు. జనంలో కలిసిపోడానికి నిశ్చయం చేసుకొన్నాక శ్యామల స్కర్ట్, బ్లౌజ్ వేసుకొంది. అది పలుచటిబ్లౌజు. లోపల నుంచి బ్రా కనిపిస్తుంటే కోర్కెగా చూశాడు కృష్ణ. "వదండి" అంది శ్యామల కన్నుగీటి. కృష్ణ కూడా లోపలికి వెళ్లి నిక్కరు బనియను వేసుకొని వచ్చాడు.

సవనాకి కారు దూరంగా ఆపారు. ట్రినిడాడ్‌లో స్పానిష్ కూడా ముఖ్యమైన భాషల్లో ఒకటి. సౌత్ అమెరికాలో స్పానిష్ ప్రభావం ఎక్కువ. ప్రపంచంలో ఎక్కువగా మాట్లాడేది స్పానిష్ భాషేనని అంటారు కొందరు. సవానా అంటే గడ్డి మొక్కలు ఉన్న విశాలమైన స్థలం. అక్కడే పోటీలు, పోటీదారులు పోర్ట్ ఆఫ్ స్పెయిన్ ముఖ్య రహదార్ల గుండా వచ్చి, సవానాలో దానికై విడిగా కట్టిన ఆవరణలో న్యాయనిర్ణేతల ముందు నడుచుకొంటూ, ఆడుకొంటూ, పాడుకొంటూ వెళ్తారు. అక్కడ కూర్చుని చూడటానికి టిక్కెట్లుంటాయి. అవి ఖరీదు. పైగా జైలులో కూర్చున్నట్టు కూర్చుని చూడాలంటే విసుగు.

అందుకని ఆ ఆవరణ మొదట్లో ఉన్న రోడ్ల కూడలిలో శ్యామల కృష్ణ నిలబడ్డారు.

మధ్యాహ్నం పన్నెండు గంటలయ్యేసరికి జనంలో ఉత్సాహం పెరిగింది. పాటలు జోరుగా వాయిస్తున్నారు బాండ్‌వాళ్లు. ప్రతివాళ్లు అప్పటికి నాలుగైదు బీరు సీసాలు తాగి ఉంటారు. వెస్టిండీస్‌లో బీరు సీసాలు చిన్నవి. అవి మూడు కలిస్తే ఇండియాలో ఒక సీసాకి సమానం అవుతాయి.

"రూములో వంటరిగా తాగటం వేరు, జనం మధ్య అందరితోపాటు తాగటం వేరు, బారుల్లో తాగటం వేరు. నలుగురితో చేస్తే దానికిక్ దానిది" అన్నాడు కృష్ణ.

"మరే" అంది శ్యామల. శ్యామల అప్పటికి తానూ ఓ రెండు సీసాల బీర్ తాగింది.

"మనం కూడా రంగంలోకి దిగుదాం. లెటజ్ జమ్స్ ఇన్ అండ్ జమ్స్ అప్" అన్నాడు కృష్ణ.

కృష్ణ, శ్యామల రోడ్ మధ్యకి వెళ్లి పాటకనుగుణంగా వళ్లు కదుపుతూ గంతులు వేశారు. నవ్వుకొన్నారు. వీళ్లని పట్టించుకొన్నవాళ్లెవరూ లేరు.

శ్యామల నడుంచుట్టూ కృష్ణ చెయ్యివేసి మళ్లీ చూస్తున్న జనంలోకి తీసుకువెళ్లాడు. గైరేంటింగ్ కపుల్స్ వచ్చారు.

"ఇంద ఇంద తీసుకో ... ఇప్పుడే స్వంతం చేసుకో పాట గుర్తుకు వస్తోంది నాకు" అన్నాడు కృష్ణ ఆ మూవ్‌మెంట్స్ చూస్తూ.

"పాపం - మన సినిమాల్లో డాన్సర్స్ ఒకళ్లే చేస్తారు. మగ సహాయం లేకుండా దానికే మనం గొడవచేస్తాం. ఈ నడిరోడ్డు నృత్యాలు చూస్తే మన సెన్సార్‌బోర్డు వాళ్లేమంటారో?" అంది శ్యామల.

"ఏమంటారు - మేము తప్ప మీరెవరు చూడరాదు అంటూ రోడ్లు ఖాళీ చేయిస్తారు" అన్నాడు కృష్ణ.

అలా శ్యామల ఒంటికి తన ఒంటిని రాస్తూ జనంలో మధ్య మధ్య శ్యామల వక్షోజాలను ఎవరు చూడటం లేదని అనుకొన్నప్పుడు అదుముకొంటూ ఉద్రేకాన్ని అనుభవిస్తూ హాయిపొందుతున్నాడు కృష్ణ. శ్యామల కూడా తమనెవరూ పట్టించుకోనిచోట కృష్ణతో బహిరంగ శృంగారాన్ని ఆనందంగా, ఉద్రేకంగా అనుభవిస్తూ అతని చేతుల్ని తన చేతుల్లోకి తీసుకొని కలిపేయడం, కాళ్లని కాళ్లతో తాకుతూ ఊరు స్పర్శ చేస్తూ అతని ఉద్రేకంలో పాలుపంచుకొంది.

ఒక మనిషి పదడుగుల కంకాళం వేషం వేసుకొన్నాడు. అది మృత్యుతాండవ వేషం. ఆ కంకాళం కటిభాగం తన తలమీద వచ్చేలా ఏర్పాటు చేసుకొన్నాడు. తను నల్లటి ముసుగులో ప్రచ్ఛన్నంగా ఉండిపోయాడు. అతని ఎత్తు ఉన్నాయి ఆ కంకాళం కాళ్లు. దాని శిరస్సు అతని తలకి అయిదడుగుల ఎత్తున ఉంది. అది డాన్సు చేస్తుంటే మనిషి దాన్ని ఆడిస్తున్నట్టు లేదు. అదే ఆడుతున్నంత సహజంగా ఉంది. దానికి మొదటి బహుమతి వచ్చింది.

సాయంత్రం ఆరుగంటలకి ఇంటికి చేరుకొన్నారు. స్నానం చేసి వంటచేసుకొని తిన్నారు శ్యామల, కృష్ణ.

"మన గోవా కార్నివాల్ ఇలా ఉంటుందనుకోను" అన్నాడు కృష్ణ.

"మనది పవిత్ర భారతదేశం కదా!"

"ఇక్కడే ఉండిపోయేటట్టున్నారు" అంది శ్యామల.

★ ★ ★

కృష్ణ, శ్యామల ట్రినిడాడ్‌వచ్చి సంవత్సరం గడిచిపోయింది. అన్నికాలాలు చూశారు. చాలామంది స్నేహితులయ్యారు. కాలం నెమ్మదిగా గడవటం మానేసింది. శ్యామలకి తూనాపూనా షాపుల్లో బట్టలు అమ్మే భారతజాతికి చెందిన పశ్చిమ ఇండియను స్త్రీలు స్నేహం అయ్యారు. ఏదన్నా కొత్త చీరలకి పనికివచ్చే బట్ట కనిపిస్తే శ్యామలని పిలిచి చూపిస్తున్నారు. వీళ్లంతా డబ్బు బాగా ఉన్నవాళ్లు. క్యూరెస్‌లో మామిడిపళ్లు అమ్మే గొన్లమీద ఒణీలు వేసుకొనే ఇద్దరు స్త్రీలు కూడా శ్యామలకి పరిచయం అయ్యారు.

పెరట్లోఉన్న జూలీ జాతి మామిడిచెట్లు విపరీతంగా కాస్తుంటే మొదట్లో కృష్ణ కోసి స్నేహితులకి తీసుకువెళ్లి ఇచ్చి వస్తుండేవాడు. అప్పుడు కొందరు "మరీ ఇంత కొంచెం తెచ్చారేమండీ" అని నవ్వుతూ అడిగినట్టు మరి కొంచెం కావాలని తెలియజేశారు. కృష్ణకి పొడుగు కర్రతో వాటిని పైకి చూస్తూ కోస్తుంటే కాస్త మెడనొప్పి రాసాగింది.

దాంతో "కావలసినవాళ్లు మాఇంటికి వచ్చి ఫోంచేసి కావలసినన్ని కోసుకోండి" అని చెప్పాడు.

కొందరికి కోపాలు వచ్చాయి. "కొంచెం కోసి కార్లో వచ్చినపుడు తెస్తే అరిగిపోతారా?" అనుకున్నారు ప్రతివాళ్లు -"మాకు అయిదు కాయలు కోసేసరికి ఆయనకి మెడ నొప్పులు వస్తాయా! ఆయన తనకోసం వందలకొద్దీ కోసుకొంటుంటే వచ్చుంటుంది కాని" అని ఆలోచించారు. కృష్ణ, శ్యామల తాము తిన్నవి చాలా తక్కువ. వంచిపెట్టడానికి కోసినవే ఎక్కువ.

నరసింహం చెప్పాడు క్యూరెప్‌లో పళ్లమ్ముకునేవాళ్లకి చెప్తే వాళ్లేవచ్చి కోసుకొని డబ్బు ఇస్తారని. ఆ విధంగా తెలుసుకొని శ్యామల వాళ్లని కలుసుకొని మాట్లాడింది. జూలీ మామిడిపళ్లు అన్ని వళ్లలోకి ప్రసిద్ధమైనవి కనుక వాళ్ళు సంతోషంగా వచ్చి కోసుకొని వందుకి అర్ధ డాలరు చొప్పున ఇచ్చి డాలరుకి అమ్ముకొన్నారు.

ఆ విధంగా సంపాదించిన వెయ్యి డాలర్లని శ్యామల తూనాపూనా షాపుల్లో ఖర్చుపెట్టసాగింది. ఒకరోజున శారదని తీసుకొని బజారుకెళ్లింది. అక్కడ ఒక బట్టల కొట్టులో బట్టలు అమ్ముతున్న ఆవిడని చూసి శారద కంగారుపడిపోయి, "వెళ్లి పోదాం పద అక్కా" అని తొందరపెట్టసాగింది.

ఇంతల్లో షాపులో బట్టలమ్ముతున్న స్త్రీ వీళ్లనిచూసి, 'రండి శ్యామలా, శారదా!" అంటూ వీళ్లని ఆహ్వానించింది.

"లీలా... నీకు శారద తెలుసా" అని శ్యామల ఆశ్చర్యంగా అడిగింది.

"తెలియకపోవడం ఏమిటి? చౌదరి మా ఫామిలీ డాక్టరు" అంది లీల.

"ఫామిలీ డాక్టరు కాదు. దీని డాక్టరు" అని శారద తెలుగులో గొణుక్కుంది. శ్యామల తను తప్పువిన్నానా అని అనుమానపడింది. శారదకి లీల అంటే ఇష్టంలేదని, అందుకనే వెళ్లిపోడానికి తొందరపడ్తోందని గ్రహించి శ్యామల తొందరగా బయటపడింది. అక్కణ్ణుంచి శారదని దింపడానికి వాళ్లింటికి వెళ్లింది.

లీలను చూడగానే శారద మనస్సు పాడైనట్టు శ్యామల గ్రహించి, శారద కాఫీ కలిపి తీసుకురాగానే,

"లీల మంచిది కాదా" అని సూటిగా శారదని ప్రశ్నించింది. "ట్రీట్‌మెంట్‌కి డబ్బు ఇవ్వదా?"

"జబ్బెవరికి? ట్రీట్‌మెంటెవరికి?" అంది శారద కోపంగా.

"మీ ఆయన వాళ్ల కుటుంబానికి డాక్టర్ అంది కదా"

శారద మాట్లాడలేదు కాస్సేపు. తరువాత భోరుమని ఏడ్చేసింది. శ్యామల దగ్గరకు తీసు





కొని అనునయించింది. "అక్కా... మావాళ్లు తెలియక నాగొంతు కోశారు. ఈయనకి పెళ్ళికి ముందు ఇక్కడ చాలామంది ఆడవాళ్లతో సంబంధాలున్నాయట. మొదట్లో ఆ విషయం తెలిసి దగ్గరకు రానిచ్చేదాన్ని కాదు. తరువాత 'పెళ్ళికిముందు శారదా ఆ సంబంధాలు. పెళ్ల య్యాక వాళ్లెవరో నేనెవరో' అని ఆయన అంటే నమ్మాను. కొంచెం కొంచెం నెమ్మది నెమ్మదిగా అయనంటే నాకభిమానం ఏర్పడ్తుండగా ఈ రాక్షసి అసలు కనపడటం మానేశారేం డాక్టర్? అంటూ ఆస్పత్రికి వెళ్లి, అక్కడ ఆయన దీన్ని తప్పించుకొంటుంటే ఈమధ్య ఇంటికి రావటం మొదలుపెట్టింది. అది ఇంటికి రావటం మానేసేవరకు వేరువేరు పక్కలని ఆయన్తో చెప్పేశాను"

శారద కథ విని శ్యామల ఆశ్చర్యపోయింది. లీలకి భర్త పిల్లలు ఉన్నారే! పైగా శారదతో స్నేహంగా ఉండే ప్రయత్నం చేస్తోందే!

"మరి నీతో స్నేహంగా మాట్లాడిందే!" "దా నవసరం! దాని సరదా నాతో మంచిగాఉండి నన్ను ప్రసన్నం చేసుకొని నా మొగుణ్ణి నాతో పంచుకోవాలని చూస్తోంది - దొంగముండ" అంది శారద.

శ్యామల కాస్సేపు మౌనంగా ఉండి హితవు చెప్పింది శారదకి, "ఇమోషనల్గా ఉండ టంకంటే ప్రాక్టికల్గా ఉండటం మంచిది. నేను నాచురల్ సైన్సు స్టూడెంట్ని. నేను చెప్పేది కొంచెం భిన్నంగా ఉన్నా వినడానికి బాగోపోయినా విని ఆలోచించు. మీ ఆయనని నువ్వు దూరంగా ఉంచితే లీల తను కోరుకొ న్నది సాధించటం చాలా సులభం. సెక్సువ ల్గా మాడ్తున్న మొగాడు పతనం అవటం చాలా సులభం లేక అటువంటి మొగాణ్ణి ఏ స్త్రీ అయినా కోరుకొంటే పొందటం చాలా సు లభం. అదే సెక్సువల్గా తృప్తిపొందిన మొగ వాడు అంత సులభంగా రెచ్చగొట్టబడడు. కనుక నువ్వు లీల మీద సొడ్డు వేయదలచు కొంటే మీ ఆయన్ని దూరంగా ఉంచకు. వీలైతే రాత్రేగాకుండా పొద్దున్న ఆస్పత్రికి వెళ్లే ముందు కూడా నీతో సెక్సులో పాల్గొనేలా చూసు కో. అప్పుడు ఆస్పత్రిలో సిస్టర్సు అక్క చెల్ల ళ్లలా కనపడితీర్తారు"

ఆ సాయంత్రం కృష్ణకి చౌదరి, లీలల సంబంధం చెప్పింది.

కృష్ణ 'ఇక్కడ వ్యభిచారం ఇంత సింపులా!' అని ఆలోచనలో పడ్డాడు.

ఆ తరువాత కలిసినప్పుడు రెడ్డి చెప్పాడు- "చాలా సింపులే! చౌదరికి లీలతో సంబంధం పెళ్లి కాకముందునుంచి ఉంది. పెళ్లయ్యాక తను లీలని తప్పించుకుని తిరుగుతున్నాడని, అందుకే ఆమె ఇంటికి వస్తోందని శారదకి చెప్పిన కథ కాక్ ఎండ్ బుల్ స్టోరీ! లీల భర్తకి వీళ్లిద్దరి సంబంధం తెలును. అలాగే శారదకి తామిద్దరి సంబంధం తెలుసునని లీల అను కొంది. లీల భర్త చౌదరితో స్నేహంగా ఉన్నట్టే శారద తనతో స్నేహంగా ఎందుకుండదో లీల సింపుల్మైండ్కి అర్థంకాదు. ఇక్కడ ఆడదా న్ని 'వస్తావా?' అని అడిగితే వస్తుందో రాదో చెప్తుంది. కాని తప్పుగా అర్థంచేసుకొని కోప్పడ దు"

"చాలా ఈజీ అన్నమాట" అనుకొన్నాడు కృష్ణ. అతనికి లత గుర్తుకువచ్చింది ఆ క్షణా న్నే.

వేసంగి సెలవలిచ్చారు. కెనడాలో ఉన్న ఒక యూనివర్సిటీ, యూవికి ఎగ్రికల్చరల్ ఇంజినీరింగ్ కోర్సు నడపటంలోను అటు వంటివే మరికొన్ని కోర్సులు నడవటంలోను సహాయపడ్తోంది. ఆ సందర్భంలో ఆ యూనివ ర్సిటీ నుంచి కొంతమంది టీచర్లు ట్రినిడాడ్ వచ్చారు. అందులో బ్రూక్స్ అనే అతనితో కలిసి కొన్ని దీవులు తిరిగిరమ్మన్నారు కృష్ణని- ఆ దీవుల అవసరాలు తెలుసుకునే నిమిత్తం. మొత్తం ట్రిప్ అయిదురోజులే కనక శ్యామలని తీసుకువెళ్లటం పెట్టుకోలేదు. తనకైతే విమానం టికెట్లు, హోటల్లో చోటు అంతా కెనేడియన్లే చూసుకుంటారు. శ్యామలని తీసు కువెళ్తే తను ఏర్పాట్లుచూడాలి. తనకీదేశం కొత్త.

నరసింహం కుటుంబం, చౌదరి, శారద, నారాయణ "మేము శ్యామలని అయిదురోజు లు జాగ్రత్తగా చూసుకొంటాం అని హామీఇచ్చా రు. రాత్రిళ్ళు శ్యామల వెళ్ళి నరసింహంవాళ్ళ కుటుంబంతో పడుకునే ఏర్పాటు జరిగింది.




కృష్ణ విమానం ఎక్కడానికి వెళ్తుంటే నారాయణ "మీరు ఎక్కే విమానాల్ని ఎంలెండ్ హోవక్స్ అంటారు. అవి ఏప్రోలు. అవి టేకింగ్ ఆఫ్‌లో అంటుకోకపోతే లాండింగ్‌లో అంటుకొంటాయి. ఎందుకైనా మంచిది దూకెయ్యటానికి సిద్ధంగా ఉండండి. ఇంపార్టెంట్ డాక్యుమెంట్స్ దగ్గరే ఉంచుకోండి. ఇంతవరకు ప్రాణనష్టం జరిగిన దాఖలాలులేవు కాని ప్రతివాళ్ళు జీవితంలో ఒక్కసారైనా దూకటం అనుభవం పొందినవాళ్ళే" అని నవ్వుతూ హెచ్చరించాడు.

"ఈదేశంలో కారు డ్రైవ్‌చేస్తూ ఇంకా బతికే ఉన్నానుకదా! ఈ దీవుల మధ్య విమానాల్లో ప్రయాణంచేసి బతకలేకపోతానా చూద్దాం" అన్నాడు కృష్ణ తనూ నవ్వుతూ.

"శుభమా అని బయల్దేర్తూ ఏమిటీ మాటలు. క్షేమంగా వెళ్ళి..." అని శ్యామల అంటుంటే.

"లాభంగా ఎవర్నైనా వెంటపెట్టుకుని రానా?" అని కృష్ణ అడిగాడు.

శ్యామలకి ఆ క్షణాన్న కృష్ణమీద కోపంతెచ్చుకోబుద్ధికాలేదు "మీకా బుద్ధులు రమ్మన్నారావు లెండి" అంది.

"ఈయన శ్రీరామచంద్రుడే అయినా... ఇక్కడ చుప్పనాతి శూర్పణఖలు చాలామందే ఉంటారు. తస్మాత్ శ్యామలగారూ... జాగ్రత్త" అన్నాడు నారాయణ

"శూర్పణఖలతోపాటు వాళ్ళ అన్నలు రావణాసురులు ఉంటారు. అందుకని వాళ్ల ముక్కు చెవులజోలికి పోను" అంటూ హామీ ఇచ్చి కృష్ణ తన టాక్సీకేసి నడిచాడు, తన బాగ్‌తో.

"అంటే. శూర్పణఖల కోర్కె తీరుస్తానని అర్థమా!" అని శ్యామల ఆలోచనలో పడింది.

కృష్ణ టాక్సీలో ఎక్కికూర్చోగానే టాక్సీ కదిలింది. కృష్ణ శ్యామలకి చెయ్యూపాడు. దేశం కాని దేశంలో శ్యామలని ఒంటరిగా వదిలి వెళ్తున్నాడు.

నారాయణ వస్తున్నాను భయంలేదన్న"ట్టు నవ్వుతూ సౌంజ్ఞచేశాడు. 'అది భయంకాదు నాయనా బెంగ. పెళ్ళికానివాడివి నీకెలా అర్థం అవుతుంది' అనుకున్నాడు కృష్ణ. శ్యామల కళ్లల్లో నీరు తిరిగింది.

"ఏదో జోక్ చేశాను" అన్నాడు నారాయణ.

"నాకేమీ భయంలేదు"

"వస్తున్నామరి"

"ఉండి భోంచేసి వెళ్లండి"

"ఇప్పుడు పొద్దున్న తొమ్మిది అయింది. భోజనం అంటే కనీసం రెండుగంటలు ఆగాలి. కృష్ణగారు ఇంట్లో లేనప్పుడు నేను అంతసేపు ఇక్కడ ఉంటే ఈ దేశంలో వేరే అర్థంవస్తుంది"

నారాయణ సున్నితంగా ఉన్న ఇబ్బంది చెప్పాడు. అందులో తన మటుకు తనకి ఉండటానికి అభ్యంతరంలేదుకాని శ్యామలని అన్ని సాధకబాధకాలు తెలుసుకొని సిద్ధపడి మరీ భోజనానికి పిలవమన్నట్టుగా చెప్పాడు.

శ్యామల ఫరవాలేదు ఉండండి అనలేకపోయింది. నారాయణ వెళ్ళిపోయాడు. శ్యామల భోజనంచేసి పడుకొంది. టి.వి సాయంత్రంగాని రాదు. సాయంత్రం నరసింహం, లక్ష్మీవచ్చి తనను తీసుకువెళ్ళేదాకా తనకి పెద్దగా చెయ్యటానికి పనేంలేదు.

మధ్యాహ్నం మూడుగంటలవేళ గంట మోగింది. శారద వచ్చింది కాబోలు అనుకొని తలుపుతీసింది.

"నేను లోపలికి రావచ్చునా!" అంది లీల తలుపుదగ్గర నవ్వుతూ నిలుచుని.

తనకి లీలకి షాపులో పరిచయంఉన్నా ఇలా లీల తన ఇంటికి వచ్చేంతగా లేదు. అందుకని ఆశ్చర్యపోతూ,

"రండిరండి... ఏమిటి ఇలావచ్చారు?" అంది శ్యామల.

లీల లోపలికివచ్చి కూర్చుని, "మీరింకా సరైన ఫర్నిచర్ కొనుకున్నట్టులేదే?" అంది.

"డాక్టర్ ఫ్లాట్స్ ఏమో ఫుల్లీ ఫర్నిష్డ్. యూనివర్సిటీ క్వార్టర్స్ అన్ ఫర్నిష్డ్‌కదా! నెమ్మదిగా ఒక్కొక్కటే కొనుక్కుంటున్నాం" అంది.

"మీకేమన్నా కావాలంటే నాకు చెప్పండి. నాకు తెలిసినవాళ్ళున్నారు" అంది.

వ్యాపారానికి అవకాశం ఉంటే ఎట్టి పరిస్థితుల్లోను ఇక్కడి భారతీయులు వదులుకోరు-

అనుకొంది శ్యామల.

"అట్లాగే... అయినా మాకు జార్జిరామ్‌పర్సాద్ హెల్పుచేస్తూ ఉంటాడు"

"ఓ... మీ లత హస్బెండ్" అంది.

"అందులో మాలత ఏముంది!"

"మీ ఈస్టిండియన్! యు.విలో మీ ఆయన స్నేహితురాలు"

"యు.విలో మా ఆయనకికంటే ఇంటిదగ్గర నాకే ఎక్కువ స్నేహితురాలు" అంది. లీలధోరణి ఏదో శ్యామలకి నచ్చని భావం లీలగా గోచరించడం మొదలుపెట్టింది. బహుశా తను శారద శత్రువైన లీలని తన శత్రువుగా భావిస్తోందేమో. లీల శారదని కూడా శత్రువుగా భావించదనీ, చొదరితో సంబంధం ఆ దీవుల జీవన విధానానికి సంబంధించినదని శ్యామలకి గుర్తులేదు.

"పోన్లెండి...మీ ఆయన మిగిలిన దీవులు చూడటానికి వెళ్ళాడుట కదా!".

తెలిసే వచ్చిందన్నమాట. ఇంకా నయం. ఈ మహాతల్లి కృష్ణ కోసం రాలేదు. కాని లీల కృష్ణని వలలో వేసుకోడానికి తను ఛస్తే అవకాశం ఇవ్వదు.

"అవును వెళ్ళారు. రెండు మూడ్రోజుల్లో వస్తారు"

శ్యామల రెండుగ్లాసుల్లో బీరుపోసి అయిసు వేసి తీసుకువచ్చింది. శ్యామలకూడా ఆ దీవుల నాగరికతకి అలవాటు పడ్తోంది. ఎండలో సారెల్, లేక బీరు ఇవ్వటం, తాగటం వాళ్ల అలవాటు.

"థాంక్స్. మీరు ఒక్కరే కదా! రాత్రి మీకు ఏమన్న కంపెనీ కావాలేమో కదా!"

"నేను రాత్రి మా ఫ్రెండ్స్ ఇంటికి వెళ్ళి పడుక్కొంటాను"

"నారాయణ ఇంటికా!"

శ్యామల చురుగ్గా చూసింది.

"కాదు లక్ష్మి ఇంటికి. వాళ్ళ ఆయన ట్రిస్టోప్లాన్‌లో పన్చేస్తున్నారు. నాకు ఆవిడ తెలుసును. మీరు ఎప్పుడైనా ఇక్కడే వంటరిగా ఉండేటట్టయితే నాతో చెప్పండి. నేను సహాయం చేస్తాను."

"ఉండను. ఉన్నా సహాయం కావాలనుకోను. కావలసివస్తే శారదేవచ్చి పడుక్కొంటుంది. మీకా శ్రమ అక్కర్లేదు"

"సిల్లీ! నేను వచ్చి మీకు సహాయంగా పడుక్కుంటాననుకున్నారా! నేను మీకు మగ కంపెనీ ఎరేంజి చెయ్యగలను"

లీల అంత సూటిగా చెప్పేసరికి శ్యామల షాకు తింది.

"మీరంటున్నదేమిటి?" అంది శ్యామల ఆమె అంటున్నదేమిటో అర్థం అవుతూనే ఉన్నా!

"రాత్రిళ్ళు వయస్సులో ఉన్న వాళ్ళు వంటరిగా పడుక్కోవడం కష్టంకదా! అందుకని మీకు మగతోడు కావాలంటే ఏర్పాటుచేస్తాను అని అన్నాను" అంది.

"నువ్వు తార్పుడుకత్తెవి కూడానా తల్లీ!" అనుకొంది శ్యామల. లీల తార్పుడు కత్తె కాదు. ఒకవేళ శ్యామల కొత్త దేశంలో మనుష్యులు తెలియక ఇబ్బంది పడ్తుంటే సహాయం చెయ్యాలని వచ్చింది.

శ్యామల కోపంగా,

"థాంక్స్! నాకా అవసరంలేదు" అంది.

"మీ ఆయనకి కూడా నీ అబ్సెన్స్‌లో ఆ అవసరం ఉండదా!" అంది లీల శ్యామలకో పంచూసి అర్థంకాక.

"ఉండదు...ఉంటే నీకు తెలియజేస్తాను. నీ ఆఫర్ వాడుకొంటాను" అంది శ్యామల. "నువ్వే వద్దూ గాని" అన్న అర్థం సూచిస్తూ. శ్యామలకి కోపం వచ్చిందని లీలకి అర్థమైంది. కాని ఎందుకో అర్థంకాలేదు. తన వాల్యూస్ శ్యామల విలువలు ఒకటి కావని ఆమెకి అర్థంకాదు.

"అది కాదు శ్యామలా! మీ ఆయనిప్పుడు ట్రావెల్‌లో ఉన్నాడుకదా! హోటల్‌లో ఉంటాడుకదా! రాత్రి నిద్రపట్టకపోతే హోటల్‌వాళ్లని కంపెనీ ఎరేంజి చెయ్యమని కోరడా!"

"కోరడు. అది మాపద్ధతికాదు" అంది. ఆపైన లీలతో ఆ సంభాషణ పొడిగించటం ఇష్టంలేనట్టు మౌనం దాల్చింది. లీల వెళ్ళిపోయింది.

"కృష్ణ లీల చెప్పినవిధంగా కంపెనీ కోరు





కొంటాడా? అతనికి ఆ ఆలోచన రాకపోయినా మరెవరైనా అతని బుర్రలో ఆ ఆలోచన పెట్టారేమో! రాకరాక ఈ వెధవ దీవుల కెందుకొచ్చాంరా దేవుడా!" అనుకొంది.

లీల "నారాయణ ఇంటికి వెళ్తావా?" అని ఎంత సులభంగా అనేసిందో! నారాయణ నేనుంటే చుట్టూ జనం మరోలా అనుకొంటారు" అని సూచించాడే! ఎంత మంచివాడు కాకపోతే అల్లా అంటాడు.

నిజంగా మంచివాడేనా. అయితే "నేను భోంచెయ్యను వనుంది" అని వంకపెట్టి వెళ్లిపోకుండా ఆమాట ఎందుకంటారు! బహుశా "మీకా అపవాదు పడటంపట్ల అభ్యంతరం లేకపోతే చెప్పండి భోంచేసేపోతాను" అన్నట్టుగా అన్నాడేమో!

కొంపదీసి "అపవాదు వస్తుంది. దానివల్ల నాకేం భయంలేదు. దాన్ని నిజం చెయ్యటానికి కూడా నేను సిద్ధమే! మీ సంగతేమిటి?"అని తనకి నారాయణ ఓ ఫీలర్ వేశాడా? తను అందుకు సిద్ధపడకపోతే నారాయణ పెద్ద మనిషిలాగా వెళ్ళిపోయాడా? కృష్ణకి అతను "మీ ఆవిడని నేను చూసుకొంటాను" అని సౌంజ్ఞ చెయ్యటంలో అంతరార్థం ఉందా?

సెంటులూసియా విమానాశ్రయం ఒక కొండకి, సముద్రానికి మధ్యఉన్న సన్నటి ఇరుకుదారిగుండా వెళ్తే వచ్చింది. విమానం సముద్రంమీద గిరికీలు కొట్టి ఆ సన్నటి దారిలోకి మళ్లుతుంటే ఎందుకైనా మంచిదని దూకడానికి సిద్ధంగా కూర్చున్నాడు కృష్ణ.

విమానాశ్రయం నుంచి టాక్సీలో హెూటలుకు వెళ్లారు. అదో పెద్ద బంగళాలా ఉంది. వేడి దేశాల్లో తెల్లవాళ్లు కట్టుకున్న బాపతు. పెద్ద గదులు, ఎత్తు కప్పు వరండాలు. సముద్రపు గాలి చక్కగా వస్తోంది. మేడమీద పక్కపక్క గదులు తీసుకొన్నారు. గదికి ఎయిర్ కండిషనర్ ఉంది. కాని కిటికీ తలుపు తెరుచుకుంటే చక్కటి చల్లటి సముద్రపుగాలి వస్తోంది. దోమలు రాకుండా సన్నటి జల్లెడ తీగ వేశారు.

సాయింత్రం 5 గంటలకి కింద రెస్టారెంట్‌లో టీ తాగారు. బ్రూక్స్, కృష్ణలు. ఆపక్కనేఉన్న ఆటల గదిలో చీరలు కనిపించాయి. కృష్ణ టాక్సీ దగ్గర సెలవుతీసుకొని "రాత్రి భోజనానికి నేను రాకపోవచ్చును. నాకోసం వేచి ఉండవద్దు" అని చెప్పాడు.

బ్రూక్స్‌ని వదిలిపెట్టి ఆటల గదిలోకి వెళ్లాడు. అక్కడ ఇద్దరు ఆడవాళ్లు ఇద్దరు మగవాళ్లు చిన్నబల్లమీద స్నూకర్‌లాంటి ఆట ఆడుతున్నారు. వాళ్లలో వాళ్లు తెలుగు మాట్లాడుకొంటుంటే-

"మీరు తెలుగువాళ్లా?" అని కృష్ణ పలకరించాడు. "అవును మీరెక్కడ్నుంచి వచ్చారు?" అని అడిగారు.

చెప్పాడు కృష్ణ-

ఆదీవి కొంతకాలం డచ్‌వాళ్ల కింద మరి కొంతకాలం, ఫ్రెంచివారికింద, చివర ఇంగ్లీమ వాళ్లకింద ఉందని చెప్పారు. కబుర్లు చెప్తుంటే ఏడు గంటలైంది.

"మీరెక్కడ ఉంటున్నారు?" అని కృష్ణ అడిగాడు.

"ఈ హెూటల్లోనే ఫామిలీసూట్స్ ఉన్నాయి. అందులో ఉంటున్నాం. మీ భోజనం?" అని అడిగారు.

"ఈ హెూటల్లోనే తింటాను" అన్నాడు కృష్ణ. పదివేల మైళ్లదూరంలో తెలుగువాళ్లు తనని చూసి సంబరపడి రాత్రికి తమతో భోంచెయ్యమంటారనుకొన్నాడు.

"మంచిది మేము వెళ్తాం. మిమ్మల్ని కలుసుకొన్నందుకు సంతోషంగా ఉంది" అని కృష్ణ ఎక్కడ వెంటపడ్తాడో అని భయపడ్డట్టు గబగబా వెళ్లిపోయారు.

బహుశా సెంట్‌లూసియా వచ్చినప్పుడు వీళ్లని కూడా ఎవరూ మొదట్లో ఆదరించి ఉండరు. "మమ్మల్నెవరు కనుక్కొన్నారు మేముండలేదా! అలాగే కొత్తగా వచ్చినవాళ్లూ ఉంటారు" అనే ధోరణి వచ్చి ఉంటుంది. అప్పటికే ట్రినిడాడ్‌లో ఆ ధోరణికి అతను అలవాటుపడిఉన్నాడు. తన విషయంలోకాకపోయినా అందుకని బాధ పడలేదు.

ఎనిమిదింటికి భోజనానికి వెళ్లాడు. అక్కడ బ్రూక్స్ కూర్చుని భోంచేస్తున్నాడు. అన్నం కూరా తెమ్మని చెప్పాడు. అమర్చేవాడు తెచ్చి

పెట్టగానే దానిమీద జేబులోంచి ఓ చిన్న సిసా తీసి అందులో ఉన్న కారప్పొడి జల్లుకొన్నాడు. అది శ్యామల ఎందుకైనా మంచిదని ఇచ్చింది వెన్న కలుపుకున్నాడు. బ్రూక్స్‌ని "కావాలా? కొంచెం కారంగా ఉంటుంది" అని అడిగాడు.

"ప్రయాణాల్లో ఇండియన్ స్పైసెస్‌కి దూరంగా ఉంటాను. నాకిష్టమేగాని, మోషన్స్ అవుతాయి" అని నవ్వాడు.

ఇద్దరూ భోజనంచేసి ఆ మర్నాడు చూడవలసిన వాళ్లు, చూడవలసిన ప్రదేశాలు, మాట్లాడవలసిన విషయాలు ఒకసారి మననం చేసుకొన్నారు. ఎవరిగదులకి వాళ్లు వెళ్లి నిద్రపోయారు.

మర్నాడు పొద్దున్న నిద్రలేచి పళ్ళుతోముకొని స్నానం చేద్దామని చూస్తే షవర్‌కి విడిగా ఏర్పాటు లేదు. టబ్‌లోకే పెట్టిఉంది. ఈ టబ్‌లో నిలబడితే అది సమస్థలంకాక సబ్బుతో రుద్దుకోగానే ఎంతవాడికీ, ఎంత జాగ్రత్తగా ఉన్నా తూకంతప్పి కాలుజారుతుంది.

ఇక్కడ కాలుజారిపడి నడ్డివిరిగితే ఎవడు చూస్తాడు!

బ్రూక్స్ ఏంచేస్తున్నాడో అడిగితేపోలా! వాడుస్నానంచేయడేమో. ఈ వేడిదేశాల్లో స్నానం చేయకపోతే ఉడికిచస్తారు. ధైర్యంచేసి బ్రూక్స్ గది తలుపుతట్టి అడిగాడు.

"నీకు అయిదారు తువ్వాళ్ళిచ్చారేమో" అన్నాడాయన.

"ఇచ్చారు"

"అందులో నడుముచుట్టూ తిరగని చిన్నవి ఉంటాయే వాటిలో ఒకటి షవరుకింద టబ్‌లో వేసుకో, ఒకటి టబ్ అవతల నేలమీద కాళ్ళు తుడుచుకొనేందుకు వేసుకో"

"తెల్లటి తువ్వాళ్ళు కాళ్ళకింద వేసుకోనా!" ఆశ్చర్యంగా అడిగాడు కృష్ణ.

"అవి వళ్ళు తుడుచుకొనేవికావు"

కృష్ణ స్నానం చేశాడు. రెస్టారెంట్‌లో బ్రెడ్ ఆమ్లెట్‌తిని తయారయ్యాడు. బ్రూక్స్ కూడా తయారయ్యాక ఇద్దరు బయల్దేరి ఎగ్రికల్చరల్ అధికారుల్నీ ఇరిగేషన్ అధికారుల్నీ కలుసుకొన్నారు. పదకొండు గంటలకి బయల్దేరి అరటి తోటలకి వెళ్ళారు. అక్కడ వందలకొద్ది ఎకరాలలో అరటిచెట్లు పెంచుతున్నారు. వాటికి డ్రిప్ ఇరిగేషన్ పద్ధతిలో నీళ్ళుపెడుతున్నారు. అక్కడో తెలుగతను కనిపించాడు. ఈసారి అతను తెలుగువాడనేవిషయంవట్ల కృష్ణ పెద్దగా ఉత్సాహం చూపించలేదు. సరిగా ఎదిగి పండిన పళ్ళను అమెరికాకి ఎగుమతి చేస్తారుట. దేశానికి వచ్చే విదేశీద్రవ్యం అంతా దానిమీదే వస్తుందట.

అరటి చెట్లని ఎలాపెంచాలి, ఎలానరకాలి, ఎప్పుడు నరకాలి అంతా వివరించారు. దూట ఏంచేసుకొంటారో అనుకొన్నాడు. "ఎప్పుడైనా లేతది ఒకటి నేను ఇంటికి తీసుకువెళతాను" అన్నాడు ఆ తెలుగతను.

మెషినరీ అంతా ఏమేమి ఉన్నాయో పట్టిక తయారుచేశారు. వాటికి మెయింటెనెన్సు సమస్యలేమేమి ఉన్నాయో, స్పేర్‌పార్ట్స్ గొడవలు అన్నీ వ్రాసుకొని సాయంత్రానికి హొటల్‌కి చేరుకొన్నారు.

ఊళ్ళో అమెజాన్ ఉమెన్ సినిమా ఆడుతోంది. దాన్ని ఆ దీవిలో తీశారట. హొటల్లో ఉన్న తెలుగువాళ్ళు "ఆ సినిమాకి వెళ్తున్నాం" అన్నారు.

అందులో మీరు రండి అన్న ఆహ్వానంలేదు.

"వెళ్ళిరండి" అన్నాడు కృష్ణ నిర్లిప్తంగా.

ఆ రాత్రి భోజనం దగ్గర "టిప్ ఇవ్వటం ఎల్లాగా?" అని బ్రూక్స్‌ని అడిగాడు.

"నాకు కెనడియన్ పద్ధతి తెలుసు. మంచి నీళ్ల టేబుల్‌మీద గది ఖాళీచేసేటప్పుడు టిప్ వదిలిపెడతాం. హొటల్లో వర్కర్సు ఎలా పంచుకొంటారో వాళ్ళిష్టం" అన్నాడు.

మర్నాడు గది ఖాళీచేస్తుంటే కెరీబియన్ కామన్‌కరెన్సీలో అయిదు డాలర్లు టిప్ టేబుల్‌మీద వదిలిపెట్టాడు కృష్ణ.

* * *

ఏంటీగ్వా చేరుకొని హొటల్లో బసచేసుకొని బయల్దేరారు పన్నమీద. కొంతమంది ప్రభుత్వపు ఇంజనీర్లను కలుసుకొని ఆ దీవి తాలూకు అవసరాలు కనుక్కొన్నారు. మధ్యాహ్నం దగ్గర్లోఉన్న స్పానిష్ రెస్టారెంట్‌కి వెళ్ళా




రు. మెనూకార్డ్‌లో చికెన్‌రోటీ అని ఉంది.

కృష్ణ అది తింటానని చెప్పాడు. బ్రూక్స్ కూడా కొంచెం హెవీ అయినా తనూ అదే తింటానన్నాడు. కాస్సేపున్నాక స్ట్రే అమర్చే అమ్మాయివచ్చి కృష్ణతో "చికెన్ హలాల్ చికెన్ కాదుట ముందే చెప్పమన్నాడు వంటవాడు" అంది.

"కోడి హలాల్ కోడి కానట్టే, కృష్ణ తురకవాడుకాదు ఫరవాలేదు అనిచెప్పు" అన్నాడు.

కృష్ణ ఈ దీవుల్లో మతాలు కులాలు కలిసిపోయి దరిదాపుగా వంద సంవత్సరాలవుతున్నా కొత్తగా ఏర్పడిన సంపదతో సంస్కృతి మీద, మతంమీద మోజు ఎక్కువ అవటం చాలా సార్లు గమనించాడు. భారతజాతికి చెందిన ముస్లిమ్ భారత జాతికి చెందిన హిందువునో క్రిస్టియన్నో పెళ్ళి చేసుకొంటాడు కాని ఆఫ్రికన్‌జాతికి చెందిన ముస్లిమ్‌ని పెళ్ళి చేసుకోడు. కాని అతని కోడి మాత్రం ఖురాన్ చదువుతూ చంపిన 'హలాల్' కోడి అయి ఉండాలి. ఆ విధంగా చంపేవాడు హిందువు, క్రిస్టియన్ కాకుండా ఉండాలి.

భోజనానంతరం మళ్ళీ కొద్దిగా వచ్చిన పని చూసుకొని సముద్రతీరానికి వ్యాహాళికి బయల్దేరారు. దార్లో జెట్టీలదగ్గర కొంతమంది భారతీయులు, ఆఫ్రికన్లు చింతగింజలు బదులు గోళీలుపెట్టి 'వామనగుంటలు' ఆడుతుంటే కృష్ణ ఆశ్చర్యంగా "ఈ ఆటనేమంటారు?" అని అడిగాడు.

"వేమన్" అని చెప్పారు వాళ్ళు.

"ఇది బహుశా మా తెలుగు పూర్వీకులు ఈ దీవులకిచ్చిన వారసత్వంఅయి ఉంటుంది" అన్నాడు కృష్ణ బ్రూక్స్‌తో.

"ఇక్కడ తెలుగువాళ్ళుండేవారా?" అని అడిగాడు కృష్ణ భారతజాతీయుల్ని.

"మా తాత మద్రాసీ" అన్నాడు అందులో ఒక కుర్రాడు.

"నీపేరు"

"శామ్ శామ్‌నూప్‌నేని" అన్నాడు.

"రెండు శామ్‌లు ఏమిటి?" అని కృష్ణ అడిగితే-

"మొదట శామ్ క్రిస్టియన్ నేమ్ రెండోది కిష్ నయ్యాస్ నేమ్" అని జవాబిచ్చాడు.

శ్యామ్‌కొచ్చిన తిప్పలుగామోను! నూప్‌నేని బహుశా నూరవనేని అయి ఉండవచ్చు!

కృష్ణ వెళ్తూ వెళ్తూ "నువ్వు తెలుగువాడివి నేనూ తెలుగువాడినే" అని చెప్పాడు.

"హేపీమాన్! నువ్వూ మద్రాసీవేనన్న మాట" అన్నాడు ఆ కుర్రాడు. ఆ కుర్రాడు మద్రాసీ అన్నమాట అవమానకరంగా భావించడం లేదు. అది తన భావగాతలచి గౌరవంగా ఆనందంగా స్వీకరిస్తున్నాడు.

తెలుగువాళ్ళకి మద్రాసీ అన్నపదం తిట్టులా వినిపిస్తుందన్న జ్ఞానం ఆ అమాయకుడికి కలిగించి బాధపెట్టడం శుద్ధ అనవసరం అని అనిపించి అతనిచేతులు ప్రేమగా కుదిపి సెలవు తీసుకొన్నాడు. ఈ 'మద్రాసీ' తెలుగువాడు కలిగించిన ఆనందం, సెంట్ లూసియాలోని పదహారణాల తెలుగువాళ్ళు కలిగించలేదనుకొన్నాడు.

అక్కడ ఎక్స్‌పెక్టేషన్సు ఉన్నాయి. ఆశాభంగం కలిగింది. ఇక్కడ ఆశించింది లేదు. కనుక నిర్మలమైన ప్రేమ విరిసింది చేతులు కలుపుకొన్న కాస్సేపు.

బ్రూక్స్, "మీ ఇండియన్లకి సెంటిమెంట్లెక్కువ" అన్నాడు.

"ఇండియన్లెక్కడికి వెళ్లినా ఆదేశంలో కష్టపడి పనిచేసిదాన్ని సంపన్నం చెయ్యాలని వెళ్లారు. తెల్లవాళ్లు ఎక్కడికి వెళ్ళినా దాన్ని దోచుకోవాలని వెళ్లారు. సెంటిమెంటున్నజాతికి, లేని జాతికి అదే తేడా" అన్నాడు.

బ్రూక్స్ మాట్లాడలేదు. ఈ విషయం గురించి సాయంత్రం జరిగిన చర్చలో ఈ విషయం ఎత్తాడు.

బ్రూక్స్, కృష్ణ అక్కడనుంచి బీచ్‌కి వెళ్లారు. బీచిలన్నీ అమెరికన్లతో నిండిఉన్నాయి.

"టూరిజమ్ ఈ ద్వీపవాసులకి ముఖ్యమైన జీవనాధారం" అన్నాడు బ్రూక్స్.

లావాటి అమెరికన్లు తెల్లగా పాలిపోయినట్టుండే అమెరికన్లు చర్మం చామనచాయగా మార్చుకోడానికి రానుపోను కుదుర్చుకొన్న విమానాల్లో ఈ దీవులకి వస్తారు. ఒకళ్లో ఆరో

అందంగా ఉన్నవాళ్లు లేకపోలేదు ఆ బీచిలో.

"తోలు పరిశ్రమ జోరుగా సాగుతోంది" అన్నాడు కృష్ణ బ్రూక్స్‌తో నవ్వుతూ.

ఆడవాళ్లు చనుకట్టులు నడలించుకొని బోర్లావడుకున్నారు. వాళ్ల భర్తలు వాళ్ల చర్మం 'టాన్' అయ్యేందుకుగాను తైలాలు మర్దిస్తున్నారు. అది చూసి ఆ మాట అన్నాడు కృష్ణ.

"మీకున్నలాంటి స్కిన్ ఉండటం అదృష్టం. మాకు అంతటి మంచిచర్మం దేవుడివ్వలేదు కదా" అన్నాడు.

"మీ చల్లటి దేశాల్లో దేవుడిచ్చినా నిలవదు కదా!"

"ఎందుకు నిలవదు? బ్లాక్స్‌కి ఎన్ని వందల నంవత్సరాలు నిలవలేదు! ఇండియాలో తెల్లటివాళ్లు లేరూ?"

"మీరేమో మీ తోలు 'టాన్' చేసుకోడానికి బాధపడ్తారు. మేమేమో మా తోలు తెల్లబరుచుకోవాలని చూస్తాం. తెల్లతోలు ఎన్ని లోపాలైనా కప్పెడ్తుంది అనుకొంటాం. ఛిద్రనిదైతే ఏడువు మొహందైనా పెళ్లాడ్తాం. నల్లని నగుమోముదైనా పెళ్లాడం మేము"

"మీ ఆవిడ నల్లగాను చాలా అందంగాను ఉంది. నీ సూత్రం ప్రకారం నువ్వు ఆమెని పెళ్లాడకూడదు కదా"

"నేను ఉలిపికట్టెను. మా ఆవిడ నాకళ్లకి కూడా అందంగానే ఉంటుంది. నన్ను ఏంచూసి చేసుకొన్నావ్ అని అడిగినవాళ్లు లేకపోలేదు"

"నాకు మాత్రం దేవుడు మంచిరంగు మీకు, రెడ్ ఇండియన్లకి, స్పానిష్‌వాళ్లకి ఇచ్చాడనిపిస్తుంది" బ్రూక్స్ మాటల్లో దేవుడివ్వటం అన్నమాట రెండోసారి వచ్చింది.

అతనికి వసంత చెప్పిన కథ గుర్తుకువచ్చింది. "మా స్నేహితుడికూతురు ఓ కథ చెప్పింది. దేవుడు మనుమలబొమ్మలు చేసి కాల్చాడుట. అవి నల్లగా మాడిపోయాయిట- ఆ మనుమలు ఆఫ్రికన్లట. మనుమలు ఆ రంగులో తేలినందుకు చింతించి ఆ తరువాత వాటి బొమ్మల్ని అతిజాగ్రత్తపడి కాలకముందే తీసేశాడు. అవి ఏ రంగూ కళాలేకుండా తయారయ్యాయిట- ఆ మనుమలు యూరపియన్లట. తరువాత కాలిస్తే నరైన రంగులో వచ్చాయట- అవి ఇండియన్లట" అని ఆ కథ బ్రూక్స్‌కి చెప్పాడు.

"నిజమే కాబోలు" అన్నాడు బ్రూక్స్.

బీచ్‌లో నడుస్తుంటే, "దిగంబరంగా తిరగడం స్నానాలు చెయ్యటం నిషిద్ధం" అని బోర్డులు పెట్టి వున్నాయి. ఈ దీవుల్లో కూడా నిషిద్ధమైనవి వున్నాయి. అవి అమెరికన్లు చేస్తారని వీళ్ల భయం.

పీలికలు కట్టుకొని దరిదాపుగా నగ్నంగా తిరుగుతున్నారు జనం. కొందరు స్త్రీలు డ్రాయరు మీద వలుచటి వదులు బనియన్లు వేసుకుని తిరుగుతున్నారు. అలా తిరుగుతున్నవాళ్లలో వున్న వాళ్లకి బనియన్ల మీద అలలు లేచి వస్తున్నాయి, వాళ్ల కదలికకి లయగా.

సాయంత్రం టీ నమయానికి హొటలు జేరుకున్నారు. హొటలు యజమాని వచ్చి పలకరించి తనూ వాళ్లతో టీ తీనుకొంటూ కబుర్లుచెప్పసాగాడు.

"డిన్నర్ ఇక్కడే తింటారా?"

"తింటాం. ఏం అలా అడిగారు?"

"పొద్దున్న బయట తిన్నారుకదా!"

"వన్లమీద వెళ్లాం కదా!"

"మీకు ఇండియన్ భోజనం కావాలా?"

"ఆయన నంగతి నాకు తెలియదు. ఉంటే నాకు కావాలి" అన్నాడు కృష్ణ.

"నేనూ తింటాను" అన్నాడు బ్రూక్స్.

"కాని పూర్తిగా శాఖాహారం" అన్నాడు హొటలు యజమాని.

"ఈ హొటల్లో మాంసాహారం ఉండదా?" అని కృష్ణ అడిగితే "మాంసాహారం వండేవాళ్ళు నాలాగా ఆఫ్రికన్లు. వాళ్లకి ఇండియన్ భోజనం వండటం రాదు. ఇండియన్ భోజనం వండి పెట్టేవాళ్ళు మహారాజ్‌లు - వాళ్లు మాంనం వండరు"

"ఇండియాలో మాంసాహారులు శాఖాహారులు అని రెండురకాలు. అందుకని మాంనం తినేవాళ్ళం కూడా రోజూ తినం. కనక నాకు ఇండియన్ శాఖాహారం కావాలి వండించండి" అని




కోరాడు కృష్ణ.

"రేపు కృష్ణ, నేను విడిపోతున్నాం! కలిసి చేసే చివరి భోజనం ఈ రాత్రిది. అందుకని నేను భారతీయ శాఖాహారమే తింటాను" అన్నాడు బ్రూక్స్.

ఆ యజమాని రాత్రి పప్పు, అన్నం, తోట కూర కూర, పచ్చడి, పెరుగులను భోజనం తనే వడ్డించాడు. తృప్తిగా భోంచేసి కృష్ణ "అన్నదాతా సుఖీభవ" అన్నాడు తమాషాకి.

లోపలినుంచి ఓ స్త్రీ వచ్చి కృష్ణకి నమస్కరించింది ఆశీర్వదించమని.

"మై వైఫ్, తనే వండింది. బ్లెస్ హర్" అన్నాడు యజమాని.

"మీ ఆవిడ బ్రాహ్మిణ్!" కృష్ణ ఆశ్చర్యంగా అడిగాడు.

"అవును"

"మనదేశం నుంచి వచ్చినవాడికి నా చేత్తో అన్నం పెట్టగలిగాను. చాలా సంతోషంగా వుంది. ఆశీర్వదించండి" అంది ఆమె. ఆమెకి నలభై సంవత్సరాలుంటాయి. ఫ్రాక్‌మీద ఓణి వేసుకొంది.

"అన్నపూర్ణా... నేను సంస్కృతం చదువుకొన్నాను. కాని మహారాజ్‌ని కాను. మీరు బ్రాహ్మణస్త్రీయలు - ఎలా ఆశీర్వదించను? పైగా చిస్త్రీలు మీకంటే?" అన్నాడు కృష్ణ.

"అతిథి దేవుడితో సమానం అనేది మా అమ్మ... దీవించండి!" అంది.

"మీ కాపురం పిల్లా పాపలతో కలకలలాడాలి. మీ ఆయన వ్యాపారం సవ్యంగా సాగాలి అని దీవిస్తున్నాను" అన్నాడు కృష్ణ.

ఆ స్త్రీ మళ్లీ లోపలికి వెళ్లిపోయింది.

"ఈ పెళ్లి జరగటం ఆశ్చర్యకరమైన విషయం" అన్నాడు కృష్ణ ఆ యజమానితో.

"నాకు భారతీయ స్త్రీలు అంటే ఇష్టం. పెళ్లికి కట్టుబడి వుంటారు. భర్తని సుఖపెట్టారు స్వసుఖం వదులుకునైనా. ఐలవ్ మైవైఫ్. తనని తన దేశంవాళ్ళు వెలివేశారు"

ఏ శంకాలేకుండా వ్యభిచారం కూడా సాగించే ఈవిడను వెలివేశారా? స్వజాతి మధ్య వివాహం, వ్యభిచారం కూడా సమ్మతమే కాబోలు. ఆఫ్రికన్లతో వివాహం మాత్రం ఒప్పుకోరు.

"తన చేత్తో వండి తన జాతివాళ్ళకి భోజనం పెట్టాలని మా ఆవిడ కోర్కె. నా భార్య అని చెప్తే నువ్వు తినవేమోనని చెప్పలేదు. ఇంతకూ నా భార్యని ఏదో అనా అని పిలిచావు - ఏమిటది?"

"అన్నపూర్ణ హిందువులకి అతి పవిత్రమైన కాశీలో ఉండే విశ్వేశ్వరుడి భార్య. మేము పూజించే దైవం. అన్నంపెట్టిన చల్లని తల్లులని ఆమెతో పోలుస్తాం!"

"థాంక్స్ మాన్... మీ దేశంలో మీకు కొంత మందైనా స్త్రీలు అమ్మల్లా కనిపిస్తున్నారు. మా నాగరికతలో అమ్మకూడా అప్పుడప్పుడు మాకు ఆడదిలాగా కనిపిస్తుంది"

బ్రూక్స్ ఈ సెంటిమెంటల్ సంభాషణలో పాలుపంచుకోలేదు.

భోంచేసి తమ గదులకి వెళ్లారు. కృష్ణ కాస్సేపు పనిచూసుకొని బ్రూక్స్ గది తలుపు కొట్టాడు. బ్రూక్స్ తలుపు తెరిచి "రా... నేనే నీదగ్గరకు వద్దామనుకొంటున్నాను. మన టూర్ గురించి రిపోర్ట్ రాయాలి కదా! నువ్వు రాస్తావా, నన్ను రాయమన్నావా, అని అడగటానికి రాబోతున్నాను. నువ్వే వచ్చావు" అన్నాడు.

కృష్ణ కూర్చుని, "ఆ రిపోర్ట్ ఏదో నువ్వే రాయి. అది నిజానికి వెస్ట్ఇండీస్‌కి సంబంధించినది- నీది కాదు నాదికాదు. యూనివర్సిటీవాళ్లు వాళ్ల దీవులవాళ్ల నెవరినన్నా పంపించి ఉంటే బావుండేది. నేను ఇవాళ ఉంటాను రేపు మాదేశం పోతాను. వాళ్లు మహాబద్ధకస్తులు. వాళ్లపనులు కూడా ఇతర్ల చేత చేయించాలని చూస్తారు. గవర్నమెంట్ హాస్పిటల్స్ రోగుల్ని మాదేశస్తులు చూస్తారు. ఈ దేశస్తులు జీతాలు పుచ్చుకొంటూ ఆస్పత్రులకి వెళ్లక ప్రైవేటు ప్రాక్టీస్ చేసుకొంటారు. అలాగే యు.విలోని ఇంజినీరింగ్ ఫాకల్టీలోని వెస్టు ఇండియన్సు తాగుడుతోను, కన్సల్టెన్సీతోను బిజీగా ఉంటారు. ఇలాంటి లాభంలేని పనులకి నాలాంటివాళ్లను పంపుతారు" అన్నాడు.

"మరి అలా అయితే ఈ పని నాదీ కాదు కదా!" అన్నాడు బ్రూక్స్.

"నాకంతకాకపోలేదు నీకు. మీది ఎయిడ్ ఇస్తున్న దేశం. వాళ్లది పుచ్చుకొంటున్న దేశం. అది సద్వినియోగం అవాలని మీరనుకొంటే మీరు కొంత కష్టపడాలి. ఎందుకంటే వాళ్లు పడరు కనక"

"నువ్వు కనీసం రెండు మూడు కాంట్రాక్టుల కాలం పనిచేస్తావనుకొంటున్నాను... తప్పా"

"నేను ఏడాది క్రితం వచ్చాను. నాది మూడు ఎకడమిక్ ఇయర్‌ల కంట్రాక్ట్. ఇది వచ్చే జూన్‌కి కాంట్రాక్ట్ అయిపోతుంది. బహుశా వెళ్లిపోతాను"

"ఎందుకని వెళ్లిపోవాలనుకొంటున్నావు?"

"ఇండియాలో మా అమ్మానాన్నా ఉన్నారు. వాళ్లని వాళ్ల ముసలితనంలో చూసుకోవాల్సిన బాధ్యత నాపై ఉంది" ఆ మాట కృష్ణ గర్వంగా అన్నాడు. "మాదేశంలో మేము ముసలివాళ్లని వీధుల్లో వదిలెయ్యం. ఆపేక్షగా చూసుకొంటాం" అన్న గర్వం ఉంది. "మీరు వదిలేస్తారు" అన్న అభిప్రాయం ఉంది. ఆమాట అన్నాక కృష్ణ తన అభిప్రాయాన్ని నాజూకుగా "మీ దేశంలో ముసలివాళ్లని మీరు మీతో ఉంచుకొంటారా?" అన్న ప్రశ్నద్వారా వ్యక్తపరిచాడు. ఉంచుకోరన్న విషయం గురించి తను తెగవిన్నాడు. బ్రూక్స్‌లాంటివారికంటే తను ఉన్నతుడు. తలిదండ్రులని తనతో ఉంచుకొంటాడు- అదీ అతని అభిప్రాయం.

"అందరి సంగతి నాకు తెలియదు. ప్రస్తుతం నాతల్లిదండ్రులు వయస్సులో ఉన్నారు. మానాన్న అరవై రెండేళ్లవాడు. మా అమ్మ అరవై ఏళ్లది. వాళ్లు విడిగా వాళ్ల స్నేహితులున్న ఊళ్లో ఉంటున్నారు. సెలవలకి నేను వెళ్లి కొద్ది రోజులు ఉంటాను. కొన్నిసార్లు భార్యాపిల్లలతో వెళ్తాను. అన్నిసార్లు నేను నాకుటుంబాన్ని తీసుకువెళ్తే మా అమ్మకి శ్రమ. అలాగే వాళ్లు కొన్నిసార్లు మా ఇంటికి వస్తారు. కాని మానాన్నకి ఏడెబ్బయ్ సంవత్సరాల వయస్సొచ్చాక బహుశా వాళ్లు ఆ ఊళ్లో ఉండరు. నేను ఎక్కడ ఉంటే అక్కడ ఓ ఇల్లు తీసుకుని కాపురంపెడతారు"

"నీతో ఉండరా? నువ్వు ఉండనివ్వవా?"

"వాళ్లు ఉండరు. నేను ఉంచుకోను. వాళ్లు నాతోనే ఉండాలంటే ఎకామిడేషన్ అంత పెద్దది దొరకదు. నాభార్య అంత చాకిరి చెయ్యలేదు. నాపిల్లలకి ఎదిగే వయస్సు. విడిగదులుండాలి. వాళ్ల ఏక్టివిటీస్‌కి సరిపడే వాతావరణం ఇంట్లో లేకపోతే చదువుసాగదు. ఆపైన వాళ్లే ఎలాగో వెళ్లిపోతారు. కాని నాఊళ్లోనే నాతల్లిదండ్రులుంటే వాళ్లకి ఏదైనా వంట్లో బాగుండకపోయినా అవసరం వచ్చినా నేను వెళ్లి చూసుకోగలను. డాక్టర్లని నర్సులని ఏర్పాటుచెయ్యగలను. అలా చేస్తూఉంటే ఎవరం కూడా మామా స్వతంత్రాలు పోగొట్టుకోనక్కర్లేదు. ఒకళ్లనొకళ్లు ఆ కారణంగా విసుక్కోనక్కర్లేదు" అన్నాడు బ్రూక్స్.

"ఐసీ!" అన్నాడు కృష్ణ ఏమనాలో తెలియక.

"అయితే నేను రిపోర్ట్ రాస్తాను... సరేనా!" అన్నాడు బ్రూక్స్.

"సరే"

"రాసి నీ ఎప్రూవల్‌కి పంపుతాను"

"అది నీయిష్టం. రిపోర్ట్ నువ్వు కష్టపడి రాసినప్పుడు మధ్య నాబోడి ఎప్రూవల్ ఎందుకు"

"ఇద్దరం కలిసి టూర్ చేసాం కదా! పైగా నేను మర్చిపోయిన పాయింట్లుంటే నువ్వు కలపవచ్చు"

"సరే- గుడ్‌నైట్" అని చెప్పి గదికి వచ్చేశాడు కృష్ణ.

హోటల్ యజమాని, అతనిభార్య చాలా మంది హిందువులకంటే ఎంతో అన్యోన్యంగా ఉన్నారని, వాళ్ల విలువలు ఎవరి విలువలకి తీసిపోవని అనుకున్నాడు కృష్ణ పక్కమీద పడుకొని.

బ్రూక్స్ తన తల్లిదండ్రులపట్ల అవలంభిస్తున్న వైఖరిలోనే పరిస్థితుల రీత్యా అనుసరించడానికి చాలా వీలైనది. అనుసరించడానికి చాలా కష్టమైనది భారతీయుల పద్ధతి. అత్తా కోడళ్ల మధ్య పొరపొచ్చాలు రావటం చాలా సహజం. కృష్ణ సాధ్యమైనది తలపెట్టి కొనసాగించలేక విడిచిపెట్టలేక తిట్టుకొంటూ కలిసి ఉంటూ "కలిసి ఉంటే కలదు సుఖం" అంటూ పాటపాడితే సరిపోతుందా? అనుసరణీయాలు అనుసరసాధ్యాలు కావాలి. మన





సంస్కృతిలో కన్నీళ్లకి, గాలికబుర్లకి కాకరకాయలకి ఉన్న విలువ అనుసరసాధ్య విధానాలకి లేదు. తన చుట్టూలే ఎంతమంది ఇళ్లల్లో తల్లిదండ్రులతో వేగలేకపోతున్నాం అని చెప్పటం లేదు!

మరో మార్గం లేకపోతే అందరూ పతివ్రతలే! మనసులో తల్లిదండ్రుల బెడద ఎలా వదుల్చుకోవటమా అని ఆలోచిస్తూ అది కుదిరే అవకాశం లేక "మా సంస్కృతిలో వాళ్లని వాళ్ల మానాన వదలం" అంటూ కబుర్లు చెప్తాం. ఇలా ఆలోచిస్తూ కృష్ణ నిద్రపోయాడు.

ఆ మర్నాడు బ్రూక్స్ దగ్గర సెలవుతీసుకొని కృష్ణ ట్రినిడాడ్ బయల్దేరాడు. బ్రూక్స్ కెనడా బయల్దేరాడు.




కృష్ణ తిరిగి ట్రినిడాడ్ చేరుకొన్నాడు. శ్యామల అతను వెళ్లినరోజున లీల వచ్చిందని చెప్పి తనకి లీల కంపెనీ కావాలంటే ఏర్పాటు చేస్తానందని చెప్పింది మాటల సందర్భంలో

"ఏమన్నావు?"

"మా ఆయన దేశాలు పట్టుకుపోయారు కదా! ఆయన అక్కడ కంపెనీ వెతుక్కున్నట్టు తెలిస్తే అప్పుడు ఇక్కడ నేను కంపెనీ వెతుక్కుంటాను. నాకు చేతకాకపోతే నీకు కబురు పెడ్తాను" అన్నాను.

"అలాంటిదానివే!"

"నాపేరు సీత, అనసూయ కాదు శ్యామల" అంది శ్యామల నవ్వుతూ. కృష్ణవచ్చిన రోజు సాయంత్రం ప్రసాద్ వచ్చాడు. ప్రసాద్ రావటం అదే మొదటిసారి.

"రండి రండి... ఏమిటి విశేషం?" అంటూ కృష్ణ ఆహ్వానించాడు.

"విశేషమే" అన్నాడు కూర్చుంటూ.

"ఏమిటి ఆ విశేషం- మిమ్మల్ని శ్రమ తీసుకొని మా ఇంటికి వచ్చేలా చేసింది?"

"నాకు వచ్చే ఆదివారం సెంట్‌జేమ్స్‌లో ఉన్న కృష్ణుడిగుడిలో పెళ్లి"

"ఇక్కడి అమ్మాయా?"

"అవును... మా హాస్పిటల్‌లో నర్సు. మీరు, శ్యామలగారు తప్పకుండా రావాలి" అని అతను ఆహ్వానపత్రిక ఇచ్చారు.

"అయితే మనం సెలెబ్రేట్ చేసుకోవాలి మరి" అని కృష్ణ ఫ్రిజ్‌లోంచి చల్లటి బీరుసీసాలు తీసి శ్యామలకి, ప్రసాద్‌కి ఇచ్చి తను కూడా తీసుకొని, "మీ వైవాహిక జీవితానికి" అని చెప్పాడు.

"నా బానిసత్వానికి ... ఇవే నా స్వేచ్ఛాజీవితానికి బార్లీ ఉదకాలు"

"పెళ్లి చేసుకొంటూ... కష్టపడిపోతున్నట్టు కబుర్లు చెప్పటం మగవాళ్లకే చెల్లింది" అంది శ్యామల.

ప్రసాద్ నవ్వేసి, "ఇంకా పిలవవలసినవాళ్లు చాలామంది ఉన్నారు- సెలవు" అని వెళ్లిపోయాడు.

అతను వెళ్లేక అతని శుభలేఖ తీరుబడిగా తీసి చదివారు. పెళ్లికూతురుపేరు స్నేహ. శుభలేఖ వెనకాతలవేపు గిఫ్ట్స్ ఇవ్వదలుచుకొన్నవాళ్లకి సూచన ఉంది. అది "మాకు కావలసిన వస్తువులు వాల్సైన్ డిపార్ట్‌మెంటల్ స్టోర్స్‌లో ఉన్నాయి. వాళ్లకి ఆ లిస్టు ఇచ్చాం. కనక దయచేసి అక్కడే కొనండి" అని. దయచేసి ప్రెజెంట్స్ తీసుకురాకండి అని భారతదేశంలోలాకాక తీసుకువస్తే ఫలానా షాపు నుంచి తీసుకురండి అని ఉంది. ఇదేదో తమాషాగా ఉందే అనుకొన్నారు.

ఆ మర్నాడు శ్యామల, కృష్ణ ఆ షాపింగ్ సెంటర్‌కి వెళ్లి అక్కడ ఆ డిపార్ట్‌మెంటల్ స్టోరు వెతికి పట్టుకొన్నారు. ఆ షాపులోని అమ్మకాల అమ్మాయి "సన్నేస్ వెడ్డింగ్?" అని అడిగింది. స్నేహ అన్న పేరు ఔత్తరాహికుల లాగ సన్నే(హ) అని పలుకుతూ.

"ప్రసాద్స్" అన్నాడు కృష్ణ.

"సేమ్" అంటూ ఒక లిస్టు తెచ్చింది.

ఆ లిస్టులో ప్రసాద్‌కి, స్నేహకి కావలసిన వస్తువుల పేర్లు- వాటి ధరలు రాసి ఉన్నాయి. కొన్నిటికి ఎదురుగా టిక్కులు పెట్టి ఉన్నాయి. అవి అప్పటికే ఎవరో తమ గిఫ్టులుగా ఎన్నుకొన్నారుట. "మీరు ఏధరలో ఇవ్వదలుచుకొన్నారో ఆ ధరల్లో, ఉన్న వస్తువుల్లో ఒకటిగాని రెండుగాని ఎంపిక చేసుకోండి" అంది అమ్మాయి.

"మనవని చాలా సులభం చేశారు" అంది శ్యామల.

"మరే- ఇండియాలో అయితే ఏం కొనాలని బుర్రబద్దలు కొట్టుకొని తీరాఇస్తే అవి నవ దంపతులకి రెండో మూడో రావటం జరుగుతూ ఉంటుంది. ఈ పద్ధతిలో వాళ్ళకి ఏంకావాలో వాళ్ళే చెప్పేశారు. కొనేవాళ్ళందరు ఒకేషాపులో కొనటంవల్ల ఇద్దరు ముగ్గురు ఒకే వస్తువు కొనే అవకాశం లేదు. మన అబ్బాయి సోమలింగం పెళ్ళికి ఇదే ఏర్పాటుచేస్తాను" అన్నాడు కృష్ణ శ్యామలతో.

"అలుచూలూ లేదు అని సామెత" అంది శ్యామల నవ్వుతూ.

"నాకు అలుంది. చూలెంతసేపు చేతిలో పని".

"చాల్లెండి సరసం" అంది శ్యామల సిగ్గుపడుతూ.

"హిందీ?" అని అడిగింది.

"కాదు మద్రాసీ!" అన్నాడు కృష్ణ. శ్యామల కోపంగా చూసింది.

"ఆమెకర్థమయ్యే భాషపేరు చెప్పాను" అన్నాడు కృష్ణ. కృష్ణకి మద్రాసీ అనే మాటపట్ల ఆసక్తి పెరుగుతోంది.

వాళ్ళకి నచ్చిన ధరలు రెండు వస్తువులు టిక్ చేశారు. ఆ పిల్ల రసీదు ఇచ్చి ఒక కార్డు తెచ్చి ఇచ్చింది. అందులో ఆ వస్తువులు ఎవరు ఇచ్చారో వారి చిరునామా సంతకం నింపమని ఉంది. కృష్ణ నింపాడు.

"థాంక్స్" అంది ఆ అమ్మాయి.

"వస్తువులు గిఫ్ట్ పాక్‌చేసి ఇవ్వుమరి" అని అడిగాడు కృష్ణ.

ఆ అమ్మాయి అందంగా నవ్వి, "ఈ గిఫ్టులు పెళ్ళిముందురోజు సాయంత్రం పెళ్ళికూతురికి పెళ్ళికొడుక్కి మేమే డెలివరీ చేస్తాం. మీరు పెళ్ళివారింటికి చేతులూపుకొంటూ వెళ్ళి ఈ రసీదు ఇవ్వటమే" అంది.

ఇదీ బాగానే ఉంది అనుకొని శ్యామల, కృష్ణ తిరుగుముఖం పట్టారు.

ఆదివారం వచ్చింది. గుళ్ళోపెళ్ళి పన్నెండు గంటలకి అని ఉంది. భోజనాలు గుళ్ళో పెడ్తారు కాబోలు కొబాల్ ఆమధ్య వచ్చి గురునానక్ జన్మదినానికి గురుద్వారాకి పిలిచాడు రమ్మని. వెళ్తే అక్కడ భారతదేశస్తులకి భోజనాలు పెట్టారు. ఇక్కడా అలాగే పెడ్తారు కాబోలు, అనుకొన్నారు శ్యామల కృష్ణలు, పన్నెండింటికి ముహూర్తం కదా. సరిగ్గా ముహూర్తానికి వెళ్తే బావుండదు అని చెప్పి పదకొండు గంటలకి గుడిచేరుకొన్నారు. గుడంతా ఖాళీగా ఉంది. ఎవరూ లేరు. భోజనాల ఏర్పాట్లు అసలేలేవు.

"ఇక్కడ ప్రసాద్, స్నేహల పెళ్ళి జరగాలి కదా!" అని అక్కడ వాచ్‌మన్‌లాంటి అతన్ని అడిగారు.

"జరగాలి... కాని ఇంకా బరాత్ రావాలి కదా!"

"ఎన్నింటికి వస్తుంది?"

"రెండు మూడు అవవచ్చు"

"పన్నెండింటికి ముహూర్తం కదా!"

ముహూర్తం అన్నమాట అతనికెన్నివిధాల చెప్పినా అర్థంకాలేదు.

"ఎలాగో ఇంతదూరం వచ్చాం. రెడ్డిగారి ఇంట్లో కాసేపు కూర్చుని మళ్ళీ వద్దాం" అంది శ్యామల.

పిక్టన్ వీధిలో ఉన్న రెడ్డి ఇంటికివెళ్ళారు. పద్మ, రెడ్డి "రండి రండి... బహుకాల దర్శనం" అని ఆహ్వానించారు.

"ఏమిటింకా ఇలాగే ఉన్నారు. మీరు ప్రసాద్‌గారి పెళ్ళికి రావటంలేదా?" అని అడిగింది శ్యామల పద్మని.

"నిన్న అతని ఇంటికి వెళ్ళి గిఫ్ట్ రసీదు ఇచ్చి భోజనంచేసి తాగి వచ్చాం. మిమ్మల్ని అతను పిలవలేదు కాబోలు మీరు రాలేదు అనుకొన్నాం" అంది పద్మ.





"అతను మమ్మల్ని పెళ్లికి పిలిచాడు. మేమూ గిఫ్ట్ కొన్నాం అతను చెప్పిన షాపులో. కాని అతను మమ్మల్ని నిన్న సాయంత్రం ఫంక్షన్‌కి పిలవలేదు" అన్నాడు కృష్ణ కొంచెం చిన్నబుచ్చుకొని.

దానికి రెడ్డి, "ఇక్కడ పెళ్ళికి పిలిస్తే ఆ క్రితంరాత్రి వాళ్లింటికివెళ్లి కానుకలు చెల్లించి వాళ్లిచ్చే చందన తాంబూలాలు స్వీకరించి ఆనందింపజేసిరావాలి. అది పద్ధతి. మీకు తెలుసుననుకొని చెప్పొండడు. ఇవాళ ఉత్తినే పెళ్ళికూతురు, పెళ్ళికొడుకు ఊరేగుతూ గుడికివచ్చి పెళ్లిచేసుకొని దాన్ని రిజిష్టర్ చేస్తారు. అక్కడ కూల్‌డ్రింక్స్ ఇస్తారు. అవి తాగేసి మనం వెనక్కివస్తాం. వాళ్లు హనీమూన్‌కి వెళ్తారు. మనం గుడికి వెళ్లకపోయినా ఎవరూ ఏమీ అనుకోరు. నిన్న సాయంత్రందే ముఖ్యం" అని వివరించాడు.

"మరి ముహూర్తం అంటూ లేదా? ఇంకా పెళ్లివారు గుడికి చేరలేదు!!"

"ముహూర్తంలేదూ పాడూ లేదూ! ఇవాళ ఆదివారం పెళ్లిచేసుకొంటున్నారు. అదీ గుళ్లో... అంటే ఇదంతా వీళ్లమీద క్రిస్టియానిటీ ప్రభావం... క్రైస్తవులకి ముహూర్తంలేదు కనుక వీళ్లకీలేదు. ఇక్కడంతా హైబ్రిడ్ కల్చర్"

"అయితే మేం ఇంటికి పోతాం" అంది శ్యామల.

"ఎల్లాగో రాకరాక వచ్చారు మాతో గోంగూర పచ్చడి అన్నం తినండి. ఆపైన గుడికి మేమూ వస్తాం" అంది పద్మ.

"ప్రసాద్ పెళ్లికి మీ ఇంట్లో భోజనం-బావుంది" అంది శ్యామల.

"మీరు చుట్టాలు, మేము పెళ్లివారం. నేనే ప్రసాద్‌కి ఆడబడుచుననుకొని మా అన్నయ్య పెళ్లి సత్కారం మీకు నేను చేస్తాను" అంది పద్మ నవ్వుతూ.

"మమ్మల్ని దూరంగా తోసేస్తున్నారా! చుట్టాల లిస్టులో వేసి" అంది శ్యామల.

"నేనైతే బాధపడను. మా ఆవిడ ప్రసాద్‌కి చెల్లెలైతే నాకు అభ్యంతరంలేదుకాని ఆ స్నేహ నాకు అక్కగారు కాదు" అన్నాడు రెడ్డి. రెడ్డి ఆమాట అంటున్నప్పుడు అతని ముఖం ప్రసన్నంగా లేదు.

"ఏమిటలా అంటున్నారు? చెల్లెలు కాదంటే సరిపోలేదా? ఆ పిల్లని అప్పగారు కాదంటున్నారు?"

"బీరు తాగండి ముందు మా ఆవిడ అన్నగారి పెళ్లి సందర్భంగా" అన్నాడు రెడ్డి ఫ్రిజ్ దగ్గరకు వెళ్తూ.

"షాంపైన్ ఇవ్వరా?" అని అడిగాడు కృష్ణ.

"ఉంటే ఇద్దును... కాని ప్రసాద్ పెళ్లి సందర్భంగా కాదు. ప్రసాద్ పెళ్లిలో సెల్‌బ్రేట్‌చేసుకోడానికి ఏమీలేదు. అంతా విచారించాల్సినదే- ఈ పెళ్లికి బీరు చాలు"

రెడ్డి కృష్ణకి తనకి కాంబ్ బీరు సీసాలు పద్మకి, శ్యామలకి, తన కొడుకుకి కోకాకోలా సీసాలు తెరిచాడు. పశ్చిమదీవుల్లో బీరుసీసా ఘనపరిమాణం 250 మి.లీ. ఇండియాలోలాగా 650 మి.లీ కాదు. అందుకని మళ్లీ గ్లాసులో పోసుకోవాల్సిన బాధలేదు అయిను వేసుకోదల్చుకొంటే తప్పించి.

"ఏమిటి అల్లా అన్నారు? ఇంతకు ముందే మనవాడైన వెంకటరమణ ఈ దీవుల పిల్ల అయిన విజయని చేసుకొన్నాడు కదా! ఈ పెళ్ళిని సమర్థించని మీరు విజయ ఆఫ్రికన్ అయినా ఆ పెళ్లిని విమర్శించలేదు- ఆశ్చర్యంగా ఉంది" అన్నాడు కృష్ణ రెడ్డి హాస్యానికి అంటున్నట్టు అనిపించక.

"నిజమే నేను విజయ పక్షపాతిని. విజయ చక్కని చుక్క అనను. కాని మంచిపిల్ల. ఆ పిల్లని పెళ్లిచేసుకోటానికి నిజానికి వెంకటరమణ అర్హుడు కాదు. ఆ పిల్ల మన పద్ధతులు అలవరుచుకొని ఇతన్ని తనవశుడిగా చేసుకొని, ఇతని చెడుబుద్ధులు పోగొట్టి మంచివాడిని చేసింది. రమణ మా ఆవిడకి అన్నయ్య కాడేమో గాని విజయ నాకు చెల్లెలే!" అన్నాడు.

"విజయకి, స్నేహకి పోలికలేదు. స్నేహ హాస్పిటల్‌లో నర్సు కదా! ఆమెతో అందరికీ పరిచయం ఉంది. కొందరితో మరీ సన్నిహితమైన సంబంధాలున్నాయి. పూర్వం చొదరి స్నేహ ఒక కంచంలో తిని ఒక మంచంలో పడుకునే అంత స్నేహంగా ఉండేవాళ్లు. ఆ

చౌదరి దీన్ని ప్రసాద్‌కి అలవాటు చేసి ఉంటాడు. ఈ ప్రసాద్ ఇంత వెర్రివాడనుకోలేదు. వెర్రాడు కాకపోతే దాన్ని పెళ్లిచేసుకొనేవాడు కాదు. అందులోను అతని కంటే పెద్దది"

"నిజమా!" అని శ్యామల, కృష్ణ ఒకేసారి ఆశ్చర్యపోయారు.

"ఏమండి పెళ్లికి ముందు ప్రసాద్‌కి మాత్రం స్నేహ కాకుండా వేరే కొంతమందితో సంబంధంలేదా? అలాగే స్నేహకి ఉందనుకొంటే పోలేదా! పెళ్లాయ్యాక ఒకళ్లవట్ల ఒకళ్లు నీతి తప్పకుండా ఉంటే చాలదా!" అంది పద్మ. పద్మకంత విశాలమైన భావాలున్నందుకు ఆశ్చర్యపోయాడు కృష్ణ.

"ఒకవేళ స్నేహ పెళ్లికి ముందు తిరుగుబోతైనా పెళ్లాయ్యాక తిన్నగా ఉంటే మనం తప్పువట్టక్కర్లేదు. చౌదరిగారు పెళ్లయ్యాక కూడా ఆ లీలతో సంబంధం కొనసాగించటంలేదా!" అని శ్యామల నోరు జారింది.

"చౌదరి ఇంకాదాన్ని వదిలిపెట్టలేదా?" అని అడిగాడు రెడ్డి. రెడ్డికి చౌదరి అంటే మంచి అభిప్రాయం ఏ కోశానా లేదు.

"అంటే మీకు ఆవిడ తెలుసునా?" కృష్ణ రెడ్డిని అడిగాడు.

"తెలియకేమీ అదో పెద్ద చెయ్యి"

"మా ఆయన్తో నేను కూడా వచ్చాను కనక బతికిపోయాను" అంది పద్మ.

"నేను పెళ్లిరోజున, కామంతో నిన్ను తప్పి చరించను అని ప్రమాణం చేశాను" అన్నాడు రెడ్డి.

"మిగిలిన రెండు విషయాల్లో చెయ్యి లేదా?" అని అడిగాడు కృష్ణ తమాషాకి.

"ప్రతీ భర్త భార్యని చేతైనంత తప్పి చరించాలనే చూస్తారు. అందరికి అన్ని విషయాల్లో కుదరదు" అంది శ్యామల.

"మా ఆవిడ స్త్రీలకి ఛాంపియనా"

"మా ఆవిడ వంటకి ఛాంపియన్. పద్మా! వంటచెయ్యి. భోంచేసి మనం వెల్దాం గుడికి కనీసం పుణ్యం వస్తుంది"

భోజనాలు అయ్యాక నలుగురు పిల్లాడితో సహా కృష్ణుడి గుడికి వెళ్లారు. బరాత్ ఇంకా రాలేదు.

"కృష్ణుడు మగవాళ్లకి ప్రతినిధి" అంది శ్యామల.

"నేను కాను బాబోయ్" అన్నాడు కృష్ణ.

"మీరు కాదు గుళ్లో పెద్దమనిషి! ఇంట్లో పెళ్లాం దగ్గర ఇచ్చకాలు ఊళ్లో రాసలీలలు" అంది శ్యామల.

మళ్లీ సంభాషణ ప్రసాద్ పెళ్లిమీదకు మళ్లింది.

"వండుకోలేక పెళ్లిచేసుకొంటున్నాడనుకొంటాను" అన్నాడు కృష్ణ.

"ఇక్కడ వండుకోవాల్సిన అవసరంలేదు. రోటీ చికెన్ చాలా హొటళ్లలో దొరుకుతుంది. పోతే ఇంట్లో వండిపెట్టడానికి ఆడది కావాలనుకొంటే పెళ్లే చేసుకో అక్కర్లేదు. మీ యూ.ఏ.లో సైన్సు కాలేజీలో నాయరని ఉన్నాడు. అతని భార్యకి జబ్బుచేసి ఇండియా వెళ్లిపోయింది. అతను పిల్లల్ని పెట్టుకొని మీ నారాయణ ఉంటున్న ఫ్లాట్స్‌లో ఉంటున్నాడు. పశ్చిమ దీవులకి చెందిన భారతీయ జాతి స్త్రీని ఉంచుకొన్నాడు ఇంట్లో" "ఉంచుకొన్నాడంటే అర్థంవేరు. మీరు మనరాష్ట్రం వదిలిపెట్టి చాలా సంవత్సరాలై ఉంటుంది. తెలుగు మర్చిపోయారు. వంటకి పెట్టుకొన్నాడు అనాలి" అన్నాడు కృష్ణ.

"ఉంచుకొన్నాడని కావాలనే అన్నాను. ఇతనికి నలభై అయిదు సంవత్సరాల వయసు. ఆమెకు ముప్పైసంవత్సరాలు. రాత్రిళ్లు అక్కడే పడుకుంటుంది నాయర్‌కి తోడుగా. పగలు వంట చేసిపెడ్తుంది. నెలకింత అని ఇస్తాడు- అన్ని సర్వీసెస్‌కి కలిపి"

"ఆమెకి పిల్లలు పుడ్తే?" అని కృష్ణ అనుమానం వ్యక్తపరిచాడు.

"పుట్టరు... పుట్టకుండా పెళ్లాం జబ్బు చేసినప్పుడు నాయర్ ఆపరేషన్ చేయించుకొన్నాడు మా హాస్పిటల్‌లోనే. పుట్టినా నష్టంలేదు. అతని ఇల్లీగల్ చిల్డ్రన్‌కి కూడా ఇక్కడ ఇన్‌కమ్‌టాక్స్ కన్సెషన్ ఉంటుంది. అది ఆమెకిస్తే సరిపోతుంది"

"బావుంది నాయర్‌పని!" కృష్ణ హాస్యానికే అన్నాడు. కాని శ్యామల కొరకొర చూసింది.





"మీరు శ్యామలగార్ని భయపెడ్తున్నారు. నారాయణ డిపార్ట్‌మెంటులో ఉన్న మూన్‌సామి గురించి కూడా చెప్పండి" అంది పద్మ.

"ఆయనకో కథ ఉందా?" అని కృష్ణ కుతూహలంగా అడిగాడు.

"ఉంది... ఆయన అయిదేళ్ల క్రితం ఒక ఎయిర్ హెూస్టెస్‌ని ప్రేమించాడు. ఆమె అతన్ని దారుణంగా మోసం చేసింది. దాన్ని తట్టుకోలేక తాగుడు మొదలుపెట్టాడు. బాటిల్స్ తెచ్చిపెట్టడానికి, వంట చేసిపెట్టడానికి ఇక్కడ మనిషిని ఇంట్లో పెట్టుకొన్నాడు. డిపార్ట్‌మెంటుకి కూడా వెళ్లకుండా ఇంట్లో కూర్చుని తాగుతూ ఆల్కహాలిక్ అయ్యాడు. అతను తాగుతున్నప్పుడెప్పుడో ఆ నల్లదానిమీద చెయ్యివేసి ఉంటాడు. తరువాత ఆమె పూర్తిగా ఈ మూన్‌సామి నెత్తిన చెయ్యివేసింది. అతని జీతం, ఇల్లు పూర్తిగా ఆమెవే. ఆమె ఇచ్చినప్పుడు ఇచ్చినంత తాగాలి. అతన్ని పెళ్లి చేసుకోకుండానే అతనిమీద అతని సంపాదన మీద సర్వహక్కులు సంపాదించింది. అతను కాస్త తాగుడు నుంచి బయటపడి మళ్లీ వర్క్‌కి వెళ్తున్నాడనుకోండి. అసలు విషయం ఏమిటంటే ఇక్కడి ఆడవాళ్లు చుట్టమైవచ్చి దయ్యమై పట్టుకోగలరు. అవసరం తీరాక కొంప ముంచి పోనూపోగలరు"

ఎన్ని కబుర్లు చెప్పుకొన్నా బరాత్ రాలేదు.

"ప్రసాద్ పెళ్లవకుండానే కళ్లపడటంలేదు. పెళ్ళయితే ఆవిడ అసలు అతన్ని మన కళ్లపడనిస్తుందో లేదో!" అన్నాడు కృష్ణ. ఆ మాటంటున్నప్పుడు అది జోస్యం అవుతుందని కృష్ణ అనుకోలేదు!

రెండున్నరకి బోరుకొట్టి- "ఆ తరువాత వాళ్ల ఇంటికే వెళ్తాంలెండి. ఇప్పుడు ఇంటికిపోతాం" అని కృష్ణ లేచాడు.

"మా ఇంటికి మీరు వస్తూ ఉండండి" అని శ్యామల పద్మతో చెప్పి బయల్దేరింది.

దార్లో "ఈ నల్లవాళ్ల ఆడవాళ్లే మనజాతి స్త్రీలకంటే నయంలా ఉన్నారు" అంది శ్యామల. లీలని, స్నేహని, విజయతోను, మూన్‌సామిని దార్లో పెడ్తున్న స్త్రీతోను మనస్సులో పోల్చి.

"అందులో మన పాత పక్కింటి క్రిస్టీ ఉందా?" అన్నాడు కృష్ణ చటుక్కున.

"మీరింకా దాన్ని మర్చిపోలేదన్నమాట" అంది శ్యామల. క్రిస్టీ తనకి చేసిన అన్యాయం ఏమీలేకపోయినా ఆమెపట్ల శ్యామల భయం ఆమెను 'దాన్ని' అనటంలో బయటపెట్టుకొంది.

* * *

వేసంగి సెలవులు వృధాకాకుండా మరాకస్, కులేవాస్ బీచులకు వెళ్లాలని కృష్ణ నారాయణతో సూచించాడు. నారాయణ నారదుడు లోకాలు చుట్టినట్లు అందరి ఇళ్లకి ఒక టైంటేబుల్ ప్రకారం వెళ్ళి వస్తూ ఉంటాడు. అతను ఒకవారం మరాకస్ బీచ్‌కి ఇండియన్లతో కలిసి వెళ్ళేటట్లు ఏర్పాట్లుచేశాడు. రెండో వారం తామలేవాస్ కెళ్లాలని నిర్ణయించుకున్నారు.

తినుబండారాలు సర్దుకుని పదిగంటలకల్లా బయల్దేరి మరాకస్ బీచ్‌కి వెళ్లారు. కొండలమధ్యనున్న ఆ బీచ్‌కి దిగుతుంటే ప్రకృతి చాలా అందంగా కనిపించింది. ఆ బీచ్‌లో కొన్ని ప్రఖ్యాత హాలీవుడ్ సినిమాలు తీశారు. తెలుగువాళ్ళు విశాఖపట్నం భీమిలిల మధ్య సినిమాలు తీసినట్టు, హాలీవుడ్ సినిమాలు ఈ పశ్చిమ భారత దీవుల్లో తీస్తూ ఉంటారు.

మరాకస్ బీచి దగ్గర కార్లాపుకొని సామాన్లతో బీచిలోకి నడిచారు. బీచ్ అంతా జనంతో నిండిపోయి ఉంది. కొంచెం నీడ ఉన్నచోట దుప్పట్లు పరిచారు. మగవాళ్ళు అక్కడే స్విమ్మింగ్ ట్రంక్స్‌లోకి మారిపోయారు. స్త్రీలు స్త్రీల గదులవేపు నడిచారు. పావుగంట తరువాత ముఖం చిట్లిస్తూ వచ్చి,

"దరిద్రంగా ఉన్నాయి. ఇక్కడే మార్చుకోవాల్సింది" అన్నారు. కుమార్ భార్య చంచల, పళని భార్య వత్సల మాత్రం నీళ్లలోకి రాలేదు. ఇండియన్లు కాకపోయినా పుష్ప, జ్ఞానరత్నం వీళ్లతో వచ్చి నీళ్లలోకి నడిచారు. పిల్లలు ఉత్సాహంగా దిగారు.

ఇండియన్లలో శ్యామల, శర్మ భార్య సరళ ఈతదుస్తులు ధరించి నీళ్లలో దిగారు. పురుషులందరూ స్నానానికి సిద్ధపడ్డారు. కుమార్ మాత్రం ఈతలాగు కొనుక్కోలేదు ఇన్ని సంవ

ఈదినంతసేపు ఈది బయటికి వచ్చారు. "మమ్మల్ని సామాన్ల కావలాకి తెచ్చారా?" అంది చంచల అక్కనుగా.

"మిమ్మల్ని నీళ్లలోకి దిగవద్దన్నది ఎవరు?" అంది శ్యామల.

భోజనాలు చేశారు. కృష్ణ భోజనం అయ్యాక పైపు అంటించుకొని బాత్‌రూమ్‌కేసి నడిచాడు.

కృష్ణ ఆలోచిస్తూ మిగిలిన ఇండియన్లు ఉన్నవైపు కాక మరోవైపు నడిచాడు. అక్కడ



త్సరాలున్నా, చారల లోపలిలాగుతో దిగాడు. ఆ బీచ్‌లో చాలామంది ఆఫ్రికన్ జాతి మగవాళ్ళు నైలాన్ కట్‌డ్రాయర్లతో ఈదుతూ ఉన్నారు. కుమార్‌ని ఎవరూ ఆశ్చర్యంగా చూడలేదు. అక్కడ ఎవరైనా గోచీ పెట్టుకొని దిగినా, అలా దిగిన ఆడపిల్ల అయినా పట్టించుకొనేటట్టుగా లేరు. ఎవరి ధోరణి వాళ్లది.

సముద్రంలో బాయిస్ తేల్తున్నాయి. అవి దాటి ఈదటం ప్రమాదం అని చెప్పారు. ఒక భాగం కెరటాలున్నాయి. ఒక భాగంలో కెరటాలు లేవు.

మైకులో పాటలు వస్తున్నాయి. ఆడవాళ్ళు మగవాళ్ళు దాని లయకి అనుగుణంగా అడుగులు వేస్తూ నాట్యం చేస్తున్నారు. నాట్యం చేస్తూ నడుస్తున్నారు. కొన్ని ఆఫ్రికన్ దేశాలు శిల్పాలలాగా అందంగా ఆరోగ్యంగా ఉంటాయి. వాళ్ళు ఆడకాని మగకాని నాట్యంచేస్తుంటే నిగనిగలాడే గుర్రాలు గుర్తుకువస్తాయి. గజ్జల గుర్రాలని అటువంటివాళ్లనే అంటారేమో! అందమైనదేహమున్న వాళ్ల

తోపాటు ముసలివాళ్ళు కూడా నాట్యంచేస్తున్నారు. వడలిపోయిన దేహం ఉన్న స్త్రీలు కూడా నాట్యంచేస్తుంటే కృష్ణకి ఎబ్బెట్టుగా అనిపించింది.

భరతముని నాట్యం చెయ్యడానికి అంగసౌష్ఠవం ముఖ్యం అని అందుకే అన్నాడేమో! నడుములు వంగిన నాయకులు గడిబిడిసేయక వెనక్కుండాల్సినదేనా? వాళ్లకి ఆనందించే హక్కు లేదా? కృష్ణ చుట్టూ చూశాడు. ముసలివాళ్ళు నర్తిస్తుంటే ఎవరూ వాళ్లకేసి చూసి వెక్కిరించడం లేదు. కళపేరిట బాలసరస్వతుల నాట్యం ఆదరించే భారతదేశంలో వ్యక్తులు స్వంతఆనందంకోసం చేస్తే అపహాస్యం చేస్తారెందుకు?

కృష్ణ తప్పుని గుర్తించి తిరిగి వెనక్కి వెళ్ళాడు. "ఏమిటి- అందమైన అమ్మాయిల్ని చూడ



టానికి వెళ్ళావా భాయిసాబ్?" అని అడిగింది చంచల.

'ఈ చంచల అక్కడ డాన్సు చేస్తుంటే ఎలా వుంటుందా' అని అనిపించి కృష్ణ చిరునవ్వు నవ్వాడు.

కృష్ణ నవ్వటంతో శ్యామలకి అతను అప రాధం అంగీకరించినట్టు తోచి అలకబూని- "నేను అందమైన అబ్బాయిల్ని చూడటానికి వెళ్తున్నాను- ఎవరు వస్తారు?" అంది జనాంతి కంగా.

అందరూ అది జోక్‌కింద తీసుకొని నవ్వారు.

"నేను వస్తాను. కూర్చుని కూర్చుని బోరుకొట్టింది" అంటూ చంచల లేచింది. శ్యామలకి తప్పలేదు ఆమెతో నడక. "అందమైనవాళ్లంతా ఇక్కడే ఉన్నారు. అటెందుకు వెళ్తున్నారు" అన్నాడు నారాయణ. కృష్ణ మరోసారి నవ్వాడు. తనతో బాటు కుమార్‌ని, నారాయణని కూడా చేర్చాడని అనుకొని.

ఆ మరుసటివారం లాకులేవాస్‌కి వెళ్ళారు. దానికి మరాకస్ దాటి వెళ్లాల్సి వచ్చింది. బీచిరోడ్డుకి బాగా పల్లంలో ఉంది. అక్కడ రాయిలో లోపలికి తొలిచిన గుహల్లాంటివి ఉన్నాయి. అవి కెరటాల కోతకి ఏర్పడ్డాయి. 'కువా'ల గుహలు. అక్కడ దుప్పట్లు పరుచుకొన్నారు. ఈసారి చీరతో చంచల కూడా నీటిలోకి నడిచింది. ఈ బీచిలో జనం అంతగా లేరు కనుక స్త్రీలు పెద్దగా ఇబ్బంది లేకుండా బట్టలు మార్చుకున్నారు.

"నేను చీరతో స్నానం చెయ్యనా?" అని భర్తని అడిగింది వత్సల. "వద్దు చీర పాడవుతుంది" అన్నాడు పళనిస్వామి.

"ఫరవాలేదు పాతదే" అంది వత్సల.

పళనిస్వామికి తప్పక ఒప్పుకున్నాడు. తన భార్య తడిసిన చీర రవికలతో పరపురుముల కంటపడటం అతనికిష్టంలేదు. తను పరాయి స్త్రీని చూడడు. కాని తన స్త్రీని వాళ్ళు చూడకుండా ఎలా అడ్డగలడు?

అందరూ స్నానాలు చేయసాగారు. ప్రతీ దంపతులు వాళ్ల సరాగాలతో ఇతర్లని పట్టించుకోలేదు. వత్సల అందాలు కళ్లతో తాగటానికి ఎవరూ ప్రయత్నించలేదు. పళనిస్వామి అరగంట తర్వాత అన్ని బెంగలు మరిచి భార్యతో హాయిగా స్నానంచేశాడు.

స్నానాలు అయ్యాక భోజనాలు చేశారు తడి బట్టలతో, వంటిమీద ఇసుక తడివంటికి ఇసుక అంటుకోవడంతో ఆ దేహాల్లో ఆకర్షణ కనిపించడంలేదు. కాస్సేపున్నాక చంచల గోక్కోవటం మొదలుపెట్టింది. కాస్సేపటికి పరికిణీ జాకెట్టు ఉంచుకుని చీర విప్పి పారేసింది. ఆమె ఉద్దేశంలో అవి ఈతదుస్తులకంటే గౌరవప్రదమైనవి. అందుకని ఆలోచించకుండా విప్పి పారేసింది.

"సాండ్ ఫ్లయిస్ ఉన్నాయి! చచ్చాంరా దేవుడా!" అన్నాడు నారాయణ. బీచుల్లో తోటల్లో ఉండే ఒకరకం పురుగులు కుడ్తే దురదగొండి ఆకు వంటికి రాసుకొన్నట్లుంటుంది.

అందరికి దురదలు మొదలయ్యాయి. "ఈ సరదా చాలు" అనుకొని అందరూ ఇంటి ముఖంపట్టారు.

* * *

సాండ్ ఫ్లయిస్ కుట్టటంతో అందరి ఉత్సాహం చితుకులమంటలాగ త్వరగా చల్లారిపోయింది. ఆయిల్ బర్డ్స్ గుహలు చూడాలంటే కొంచెం సాహసం ఉండాలని తెలియటంతో కృష్ణకి తోడులేకపోయింది. ఒంటరిగా వెళ్లడం అతనికిష్టంలేదు. నారాయణ తను మనుమలని పోగేస్తానన్నాడు.

కృష్ణ- శ్యామల ఈ లోపల రాజన్ కుటుంబాన్ని చూడవచ్చుకదా అని చౌదరి వాళ్లని "మీరు వస్తారా?" అని అడగటానికి వెళ్లారు. శారద "వస్తాం" అని సరదాపడింది. చౌదరి కారు తీశాడు.

చౌదరి కారులో నలుగురూ బయల్దేరారు. చౌదరి కారుని స్మార్ట్ స్ట్రీటుగుండా పోనిచ్చి ఓ ఇంటిముందు ఆపాడు.

శారద చెప్పింది "ఈ ఇంట్లోకి మారాలను కొంటున్నాం" అని.

ఇల్లు తాళం వేసి ఉంది. ప్రహరీగేటు తీసిఉంది. నలుగురూ లోపలికి వెళ్లారు. ఇంటి చుట్టూ పెద్ద ఆవరణ. అందులో మామిడిచెట్లు, కొబ్బరిచెట్లు, గ్రేప్ ఫ్రూట్ చెట్లు, పెప్రైన్,




క్రైమిట్, జామ, సపోట, అవకార్లో, కరివేపాకు, ఫ్లమ్, మిరపచెట్లు ఉన్నాయి. ఇంటికి దూరంగా ఒక షెడ్డుంది. దానిని ఎవరూ వాడినట్టు లేరు. దాని చుట్టూ కాకరతీగ పాకి ఉంది. కార్లు పెట్టుకోడానికి వేరే చోటుంది.

"చాలాబావుంది మీరుండబోయే ఇల్లు' అంది శారదతో శ్యామల- మగవాళ్ళు దూరంగా మాట్లాడుకుంటున్న సమయంలో.

"ఆ లీలముండకి కాస్త దూరంగా ఉంటుందని నేనే పట్టుపడ్తున్నానక్కా" అంది శారద.

నలుగురూ బయల్దేరి స్మార్ట్ స్ట్రీట్ వెనకతల ఉన్న కొండల్లో ప్రయాణంచేసి సన్నని రోడ్డు చేరుకొన్నారు. ఆ బాట కొండమీదనుంచి జలపాతం పడ్తున్నట్లుగా కనిపించింది.

"మాకారు అప్పెక్కేదికాదు. ఇంకా సయం తీసుకురాలేదు" అన్నాడు కృష్ణ.

చౌదరి మొదటి గేరులో జాగ్రత్తగా నడిపాడు. రోడ్డు చివర కొద్దిగా చదునైన ప్రదేశంలో ఓ ఇల్లుంది.

"ఇదే రాజన్‌గారి ప్రాసాదం" అన్నాడు చౌదరి.

ఇంటి చుట్టూ పూల చెట్లు ఉన్నాయి. బెల్లు కొట్టగానే ఉమ తలుపు తెరిచింది.

"వాంగో!" అని ఆహ్వానించింది. డ్రాయింగ్ రూమ్‌లోకి నడిచారు.

ఇంతలో ఫోన్ మోగింది.

"ఎక్స్‌క్యూజ్‌మి" అంటూ ఉమ ఫోనెత్తి అయిదు నిముషాలు మాట్లాడింది. ఆపైన వచ్చి:

"మావారి కొలీగ్ భార్య" అంది.

"మా రెవెన్యూ మినిస్టర్‌గారి భార్య" అని రాజన్ చెప్పాడు. అందులో కొద్దిగా గర్వం వుంది.

"ఆవిడ ఏదో పరీక్షలకి కడ్తోంది. మా ఆయనకా సబ్జెక్ట్‌లో కాస్త ప్రవేశం ఉంది" అంది ఉమ.

"అందుకని ఆవిడ తెలియనివి కాస్త చెప్పమన్నాడు మా మంత్రివర్యుడు" అన్నాడు రాజన్.

"అంటే ఆవిడకి మీరు ట్యూషన్ చెప్తున్నారన్నమాట" అన్నాడు చౌదరి.

"ఛఛ... కేవలం స్నేహం వల్ల. ఆవిడ చాలా తెలివైంది. నేనుత్తినే ధైర్యానికి ఆవిడకి తెలిసింది రైటేనని చెప్తూ ఉంటాను"

"అందమైంది కూడానా?" అడిగాడు చౌదరి.

"అటువంటి వేషాలు వేస్తే మా ఆవిడ ఊరుకోదు" అన్నాడు రాజన్.

చౌదరికి చురక తగిలి ఊరుకొన్నాడు. రాజన్ కూతురు మీనా అందరికీ పళ్ల రసం తెచ్చింది.

"నేను డ్రింక్స్ కొని ఇంట్లో పెట్టను" అన్నాడు రాజన్.

"మరే- మీరు కొనరని నాకు తెలును" అన్నాడు చౌదరి.

ఉమ మళ్ళీ ఎవరికో ఫోను చేసింది. వాళ్ళున్నంతసేపు ఉమ ఎవరితోనో ఒకళ్లతో ఫోనులో మాట్లాడ్తూ ఫోనుకి ఫోనుకి మధ్య అతిథుల్తో మాట్లాడసాగింది.

మాటల మధ్యలో పకోడీలు చేసింది. ఆతిథ్యం అంటే కాఫీటిఫిన్లు పెట్టడమే అయితే బాగానే ఆతిథ్యం నెరిపింది. కాని శ్యామలకి ఆవిడ ధోరణి నచ్చలేదు.

"మా అమ్మాయి మీనాకి పెళ్ళి సంబంధం కుదిరింది. మెడ్రాసులో పెద్దడాక్టరుగారి అబ్బాయి పెళ్ళికొడుకు. అతను పెద్ద డాక్టరే! మా అమ్మాయి ఫొటోలు చూసి కావాలని కబురుపెట్టారు. అన్నట్టు మీకా ఫొటోలు చూపిస్తాను" అంటూ ఉమ ఒక మేగ్జయిన్ తీసుకువచ్చింది. అది కృపలానీస్ అచ్చువేసే ఫాషన్ పత్రిక. అందులో రకరకాల భంగిమల్లో, కోణాల్లో మీనా ఫొటోలున్నాయి. అందులో ఒకటి రవిక లేకుండా ఆచ్ఛాదనంలేని వీపుతో ఉన్నది ఒకటి. శ్యామల ఆ ఫొటోకేసి తదేకంగా చూస్తుంటే-

"ఈ ఫొటో తీస్తున్నప్పుడు పక్కన నేనున్నాను. ఇదిగో ఆ వరండాలో తీశారు. మా అమ్మాయి ఈ ఫొటోకి సిగ్గుపడ్తే, కళ విషయంలో సిగ్గుపడకూడదని చెప్పాను. ఇంతో అంతో నేనూ కొంచెం బొమ్మలు గీస్తాను. అన్న

ట్టు మేము గత సంవత్సరం పారిస్ వెళ్లాం. మాకు ప్రతి సంవత్సరం దేశాలు తిరగటానికి డబ్బు ఇస్తారు. పారిస్‌లో ఆర్ట్‌గేలరీ చూశాం. ఆ స్లయిడ్స్ చూపిస్తాను" అంటూ ఉమ స్లయిడ్స్ చూపించడానికి ఏర్పాటుచేసింది.

ప్రఖ్యాత చిత్రకారుల చిత్రాలకి తీసిన స్లయిడ్స్ అవి. కృష్ణ నోరుజారి, "ఇవన్నీ చాలావరకు నేను చూసినవే" అన్నాడు.

"మీరు ఫ్రాంసీ వెళ్లారా?" అని అడిగింది ఉమ.

"వెళ్లలేదు కాని ఈ బొమ్మలు చూడాలంటే ఫ్రాంసీ వెళ్లాలా? వీటి నకళ్ళు ఫొటోలు చాలా చోట్ల దొరుకుతాయి" అన్నాడు కృష్ణ.

"స్వంతకళ్ళతో చూడటం వేరుకదా!" అంది ఉమ నొచ్చుకున్న స్వరంతో.

"మీ అనుభూతిని నేను కాదనటంలేదు. ఆ అనుభూతిని భద్రపరుచుకోవటానికి మీరు స్లయిడ్స్ తీసి ఉంటారు. అదీ సహజమే. ఆ స్లయిడ్స్ చూస్తుంటే మీకు మళ్ళీ ఆ అనుభూతి గుర్తుకురావచ్చు. కాని నాకు మాత్రం ఈ బొమ్మలు నేను పూర్వం చూసిన ఫొటోలు లేక నకళ్ళు కలిగించిన అనుభూతికి భిన్నమైన అనుభూతి కలిగించలేదు" అన్నాడు కృష్ణ.

ఉమ సమాధానం చెప్పకుండా మరోరెండు స్లయిడ్స్ చూపించి ఆపేసింది, "మిగిలినవి ఆయన ఆఫీసువి" అంటూ.

రాజన్ ఇంటిచుట్టూ తాము పెంచుతున్న తోటని చూపించాడు. ఇల్లూ, ఇంటి చుట్టూ మొక్కలు- చాలా వైభవంగా ఉంది.

రాజన్ మాటల్లో తెలుగువాళ్ల పట్ల, తెలుగు పట్ల ఒక చిన్నచూపు వ్యక్తం అయింది కృష్ణకి.

"పూర్వం మా ఆఫీసులో శాస్త్రి అని ఒక తెలుగాయన ఉండేవాడు. ఆయన మా రెవెన్యూ మినిస్టర్‌కి 'అవగా' ఇచ్చి మంచిచేసుకోవాలని చూసేవాడు. కూరలు కూడా మోసిపెట్టేవాడు" అన్నాడు రాజన్. అరవాళ్లందరిలాగానే ఆవకాయని అవగా అని ఉచ్చరించాడు.

"అందరికి రెవెన్యూ మంత్రిగారి భార్యకి ఏకాంతంలో పాటలు చెప్పే అవకాశం. ఉండదు" అని చౌదరి దెబ్బకొట్టి బదులు తీర్చుకొన్నాడు.

సూటిగా వచ్చిన బాణాన్నుంచి రాజన్‌కి తప్పుకొనే అవకాశం లేకపోయింది.

మొత్తం మీద ఈ కలుసుకోవటం శ్యామలకి- కృష్ణకి కూడా సంతోషం కలగచేయలేదు.

తిరిగి వెళ్తుంటే, "ఈ పెద్దమనిషి మినిష్టరు పెళ్లానికి పాటలు చెప్పి కాకా పట్టే ఆ పెద్దమనిషి అవకాయలిచ్చి కాకాపట్టాడు. కాకాకి సంతోషించిన మంత్రి, వీళ్ళే మరికొద్ది సంవత్సరాలపాటు నాకు సలహాదారులుగా కావాలని రాస్తాడు. అంతమాత్రాన యు.ఎన్. ఒప్పుకోదు. కొన్ని సంవత్సరాలయ్యాక అందరు నిపుణులు పోవలసినవాళ్ళే ఈ దీవి వదిలి" అన్నాడు చౌదరి. చౌదరికి, శాస్త్రి తెలుగువాడవటంచేత రాజన్ అరవవాడవటం వల్ల శాస్త్రిపట్ల పక్షపాతం రాజన్ పట్ల కోపం లేవు.

"ఇక్కడికి ఎవరిమటుకువాళ్లం వచ్చాం. ఎవరి సర్వైవల్‌కోసం వాళ్ళు పాటువడ్తాం- అందులో తప్పులేదు" అన్నాడు కృష్ణ.

"రాజన్ పాటలు చెప్పడం తప్పుకాదు. శాస్త్రిని విమర్శించటం తప్పు" ఎంగిలి విస్తరాకుల దగ్గర కుక్కలు వాటి సర్వైవల్ కోసం అవి పోట్లాడుకుంటాయి. అది హర్షించంకదా" అన్నాడు కృష్ణ.

"ఆవిడకి చాలా వయస్సుంటుందేమో కదా! జుట్టు మాత్రం నల్లగా ఉంటుంది" అంది శ్యామల.

"రంగు వేసుకుంటుందక్కా" అంది శారద.

శ్యామల, కృష్ణ తమ ఇంటివద్ద దిగిపోయారు.

★ ★ ★

సెప్టెంబర్‌నెలలో నారాయణ ఆయిల్ బర్డ్స్ కేవ్స్‌కి వెళ్లటానికి ఏర్పాట్లుచేశాడు. లతా, జార్జి, రామ్‌ప్రసాద్‌లు, తన పక్కఫ్లాట్‌లో ఉన్న ఒక స్పానిష్ ఆవిడ వస్తున్నారని చెప్పాడు. కృష్ణ, శ్యామల వెళ్దాం అన్నారు.

అనుకొన్నవిధంగా ఆదివారం బయల్దేరారు. కొండలమధ్య ప్రయాణంచేసి అక్కడున్న విశ్రాంతి మందిరం చేరారు. "భోజనాలు





మేమే తెచ్చుకొన్నాం. ఇక్కడ భోజనాలు చేసి విశ్రాంతి తీసుకొంటాం'' అని చెప్పారు. దానికి ఆ విశ్రాంతి మందిరం తాలూకు అతను నాలుగు ట్రినాడ్ డాలర్లు పుచ్చుకున్నాడు. ఆ తిండి సామాన్లు అక్కడ దింపి మంచినీళ్ల సీసాలు పుచ్చుకొని బయల్దేరారు. బాగా వాలుగా ఉన్న కాలిబాటలో నడవసాగారు. ఎందుకైనా మంచిదని ఎండుకర్రలు చెట్ల నుంచి విరిచి ఊతగా పట్టుకొని నడవసాగారు.

మనిషి వెనక మనిషి నడుస్తున్నారు. కొన్ని చోట్ల దిగటం చాలా కష్టమవసాగింది. ఒకళ్లకొకళ్లు సహాయం చేస్తూ నడుస్తూ ఒకరికోసం ఒకరు ఆగుతూ నడుస్తున్నారు.

జార్జి స్పానిష్ స్త్రీతో ముందు నడుస్తున్నాడు. వాళ్ల వెనుక లత, లత వెనకాతల కృష్ణ, కృష్ణ వెనకాతల శ్యామల, ఆమె వెనకాతల నారాయణ నడుస్తున్నారు. ''జార్జి ఇంజన్ డ్రైవరు. నేను రేర్ గార్డ్'' అన్నాడు నారాయణ.

''మేము నలుగురం పాసింజర్సమి'' అంది శ్యామల. ''దిస్ లేడి ఇంజన్, ఐ ఆమ్ ఇంజన్ డ్రైవర్'' అన్నాడు జాజి స్పానిష్ స్త్రీని చూపిస్తూ.

''నేను లగేజ్‌వాన్‌ని. అందరి వాటర్‌బాటిల్స్ మోస్తున్నాను'' అన్నాడు కృష్ణ.

అందరూ నవ్వారు. కొంచెం ముందుకువెళ్లాక జార్జి స్పానిష్ స్త్రీ కనిపించలేదు. దారి చీలింది. లతకి ఎటు వెళ్లాలో తెలియలేదు.

''జార్జ్! దారెటు?'' అని అరిచింది లత. జార్జి అక్కడికి చాలాసార్లు వచ్చాడు.

''బోత్ మీటెగెయిన్'' అన్నాడు. ''ఎటువెళ్లినా ఫరవాలేదు'' అన్నాడు. లత ఎడంవైపు వెళ్లింది. కృష్ణ అనుసరించాడు.

శ్యామల ''కృష్ణా! ఎటు వెళ్లారు?'' అని అరిచింది. ''ఎటు వెళ్లినా కలుస్తాం. ఎటో అటు నడవండి. మేము లెఫ్టికి తిరిగాము'' అన్నాడు కృష్ణ.

''అయితే మనం రైటుకి పోదాం. అందరు ఒకేదార్లో నడవటం ఎందుకు ఏదైనా సీనిక్ స్పాట్స్ కుడిమార్గంలో ఉంటే అందరం మిస్ అవుతాం'' అన్నాడు నారాయణ.

శ్యామల కుడికి దారితీసింది. నారాయణ అనుసరించాడు. కుడివైపు దారిలో బాగా ముందు జార్జి, స్పానిష్ స్త్రీ వెనగాతల శ్యామల, నారాయణ. ఎడంవేపు దారిలో లత, కృష్ణలు నడుస్తున్నారు. ఏ జంటకి మరొక జంట కనిపించటం లేదు. జార్జి ఏదోవంక పెట్టి స్పానిష్ స్త్రీ మీద చేతులువేస్తూ చివరికి నడుము పట్టుకొని నడవసాగాడు. దార్లో శ్యామల, లతలకి కాలుజారినప్పుడు మాత్రం నారాయణ, కృష్ణలు వాళ్లకి సహాయం చేశారు. లత కృష్ణ చెయ్యి వెంటనే వదిలిపెట్టలేదు.

గుహలు జేరారు. కొండలమీద పడిన నీరు, పగుళ్ల ద్వారా గుహలుజేరి చిన్నవాగుగా ఆ గుహల గుండా ప్రవహిస్తోంది. ఎక్కువగా లోతున్నచోట మోకాలు ఎత్తులోతుంది. దాన్ని దాటడానికి మగవాళ్లు ప్యాంట్లు మడిచారు. జార్జి నిక్కరు వేసుకొన్నాడు. స్పానిష్ స్త్రీ మిడ్డీ వేసుకొంది. వాళ్లిద్దరికి ఏ సమస్యా లేదు. శ్యామల చీర తడుస్తున్నా అందులోంచి అలాగే నడిచింది. లత చీర కాళ్లమీద కొద్దిగా పైకిఎత్తి పట్టుకొని నడవటం మొదలుపెట్టింది. లత బలమైన కాలిపిక్కలపైకి చూపులుమళ్ళాయి. కొద్దినెలల క్రితం లత తనగదిలో ఏడవటం, తను ఓదార్చటం, ఆమె వెళ్లిపోతున్నప్పుడు లయబద్ధంగా కదలుతున్న ఆమె పిరుదులు, ఆచ్ఛాదనలేని ఆమె కాలి పిక్కలు తన దృష్టిని ఆకర్షించడం కృష్ణకి గుర్తుకు వచ్చాయి. ఆ సంఘటన గుర్తుకు రావటంతో కృష్ణలో సంచలనం మొదలైంది. లతపట్ల ఆకర్షితుడవుతున్నాడు. లత పక్కనున్న శ్యామల ఉనికి మర్చిపోయి లతని అంటిపెట్టుకొని నడిచాడు.

గుహల్లో ఉన్నది గుడ్లగూబ జాతి పక్షులు. అవి నిశాచరులు. పగలు గుహలో విశ్రాంతి తీసుకొంటాయి. వాటికి కొవ్వు ఎక్కువ. అందుకని పూర్వం ఆ దీవివాసులు వాటిని చంపి వాటి కొవ్వుతో దీపాలు వెలిగించుకొనేవారు. అందుకని వాటికి ఆయిల్‌బర్డ్స్ అని పేరు వచ్చింది. జార్జి వివరించి చెప్పాడు.

పెద్దగా చూడటానికి ఏమీలేదు. గుహల్లో నడవటం అనే ఎడ్వెంచర్ తప్పించి గుర్తుంచుకోవడానికి ఏమీ లేదు. ఏమన్నా ఇంకా

ఉంటుందేమోనని మూలమూలలు వెతికారు.

అలా వెతకటంలో లత, కృష్ణలు మిగిలిన వారికి కాస్త దూరం అయ్యారు. "నాకూ కొవ్వు ఎక్కువే! ఐయామ్ ఓవర్ వెయిట్" అంది లత.

"మీకు కొవ్వు లేదు. ఉన్నా ఎక్కడ ఉంటే అందంగా ఉంటుందో అక్కడే మీకు బరువులెక్కువ" అన్నాడు కృష్ణ సాహసించి బరువులు అని బహువచనం వాడి తన రసికతను వెల్లడించుకున్నాడు. ఈ రెండుసార్లు పెళ్లాడిన స్త్రీ కోపగించుకోదని అనుకొన్నాడు. పైగా ఈమె జార్జి ప్రవర్తనతో విసిగి ఉండాలి.

లత అందంగా అతనివైపు చూసి, "నాకు చాలా ధైర్యం కలిగిస్తున్నాయి మీ మాటలు" అంది.

సులభంగా అందే స్త్రీలవైపు చేతులు చాచని పురుషులు చాలా తక్కువ. కృష్ణ మాధురిలాంటి స్త్రీలపట్ల విముఖుడేగాని లత లాంటి స్త్రీలపట్ల ఆకర్షితుడే

తిరిగి వెళ్తుంటే లత, కృష్ణ వెనకాతల వద్దారు. మళ్ళీ దారులు చీలినచోట లత ముందు నలుగురు వెళ్ళిన మార్గంలోకాక రెండోవైపు దారితీసింది.

"మనం అటునుంచి వచ్చాం. ఇటు వెళ్దాం. వాళ్ళు ఇటువచ్చి అటు వెళ్లారు" అంది. కృష్ణ అనుసరించాడు.

"ఇప్పుడు నేను గార్డుని" అన్నాడు కృష్ణ. కొంతదూరం వెళ్లాక కొండ ఎక్కటం దిగటం అంత సులభంగా లేదు.

లత అనువుగా ఉన్న ప్రదేశంలో కూలబడి వెన్ను ఆ కొండ వాలుకి ఆనించి వాలుగా పడుకుంది.

"నేనుమాత్రం స్లీపర్ కోచ్‌ని" అంది.

"అయితే నేను పాసింజెర్‌ని" అన్నాడు కృష్ణ.

లత మోహనంగా నవ్వింది. కృష్ణ మరింత వ్యామోహితుడయ్యాడు.

"కాస్త చెయ్యి ఇవ్వండి" అంది లేవటానికి ప్రయత్నిస్తూ.

కృష్ణ బలంగా తెలుగు సినిమాలో హీరో లాగా లాగాడు. లత పమిట జారిపడిపోయింది. లత కృష్ణమీద పడిపోయింది. కృష్ణకి అవకాశం వచ్చింది.

కృష్ణ తమకంగా ఆమెని కౌగిలించుకున్నాడు. ఆమె ప్రతిఘటించకపోవటంతో ముద్దుపెట్టుకొన్నాడు. అలా అవకాశాన్ని వాడుకున్నాడు.

"ఆలస్యం అయింది పదండి" అంది లత- అందీ అందని ఫలంపైన ఆకర్షణని పెంచుతూ!

ఆ రోజు రాత్రి కృష్ణ తన ఉద్రేకాన్ని శ్యామల మీద తీర్చుకొన్నాడు.

"ఏమిటో ఇవాళ అబ్బాయిగారు చాలా వేడిమీద ఉన్నారు" అంది శ్యామల అమాయకంగా



కృష్ణ, శ్యామల నవంబరు మొదటివారంలో ఒకరోజు లత, జార్జిను చూడటానికి వెళ్లారు. టాటాగో చూడటానికి వెళ్లటం గురించి మాట్లాడుకొన్నారు.

"డిసెంబరు సెలవల్లో వెళ్లటం సుఖమేమో కదా?" అంది శ్యామల కృష్ణని చూస్తూ. కృష్ణకి వెంటనే వెళ్లాలని ఉంది. లతతో కలిసిఉండే ఉద్రిక్తతను చేతనైనంత త్వరలో పొందాలని ఉంది.

అదృష్టంకొద్దీ జార్జి సమాధానం చెప్పాడు.

"ఎందుకు... పొద్దున విమానంలో వెళ్ళి సాయంత్రం తిరిగివచ్చేదానికి. ఈ శనివారంకాక ఆపై శనివారం వెళ్దాం. అప్పుడు ఆదివారం రెస్టు తీసుకోవచ్చు"

"ఈ శనివారమే వెళ్లవచ్చునేమో" అన్నాడు కృష్ణ.




"విమానంలో వెళ్ళిరావటం చాలా ఖరీదు అవుతుందేమో?" అంది శ్యామల.

జార్జి సమాధానం చెప్పాడు- "ఈ శనివారమే వెళ్లాలంటే వ్యవధి చాలదు. మీరింకా నారాయణతో మాట్లాడాలికదా! ఆ స్పానిష్ లేడీకి వీలవుతుందో లేదో కనుక్కోవాలి. తను చాలా మంచి కంపెనీ"- ఈ మాటలు లత ఉన్నదన్న బెదురులేకుండా అన్నాడు. అతని మాటల్లో ఆ స్పానిష్ స్త్రీవల్ల ఆకర్షణ కొట్టవచ్చినట్టు కనిపిస్తోంది. 'నాయనా...! నీ కళ్లలోకి లత ఆనటంలేదేమోకానీ నా కళ్లకి లత రంభలా ఉంటోంది' అని కృష్ణ మనస్సులో అనుకొని నవ్వుకొన్నాడు.

"పోతే ట్రినిడాడ్‌కి - టుబాగోకి మధ్య రాత్రిళ్ళు నడిచే ఫెర్రీ, పగలు నడిచే విమానం మాత్రమే రవాణా సౌకర్యాలు. అందుకని ప్రభుత్వం వీటి టికెట్లు చాలా చవకగా ఉంచింది. రానుపోను వచ్చేవారం నేను బుక్ చేస్తాను. యూ 'ఆక్స్' నారాయణ" అన్నాడు.

"అలాగే" అన్నాడు కృష్ణ.

లత ఇచ్చిన కాఫీతాగి బయల్దేరారు.

"ఏకంగా నారాయణతో చెప్పేసి పోదాం" అన్నాడు కృష్ణ.

"సరే" అంది శ్యామల.

కారు నారాయణ ఉంటున్న ఫ్లారెల్ ఫ్లాట్స్‌కి పోనిచ్చాడు కృష్ణ. సాయంత్రం ఏడుగంటల వేళ.

శ్యామల బెల్లువైపు వెళ్లింది. కృష్ణ డ్రాయింగ్ రూమ్‌కి ఉన్న కిటికీవైపు తొలిగాడు. వేసివున్న కర్టెన్ల మధ్యనుంచి చిన్న వెలుగురేఖ చీల్చుకుని వస్తోంది. అది వంటింట్లోని ఎలక్ట్రికల్ దీపంనుంచే వస్తోంది. ఒకక్షణం ఆ వెలుగురేఖ ఆగిపోయింది. రెండు మానవాకారాల నీడలు ఆ కాంతినడ్డాయి. ఆ ఆకారాలు ఒకదాన్ని ఒకటి పొదివిపట్టుకున్నాయేమో అన్న అనుమానం కలిగింది కృష్ణకి. తన అనుమానం నిజమైతే బెల్లుకొట్టి రసాభాస చెయ్యటం బావుండదు.

"మరోసారి వద్దాం శ్యామలా" అని కృష్ణ అంటుండగా "మళ్ళీనా?" అంటూ శ్యామల బెల్లు నొక్కింది.

ఒక నీడ రెండుగా చీలింది. లైటు కృష్ణ కళ్లలో పొడిచింది.

"జస్ట్ ఎ మినిట్" అన్న నారాయణగొంతు వినిపించింది.

వంటింటి నుంచి నడవటానికి పట్టేకాలాన్ని మించి వ్యవధి- తరువాత నారాయణ తలుపు తెరిచాడు.

"వచ్చి డిస్టర్బ్ చేశామేమో కదా!" అన్నాడు కృష్ణ.

నారాయణ కంగారుపడ్డాడేమోననుకున్నాడు- అతని ముఖవైఖరి చూసి.

"డిస్టర్బెన్స్ ఏముంటుంది?" అన్నాడు నారాయణ.

"ఒంటరివాళ్ళు కదా- వంటింటిలో పనిలో ఉన్నారేమో అనిపించింది"

"నాకు వంట తప్పేలా? లోపలికి రండి" అని లోపలికి పిలిచాడు.

లోపలినుంచి స్పానిష్ స్త్రీ వచ్చింది. అందరూ కూర్చున్నారు.

"ఈవిడను భోజనానికి పిల్చాను కన్నడం భోజనం పెడ్తానని. మొదట్లో ధైర్యంగా వచ్చినా భయపడ్తోంది నా వంట తినడానికి. భయం అని చెప్తే వినక నాకు స్పానిష్ వంటపెడ్తానని వంటింటిని ఆక్రమించింది"

అంతా తన అనుమానమేనేమో ఏమీ ఉండి ఉండదు- అనుకున్నాడు కృష్ణ. స్పానిష్ స్త్రీ సాధారణపు దుస్తుల్లో ఉంది.

"మాకు భోజనం పెట్టరా?" అంది శ్యామల నవ్వుతూ!

"ఆవిడైతే ధైర్యంచేసి వచ్చింది. మీరు రారేమో కదా" అన్నాడు నారాయణ. మళ్ళీ కృష్ణకి ఆ మాటలను నారాయణ ద్వంద్వార్థంలో వాడాడేమో అని అనుమానం కలిగింది. తను నిజంగా నారాయణని అనుమానిస్తున్నాడా? తనకి రెండు అర్థాలు తోచటం- తను అతిగా తెలుగు సినిమాలు చూసి ఉండటం వల్ల జరిగిందా?

కృష్ణ తను వచ్చినపని చెప్పాడు. నారాయణ, స్పానిష్ స్త్రీ గూడా ఆ షైశనివారం టుబాగో వెళ్లటానికి ఉత్సాహం చూపించారు.




అనుకొన్నవిధంగా శనివారం మూడుజంటలు కార్లలో పియార్కో విమానాశ్రయంకి చేరుకొని పార్కింగ్ ప్లేస్‌లో వాటిని పార్క్ చేశారు. లత కొడుకు రానని జార్జి చెల్లెలింటికి వెళ్లాడుట.

విమానం ఎక్కబోతుంటే శ్యామల బాగ్‌ని చెక్‌చేసి అందులో బటర్ రాసుకొనే కత్తిఉంటే దాన్ని లగేజిలో పడెయ్యమన్నారు. కత్తొకటి ఎలావడేయ్యటమో తెలియక దాన్ని తీసుకువెళ్లిన బ్రెడ్‌సాండ్ విచెస్ పాకెట్‌తో జతచేసి వాటిని కృష్ణ తెచ్చుకున్న స్విమ్మింగ్ ట్రంక్‌ఉన్న సంచిలో పెట్టి ఆ సంచీని లగేజికింద ఇచ్చి బాగేజి కూపన్ తీసుకొన్నారు. సెక్యూరిటీ చెక్ ఇంతపకడ్బందీగా చేస్తూనే ఉంటారు, ప్లేన్లు గల్లంతు అవుతూనే ఉంటాయి.

టొబాగో బీచికి చేరుకొన్నారు ప్లేనుదిగి. అక్కడ "కాస్త బ్రేక్‌ఫాస్ట్ చేస్తే బావుంటుంది" అన్నాడు కృష్ణ.

"కాస్సేపు స్విమ్ చేశాక" అన్నాడు నారాయణ.

మగవాళ్లు స్విమ్మింగ్ ట్రంకుల్లోకి మారారు. ఆడవాళ్లు ఈత దుస్తులు లోపల ధరించి పైన మామూలు దుస్తులు వేసుకొని ఉండటంతో పై దుస్తులు తీసేశారు. అందరు నీళ్లలో దిగారు. టుబాగో బీచ్‌లో సముద్రకెరటాలు లేవు. చాలా సేపు ఈదారు. లోతులేని ఆ బేలో.

"నాకు టీ కావాలి" అన్నాడు కృష్ణ.

ఎవరు కదలలేదు కాస్సేపు.

"పదండి నేను చేస్తాను" అంది లత.

నారాయణ ఒడ్డునే శ్యామలకి బాక్‌స్ట్రోక్ నేర్పుతున్నాడు. జార్జి స్పానిష్ ఆవిడతో కొద్దిగా లోతు నీళ్లలో ఈదుతున్నాడు.

కృష్ణ, లత ఒడ్డున గాలిలేనిచోట మూడు రాళ్లు పెట్టి నిప్పుఅంటించారు. ఎండు కొబ్బరి ఆకులతో దానిమీద టీ నీళ్లు పెట్టారు. కృష్ణ ఈతలాగుతోను, లత ఈత దుస్తులతోను ఉన్నారు. ఇసుకలో దగ్గరగా కూర్చుని టీ కాస్తున్నారు. లత నునుపైన కాళ్లు ఇసుక అంటుకొని అక్కడక్కడ గరుకుగా అనిపిస్తున్నాయి. లత మోకాళ్ల మీద వంగుని పొయ్యి ఊదుతుంటే కృష్ణ ఎదురుగా కూర్చుని కనిపిస్తున్న అందాల్ని ఆస్వాదిస్తున్నాడు.

"పాలుపొంగుతున్నాయి. ఏమిటి చూస్తున్నారు? టీపొడి వెయ్యండి" అంది లత.

"పాలగిన్నెని చూస్తున్నాను" అన్నాడు కృష్ణ టీపొడి కలుపుతూ. లతకి కాస్సేపటికి అర్థమై నిటారుగా కూర్చుంది.

"బావుంది నీ వరస" అంది.

"నా వరస మీ సరసన"

"టీ అయిందా?" అంటూ శ్యామల, నారాయణ వచ్చారు.

"అయింది... సమయానికి వచ్చారు. పనికి రాకపోయినా" అని నిష్ఠూరం వేశాడు కృష్ణ.

"ఇద్దరు కంపెనీ ముగ్గురు క్రౌడ్ అందుకని రాలేదు" అన్నాడు నారాయణ. ఇంతలో జార్జి, స్పానిష్ స్త్రీ వచ్చారు.

కొంచెం టిఫిన్ తిని టీ తాగాక జార్జి వెళ్లి పడవవాళ్లలో ఒకడిని బేరమాడి వచ్చాడు. తమకి పగడాల దిబ్బలు, నైలాన్‌పూల్ చూపించటానికి.

ఎక్కిన పడవకి అడుగుభాగం గాజుతో చేసి ఉంది. పడవనడిపే సరంగు నల్లరాతి విగ్రహంలా మెరిసిపోతున్నాడు.

"నలుపులోను, మగవాళ్లలోను అందం చూడాలనుకొంటే వీడిని చూడవచ్చు" అన్నాడు కృష్ణ శ్యామలతో.

శ్యామల కండలు తిరిగిన ఆ నల్లని దేహాన్ని మెచ్చుకొంది. కృష్ణకి అసూయకలగలేదు. అతను కూర్చున్నవిధంగా కూడా చెయ్యి తిరిగిన శిల్పి ఎంచుకొన్న భంగిమలా ఉంది. పడవకి అడుగుభాగంలో ఉన్న గాజుద్వారా చేపలు, పగడాల దిబ్బలు కనిపిస్తున్నాయి. కొంతదూరం పోయాక.

"ఇక్కడ లోతుండదు. దగ్గరగా పగడాల జీవుల్ని చూడదలుచుకొంటే చూడండి. ఈతవచ్చిన వాళ్లు దిగండి" అని పడవవాడు కంటికి పెట్టుకొనే అద్దాలు, గాలి ఆడటానికి ముక్కుకు తగుల్చుకొనే పొడుగాటి గొట్టం ఇచ్చాడు.

అక్కడ లోతు లేకపోయినా కోరల్ రీఫ్‌మీద నడవటం కష్టం. కాళ్లలో గుచ్చుకొంటాయి. ఈదుతూ చూడటం వీలు. అవన్నీ ఎక్కువగా

తెల్లవగడాలే. స్త్రీలు ధరించే వగడాల రంగు వగడాలు చాలా తక్కువట. వెతికితే అక్కడక్కడ కనిపించవచ్చునన్నాడు నరంగు.

అందరు నీళ్లలో దిగి అడుగీత ఈదసాగారు వగడాల దిబ్బలకి దగ్గరగా.

కృష్ణ లతని అంటిపెట్టుకొని ఈదుతున్నాడు. లత మిగిలినవాళ్లకి దూరం వెళ్లింది. నముద్రవు నీటిలో కొద్ది అడుగులదూరంమించి ఏమీ కనవడటంలేదు. కృష్ణకి ధైర్యం వచ్చింది. లతకాలు పుచ్చుకొని లాగాడు.

లత ఆగింది. కాని ఆశ్చర్యపోలేదు. వెంటనే ఆ నీటిలో ఆమెను గాఢంగా ఆలింగనం చేసుకొన్నాడు.

కళ్లకి, ముక్కులకి పెట్టుకొన్నవి అడ్డువస్తే తీసేశాడు. చల్లని నీటిలో లత మెత్తని వళ్లు వేడిగా వత్తుకొంది.

"ఐలౌయూ" అన్నాడు ఈ మాటలు ఇంగ్లీమలో అనటం చాలా సులభం.

"నేనూ నిన్ను కోరుతున్నాను" అంది లత.

కృష్ణ పెదిమలు లత పెదిమల్ని అందుకొన్నాయి "అధరామృతం మరీ ఉప్పగా ఉంది" అనుకొన్నాడు కృష్ణ. అంత ఉద్రిక్తతలోను అతను తన కొంటె స్వభావాన్ని మరిచిపోలేకపోయాడు. లత తన భుజంమీద నుంచి ఈతదుస్తుల స్ట్రాపులు తొలగించింది. కృష్ణదేహం ఆమె నగ్నవక్షోజాల స్పర్శసుఖం అనుభవించింది.

మిగిలినవాళ్లకి అనుమానం రాకుండా తిరిగి ఇద్దరు వడవవైపు ఈదారు. దారిలో ఆమె తన దుస్తులు నరిచేసుకొంది. కళ్లకి, ముక్కులకి మళ్లీ తొడుగులు తొడుక్కున్నారు. లతను వడవవైపు వెళ్లనిచ్చి కృష్ణ వడవరెండవవైపు నుంచి ఈదుకొంటూ వచ్చి నట్టు వెళ్లాడు.

అప్పటికే శ్యామల, నారాయణ వడవలో కూర్చున్నారు. మరికాస్సేపటికి జార్జి, స్పానిష్ స్త్రీ వచ్చారు.

"అంతసేపు నీటిలో ఉండటానికి నాకయ్యేవ" అన్నాడు నారాయణ.

"నారాయణ ధైర్యం చూస్తే నాకు తెలుగు మాట్లాడాలని అనిపిస్తుంది". అంది లత.

"మీకు తెలుగు మాట్లాడటానికి వచ్చేలా" అన్నాడు నారాయణ లతతో.

"మీకు మహావచ్చినట్టు" అంది శ్యామల.

నారాయణ నవ్వాడు. శ్యామలకి నారాయణకి ఈమధ్య జోక్స్ ఎక్కువయ్యాయి అనుకొన్నాడు కృష్ణ. కానితనకి లతకి మధ్య ఏర్పడిన నంబంధం వాళ్లిద్దరిమధ్య ఉండదు అనుకొన్నాడు. ఉంటే తను భరించలేడు.

అక్కడ నుంచి బయల్దేరి నైలాన్ పూల్‌చేరుకొన్నారు. నముద్రతీరానికి దూరంగా నముద్రవు మధ్య ఒకచోట నీళ్లు అతినీలంగాను, ఇనక అతి తెల్లగాను ఉన్నాయి. లోతు మొలలోతు.

ఇక్కడ మీకిష్టమైనంతసేపు ఈదవచ్చు అన్నాడు నరంగు.

నీటి స్వచ్ఛత, ఇనక స్వచ్ఛత చూస్తుంటే "ఈ భూమ్మీద ఇంకా కాలుష్యం వ్యాపించని ప్రదేశాలు లేకపోలేదు" అనుకొన్నాడు కృష్ణ.

అక్కడ శ్యామలని విడిచిపెట్టకుండా ఆమె వక్కపక్కనే ఈదాడు. శ్యామలకి అనుమానం రావటం మంచిదికాదు. నారాయణ లతకి కంపెనీ ఇచ్చాడు.

ఒంటిగంటవుతుండగా ఇంక చాలనుకొని తిరుగు ప్రయాణం అయ్యారు. ఆ ప్రయాణం జీవితంలో మర్చిపోమని శ్యామల,కృష్ణ నరంగుకి చెప్పారు.

మధ్యాహ్నం తెచ్చుకొన్న భోజనాలు పార్కులాంటిచోట చెట్లనీడన తిని కాస్సేపు నడుము వాల్చారు. ఆ తరువాత జార్జి ఒక వాన్ మాట్లాడాడు ఆ దీవిలో చూడాల్సిన అందమైన ప్రదేశాలు తిప్పి తీసుకువచ్చేందుకు.

దీవి అంతా చూసుకొని అయిదుగంటలకి ఎయిర్‌పోర్ట్‌కి వచ్చారు.

శ్యామల బాగ్ నర్దుతుంటే తెల్లని వగడాల కంకి కృష్ణకి కనిపించింది.

"తల్లీ! అవి ఈ దీవి నుంచి తీసుకువెళ్లటానికి ప్రయత్నిస్తే జరిమానా వేస్తాం అని బోర్డులు పెట్టారు చూడలేదా"! అన్నాడు కృష్ణ.

"ఒక్కదానికి ఏమౌతుంది? అయినా విర





వటం ఎల్లాగో అయిపోయింది ఇక్కడ పారే సినా ఒకటే తీసుకువెళ్లినా ఒకటే'' అంది శ్యామల.

"ఇటువంటి చట్టం లేకపోతే అందరూ కలిసి ఈ పాటికి ఈ కోరల్ రీఫ్‌ని నామరూపా లు 'లేకుండా నాశనం చేసేద్దురు జ్ఞానం లేకుండా. అందుకని ఆ రూల్ పెట్టారు. చదువుకొన్నవాళ్లంగా ఈ కాలేజీపట్ల గౌరవం ఉన్నవాళ్లంగా మనం పాటించాలి'' అన్నాడు కృష్ణ.

మానవ సమాజాలు ఏర్పరిచిన నీతి సూత్రా లు తప్పి చరించవచ్చా? అని కృష్ణ అంతరాత్మ ప్రశ్నించింది. చటుక్కున మౌనం వహించా డు.

అతనికి కోపం వచ్చిందని ఊహించుకొని "పోనీ మనం ఇండియా తిరిగి వెళ్లేటప్పుడు రోమ్‌మీదుగా వెళ్దాం అక్కడ నాకు మీరు కోరల్స్ కొనిపెడుదురుగాని మంచి రంగు న్నవి'' అంది శ్యామల.

"తప్పకుండాను'' అన్నాడు కృష్ణ. తను తప్పుచేసి ఉన్నాడు. దానికి జరిమానా చె ల్లించడానికి సిద్ధంగా ఉన్నాడు.

★ ★ ★

నవంబర్ నెల చివరికి వచ్చింది. లత అప్పుడప్పుడు కనిపిస్తోంది. లతమీద కలిగిన కోర్కె తీర్చుకొనే అవకాశం కృష్ణకి కలగలేదు. జార్జిలాగా, చౌదరిలాగా వ్యభిచరించగలిగిన ధైర్యంలేదతనికి. రంకుబయటపడితే శ్యామల తనని విడిచిపెట్టేసి ఇండియా వెళ్లిపోతుంది. శ్యామల తనని విడిచిపెట్టి ఇండియావెళ్తే అక్కడ అందరికి తన గురించి ఉన్న మంచి అభిప్రాయం ఇగిరిపోతుంది. అది తను సహించలేడు. అందుకని గుట్టుగా చాటుగా మాత్రమే తను లతతో సంబంధం పెట్టుకోగల డు. లత జార్జిని విడిచిపెట్టి తనను పెళ్లి చేసుకోడానికి సిద్ధపడ్డా తను శ్యామలను లత కోసం వదిలిపెట్టలేడు. లతకి కనీసం తాను మూడోవాడు. తనకి లతమీద కోర్కె ఉందికాని ప్రేమలేదు. అందుకని లతతో తను ముందరి కి వెళ్లి సంబంధం గట్టివరుచుకోలేడు. కృష్ణ





చపలత్వాన్ని వదిలిపెట్టడంలేదు. హేతువా దాన్ని విడిచిపెట్టడంలేదు. తను నడతని హేతుబద్ధం చేసుకొంటున్నాడు!

కృష్ణ లతతో తను అవలంబించాల్సిన వైఖరి గురించి ఆలోచిస్తుండగా ఒకరోజు మధ్యాహ్నం లత కృష్ణకోసం అతని డిపార్ట్‌మెంటుకి వచ్చింది.

"నాకు అర్జెంటుగా ఒక వంద డాలర్లు కావాలి'' అంది.

"నా దగ్గర డబ్బులేదు చెక్కు ఇవ్వగలను'' అన్నాడు కృష్ణ.

బ్యాంకుకి వెళ్ళి మీ చెక్కు నేను మార్చుకోలేను. మీరే మార్చి రేపు ఇవ్వండి'' అంది. అతని చెక్కు తను మారిస్తే అందరు అనుమానంగా చూస్తారంది.

"ఇక్కడకు అయితే పదకొండు గంటలకి రండి నేను ఫ్రీగా ఉంటాను'' అన్నాడు కృష్ణ.

"రేపు పొద్దున్న మా ఇంటికి రాకూడదూ. జార్జి ఇంటిలో ఉండడు'' అంది లత. లత ఆహ్వానానికి డబ్బుకి లంకెలేదు.

ఆమెకి కృష్ణ, డబ్బు రెండూ కావాలి.

"డబ్బు తీసుకుని వస్తాను'' అన్నాడు కృష్ణ.

"తీసుకురండి ఎదురు చూస్తూ ఉంటాను'' అంది లత.

లత అది మామూలు పిలుపులాగే పిలిచింది. కృష్ణ తను డబ్బు ఇవ్వటానికి మాత్రమే వెళ్తున్నట్టు మాట్లాడాడు. గుట్టుగా తను లతను కలుసుకొంటాడు. ఇది శ్యామలకిగాని మరెవ్వరికీగాని తెలియదు.

మర్నాటికోసం కృష్ణ ఎదురు చూస్తూ గడిపాడు. పొద్దున్న అతను యూనివర్సిటీకి బయల్దేరుతుంటే "శ్యామల'' నన్ను శారదింటి దగ్గర దింపండి ఇద్దరం కలిసి పి.ఓ.యస్.కి వెళ్తాం. నా ఖర్చుకోవందడాలర్లు ఇవ్వండి'' అంది.

"డబ్బెందుకు?'' అని అడిగాడు

"చెప్తాను. తరువాత'' అంది.

ఏదో సుఖం అందిస్తుందన్న ఆశతో లతకి వంద డాలర్లు ఇవ్వటానికి ఒప్పుకొన్నాడతను ఎందుకో అడగకుండా. బహుశ ఆ డబ్బు తిరిగి ఇవ్వదు. శ్యామల కొన్ని సంవత్సరాలుగా తన్ని సుఖపెట్టున్నా "ఎందుకు అంత డబ్బు?''

అని చాలా సులభంగా అడిగేయ గలిగాడు!

"అల్లాగే పద!" అని శ్యామలని తీసుకొని బాంక్‌కి వెళ్లాడు. శ్యామల ఎదురుకుండ నూటయాభై డాలర్లు తీసి నూరు ఆమెకిచ్చి యాభై జేబులో పెట్టుకొన్నాడు. శ్యామలను చౌదరి ఇంటిలో దింపి మళ్లీ యూనివర్సిటీకి వెళ్లి బాంకు దగ్గర కారాపి మరో వంద డాలర్లు తీశాడు.

"ఇందాకే కదా విత్‌డ్రా చేశావు" అంది బాంక్ అమ్మాయి.

"నిన్ను మరోసారి చూడాలనిపించి వచ్చాను" అన్నాడు కృష్ణ. ఆ అమ్మాయి కృష్ణకేసి చురుకుగా చూసింది. "నీకు మానీళ్లు వంటబట్టినట్టున్నాయి" అన్నట్టుగా.

కారక్కడే వదిలిపెట్టి లత ఇంటికి నడిచాడు. తనకారు లత ఇంటికెదురుగా పార్క్ చెయ్యటం ఇష్టంలేదు. నడుచుకొంటూ వెళ్ళేసరికి పదీయాభై అయింది. ఆ చుట్టుపట్ల పదినిముషాలు తచ్చాడి బెల్లు కొట్టాడు.

లత తలుపు తీసింది. తెల్ల కేను వేసి కుట్టిన నైటు గౌను పలుచటిది వేసుకొని ఉంది.

"సారీ! మీరు రావటం ఆలస్యం అవుతుందేమోనని ఇంకా నేను డ్రెస్ కాలేదు" అంది. అతను ఖచ్చితంగా పదకొండుకి వస్తాడని తెలిసినా.

"కాస్సేపు తిరిగిరానా?" అనుమానంగా అడిగాడు కృష్ణ.

"అక్కర్లేదు. ఎవరులేరు రండి" అంటూ వీధి తలుపు వేసి లోపలికి దారి తీసింది. నైటు గౌనులో వంపులు బరువుగా కదిలాయి.

"కొంచెం విస్కీ తీసుకొంటారా?" అని అడిగింది.

"మీరేమిచ్చినా తీసుకొంటాను" అన్నాడు.

లత అందంగా నవ్వింది. విస్కీ రాక్స్ మీద తెచ్చి ఇచ్చి తనూ తెచ్చుకొంది.

ఒక రౌండు అయ్యాక "ఇల్లు చూద్దురుగాని రండి" అంటూ పడకగదిలోకి తీసుకువెళ్లింది. ఆ గది సాధారణంగానే ఉంది. గది మధ్యలో డబుల్‌బెడ్ ఉంది.

"డబ్బు తెచ్చాను" అన్నాడు.

"ఇవ్వండి" అని అడిగి తీసుకొని బీరువాలో పెట్టుకొంది.

"మీరు మళ్లీ వెళ్లిపోవాలేమో కదా!" అంది లత.

"ఈ ఆటంక చాలు" అంటూ ఆమెను మంచం మీదకు తోసి మీద పడ్డాడు కృష్ణ. ఉద్రేకపు కెరటాలు ఉవ్వెత్తున లేచాయి ఇసుక తిన్నెలమీద పడి ఇంకిపోయాయి. కృష్ణ తనివి తీర్చుకొని పక్కమీదనుంచి లేస్తూ,

"మీకు ఎప్పుడైనా డబ్బు అవసరమైనప్పుడు నన్ను అడుగుతూ ఉండండి" అన్నాడు.

"నా కడగటానికి అభ్యంతరం లేదు కాని నేను అడిగినంత డబ్బు మీరు సర్దలేకపోతే, ఆ కారణంగా మొహం చాటెయ్యకండి. నన్ను డబ్బు మనిషిగా భావించకండి. మీరెప్పుడైనా రావాలనుకొంటే నాతో ముందుగా ఒక మాట చెప్పండి. వీలు చేసుకొంటాను. వీలు కాకపోతే కాదని చెప్తాను" అంది లత.

కృష్ణ ఆమెకి తనకి మధ్య ఉన్న మర్యాదల తెర తొలగించి, డబ్బు ముడితో వ్యాపార బంధం ఏర్పరచుకొన్నాడు. కృష్ణ వెళ్లిపోతుంటే ఆమె గుమ్మందాకా వచ్చింది. ఆమె స్మృతిలో ఆమె మొదటి భర్త మెదిలాడు.

సాయంత్రం చౌదరి శారదలు శ్యామలను తీసుకువచ్చి ఇంట్లో దించి,

"వచ్చే వారం మీ ఇంట్లో మాకు పార్టీ! కాని తొమ్మిది గంటలకి లైను క్లియర్ చేసేసి వెళ్లిపోతాం! ప్రామిస్!" అన్నారు.

"ఏమిటి మీరంటున్నారు?" అని అడిగాడు కృష్ణ అయోమయంగా. ఈ మధ్య అతని మనస్సుని పూర్తిగా లత ఆక్రమించింది.

"మీ మేరేజి యానివర్సరీ! మర్చిపోయారా? శ్యామలగారు మీకు తనకి బట్టలు కొన్నారు. నేనే షాంపైన్ బాటిల్ కొనిపించాను" అని చెప్పింది శారద.

కృష్ణ ఉత్సాహం చూపించలేకపోయాడు. అతనికి శ్యామలపట్ల తప్పు చేశానన్న పాప భావం కలిగినది. తను పాడుపని చేశాడు. అది చేసే వరకు ఎప్పుడు చేస్తానా అని ఎదురు చూశాడు. చేశాక మరి ఈ పాపం చేశానన్న

భావం ఏమిటి? తనకి శ్యామల దగ్గర దొరక నిది, ఏమిటి లత దగ్గర దొరికింది? చీప్ థ్రిల్! అందరూ తనుపొందనిది ఏదో పొందేస్తున్నారు తనూ పొందాలనుకొన్నాడు. క్షణిక సుఖాన్ని పొంది, నిరంతర వేదన తెచ్చుకొన్నాడా?

"ఏమిటో దీర్ఘాలోచనలో ఉన్నారు?" అని అడిగాడు చౌదరి.

"ఏం లేదు! మీరు పార్టీకి వచ్చే రోజున ఏమేమి కూరలు వండించాలా అని" అని నర్దేసాడు కృష్ణ.

"మీరు ఏమన్నా వండించండి నేను అవ కాయ తీనుకువస్తాను మాకు ఆవకాయ ఎర్రటి రంగుకి టెంప్ట్ అయి జిహ్వాచాపల్యం తీర్చు కొంటే ఆ తరువాత ఎసిడిటీ బాధ పడాల్సి రావచ్చు!

కృష్ణ పాపం చేశానన్న భావననుంచి బయట పడటానికి చేసిన పనిని బుద్ధితో సమర్థించాడు. శ్యామలకి తను ఏమీ లోటు చెయ్యడంలేదు. తనూ, శ్యామల కలిసి భోంచే స్తారు. తనకి ఆకలెక్కువ వేసినపూట పైన టిఫిన్ తింటాడు. అది శ్యామలకి ద్రోహం చెయ్యటం ఎల్లా అవుతుంది? లతతో తను పొందుతున్నది అనుభవం, అనుభూతి కాదు. శ్యామలే తనకి టిఫిన్ అందించగలదని కాని ఆమెకు కూడా ఆకలి ఎక్కువ వెయ్యవచ్చునని కాని అతను ఆలోచించలేదు. సమర్థించే పద్ధతిలో ఇబ్బందిపెట్టే ఆలోచనలను అణిచి పెట్టుకొని అటువంటివి అసలు లేనట్టు ఆత్మ వంచన చేసుకోక తప్పదు.

లతను మరో రెండుసార్లు కలిశాడు. ఆమె అడగకుండా డబ్బు ముట్టచెప్పాడు. ఆవి ధంగా ఆమెను వేశ్య స్థాయికి తన మనసులో దించుకొని తృప్తి పడ్డాడు. లత ఆ డబ్బుని వద్దనలేదు.

ఒకరోజు రాత్రి శ్యామల అస్వస్థతవల్ల "ఇ వాళ వద్దు కృష్ణా!" అని అభ్యంతరం చె ప్పింది. మర్నాడు పొద్దున్న నిద్ర లేచినప్పటి నుంచి "నిన్న రాత్రి నాకాకలి తీరలేదు" అనుకోసాగాడు కృష్ణ. డిపార్టుమెంట్‌కి వెళ్లాడు. ఆరోజు అతనికి క్లాసులు లేవు. జనవరి చిరు చలిగా ఉంది. లేచి నెమ్మదిగా లత డిపార్టు మెంటువేపు నడిచాడు. జీతం ఇరవై నాలుగో తారీకున కానిరాదు. ఇంకా నాలుగురోజు లుంది. సంక్రాంతికి డబ్బు ఖర్చుపెట్టేశాడు. లత డబ్బు లేకుండా వెళ్తే ఏమంటుందో!

లత ఉంది. "ఖాళీగా ఉన్నావా?" అని అడిగాడు కృష్ణ.

"మాగైడు కాన్ఫరెన్సుకి వెళ్లాడు- ఖాళీయే" అంది.

"వెళ్దాం!" అన్నాడు కృష్ణ.

"సినిమాకా?"

"కాదు...మీ ఇంటికి"

"జార్జి ఇంట్లో ఉన్నాడు. రేపు మధ్యాహ్నం వీలు"

కృష్ణకి రెండోసారి 'లేదు' అనిపించుకో డంతో కోర్కె ఎక్కువైంది.

"ఇప్పుడే ఎక్కడైనా సరే!"

"మీ ఇంట్లో?"

"శ్యామల ఉంది"

లత ఆలోచించింది. "మాగైడు ఆఫీసు రూము తాళంచెవి నాదగ్గర ఉంది. దానికి కొంత ప్రైవెసీ ఉంది కాని ఆయన లేనప్పుడు ఆ గదిలో అలికిడి విని ఎవరైనా రావచ్చును. హొటలుకి వెళ్దాం."

"నాదగ్గర ఇప్పుడు డబ్బు లేదు. కాని నువ్వు ఇప్పుడే ఈ క్షణాన్నే నాకు కావాలి" కృష్ణ తాయిలం కోరే చిన్న పిల్లాడిలాగా-

"పద కృష్ణా!" అంటూ లత దారి తీసింది.

ఆ గదిలో పుస్తకాల బీరువాలమధ్య కొంత వీలుగానే ఉంది. నేలమీద మెత్తటి కార్పెట్ కూడా ఉంది.

"కొంచెం నిశ్శబ్దంగా పని కానిచ్చుకోవాలి మరి" అంది లత. కృష్ణ అర్థమైనట్లు తలా డించాడు.

కక్కుర్తి పని పూర్తయ్యాక, "నీకివ్వటానికి కూడా నాదగ్గర డబ్బులేదు" అన్నాడు జంకుగా.

"పిచ్చి కృష్ణా! నువ్వు పూర్వం మూడుసార్లు డబ్బిచ్చావు. మొదటిసారి నిజంగా నా అవస రానికి నేనే నిన్ను అడిగాను. ఆ తరువాత రెండుసార్లు అది నారేటని నువ్వు ఊహించు కొని డబ్బు నాచేతిలో పెట్టావు. నువ్వు ఈ దేశం





వచ్చింది, నేను ఈ దేశంలో ఉండిపోయింది డబ్బు కోసమే కదా! అందుకని నీ అంతట నువ్వు ఇచ్చిన డబ్బు నేను వద్దనలేదు. నాకు నువ్వు వెలకట్టే కాదనలేదు. ఇన్ని సంవత్సరాలి క్కడ ఉన్నాక అది నాకు తప్పుగా అనిపించలేదు కాని నాకో రేటుందని ఎందుకనుకొన్నావు? ఈ రేటిచ్చిన అందరిలోను నేను పక్క పంచుకోడానికి సిద్ధపడ్తాననుకొన్నావా? నారాయణ మా ఇంటికి చాలా సార్లు వచ్చాడు. మా ఇద్దరిమధ్యా ఈ సంబంధం లేదు. భోజనం కోసంవచ్చి భోంచేసి పోతాడు. ఆక్షణంలో అతను నాకు నా తమ్ముడిలాగా అనిపిస్తాడు. అమెరికానుంచి వస్తువులు తెచ్చి మాద్వారా అమ్ముకొని మాకు తన లాభంలో వాటా ఇస్తాడు. అప్పుడతను మాక్లయెంట్. కాని నువ్వు వేరు కృష్ణా!" అంది లత కళ్లల్లో నీళ్లు తిరిగాయి.

"ఏవిధంగా?" అని అడిగాడు కృష్ణ. తనకి లత ఒక స్పెషల్ స్టేటస్ ఇచ్చిందన్న భావం కించిత్తు గర్వం కలుగచెయ్యగా.

"నీలో నేను పోగొట్టుకున్న నాభర్తని వెతుక్కుంటున్నాను. అతను పోయేనాటికి నీ వయస్సువాడు. నీలాగే ఉండేవాడు. నేను వయస్సులో పెరిగినా ఆయన నా స్మృతుల్లో నీ వయస్సులోనే మిగిలిపోయాడు. ఆయన నేను పోగొట్టుకొన్న స్వర్గం. ఆస్వర్గం మళ్లీ నాచెయ్యి చిక్కదని నాకు తెలును. నన్ను మనస్ఫూర్తిగా కోరిన ఆ మనిషికోసం నా తహతహ నీ దగ్గరికి నన్ను చేర్చింది. నువ్వు నా భర్తవికావు. ఇంకొకరివాడివి. నీ సంసారాన్ని పాడు చెయ్యాలన్న కోర్కె నాకు లేదు. కాని నీ సన్నిధిలో, నీలో ఆయనను ఊహించుకొంటూ కాలంలో వెనక్కి వెళ్లినట్టు నన్ను నేను నమ్మించుకొంటూ తృప్తి పడ్తూ ఉంటాను. నాప్రేమకు నువ్వు కావాలి కృష్ణా! నాప్రేమకి మనిషి కావాలి!" అని రోదించింది లత.

ఆమె ఏడుపు కృష్ణని ఆక్షణంలో కదిలించింది.

"నీకు నేనున్నాను లతా! నిన్ను నేను మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాను" అన్నాడు. లత ఏడుపుమాని నవ్వింది.

"నాకోసం నువ్వు శ్యామలని విడిచిపెట్టగలవా?" అని అడిగింది.

కృష్ణ జవాబు చెప్పలేదు. అతను చెప్పలేదని ఆమెకి తెలును. క్షణికావేశంలో చేసిన బాసలవిలువ, పనుల ఫలితాలు ఆమెకి బాగా తెలును. ఆమెకి తనది ఒక కల అని తెలును. కాని ఆ కల ఆమెకి కొద్దిసేపే అయినా ఆనందం కలిగిస్తోంది. ఆ కల మళ్ళీ మళ్ళీ రావాలని ఆశపడుతోంది.

ఆ గది నుంచి బయటకి వచ్చాక కృష్ణకి ఆవేశం తగ్గింది. బుద్ధి మామూలుగా పనిచేయటం మొదలుపెట్టింది.

"నీ గైడు గది తాళంచెవులు నీదగ్గరెలా ఉన్నాయి?" అని అడిగాడు లతని.

"అతను డిగ్రీ సులభంగా వచ్చేలా చేస్తానని నన్ను మరికొందర్ని మురిపించి మమ్మల్ని తన మందలో చేర్చుకొన్నాడు. ఆ గదిలో నాకు పనికివచ్చే పుస్తకాలున్నాయి. అందుకని నాకు తాళం చెవి ఇచ్చాడు. నాకు డిగ్రీ సులభంగా ఇప్పించటంలో ఒక భాగం అతని పుస్తకాలు నన్ను వాడుకోనివ్వటం. అందుకుగాను అతను ప్రతిఫలంగా నా దేహాన్ని వాడుకొంటాడు" అని లత సిగ్గుపడకుండా యదార్థాన్ని నిర్లిప్తంగా చెప్పింది.

"అయితే లతను పొందిన మగవాళ్లలో నేను కనీసం నాలుగోవాడిని. అంటే నేను లతను చెడపలేదు. ఈమె కోసం తను త్యాగాలు చేయక్కర్లేదు. శ్యామలను పోగొట్టుకోనక్కర్లేదు. ఈమె తనలో తన మొదటి మొగుడ్ని చూసుకొంటోంది. దాని ప్రతిఫలంగా తనకి కొంత సుఖాన్నిస్తోంది. ఇటువంటి ఏర్పాటు ఇంతకుముందే... అంటే ఇచ్చిపుచ్చుకొనే ఏర్పాటు... ఆమెకు ఆమె గైడుతో ఉంది... నేను చేస్తున్న పనిలో తప్పులేదు. లతనుంచి తాను పొందేది ఈజీక్వల్‌టు నా అవసరం మైనస్ శ్యామల అందించగలిగింది మాత్రమే! ఫెయిర్ ఇనఫ్" అని తన ప్రవర్తనను సమీకరించుకొన్నాడు. కాని లత అతని నుంచి అనురాగాన్ని విశ్వాసాన్ని కోరలేదని తన అనురాగాన్ని వర్షించేందుకు మాత్రమే అతన్ని కోరుకుందని అతనికి తట్టలేదు.

కృష్ణది ప్రేమకాదు సరికదా! బలమైన కోరిక కూడా కాదు. ఈ దీవుల్లో ఆడవాళ్ళత



సంబంధం పెట్టుకోవటం సులభం. అందరు పెట్టుకొంటున్నారు. తను మాత్రం చేతకానట్టు ఎందుకు ఇటువంటి అవకాశాన్ని పోనిచ్చుకోవాలి. కృష్ణ విషయంలో మగవారిలో సహజంగా ఉండే చపలత్వానికి అవకాశం జోడైంది.



శ్యామల ఒకరోజు తూనాపూనా కూరల మార్కెట్టులో వాళ్ళకి సపోటాలు అమ్మి వస్తుంటే కృష్ణ లత ఇంటికి వెళ్ళటం కళ్ళబడింది.

"ఈయనకి లతతో ఏంపనబ్బా!" అని ఆశ్చర్యపోయింది. "జార్జికోసం ఏదో పనుండి వెళ్ళారు కాబోలు" అనుకొంది. కారు కోసం వెదికింది. కొంచెం దూరంగా తమ కారు కనిపించింది. తనూ లత వాళ్ళింటికి వెళ్ళి కృష్ణని పట్టుకొని కార్లో తనని ఇంట్లో దింపి యూ.వికి వెళ్ళమని అడగాలని వెళ్ళింది. ఇంటినానుకొనిఉన్న షాపు మూసిఉంది. ఇంటి తలుపు మూసి ఉంది. చెయ్యి బెల్లుదాకా వెళ్ళింది. కాని స్త్రీ సహజమైన అనుమానం కలిగింది. శ్యామల బెల్లుకొట్టకుండా ఇంటి చుట్టూ తిరిగి బెడ్ రూమ్ కిటికీ దగ్గరికి నడిచింది. కిటికీకి కర్టెన్‌వేసిఉంది. లత గొంతుక వినిపిస్తోంది. జాగ్రత్తగా కర్టెను కొద్దిగా తొలగించి చూసింది. అనుమానించినది కళ్ళబడింది.

అక్కడ ఒకక్షణం ఉండలేక శబ్దం చేయకుండా వీధిదాకా వచ్చి ఇంటికి వడివడిగా నడవసాగింది. పక్కనే కారాగితే ఆగకుండా నడవబోయింది.

"మీరు నన్ను చూసి కూడా వెళ్తున్నారేం?" అన్న నారాయణ మాటలతో నిలిచిపోక తప్పిందికాదు.

"రండి ఇంట్లో దిగవిడిచిపోతాను" అన్నాడు నారాయణ. శ్యామల మాట్లాడకుండా కారెక్కి కూర్చుంది.

"ఎల్ డురాడోలో వైట్ మగరుందంటే వెళ్ళి వస్తున్నాను" అన్నాడు నారాయణ. శ్యామల ఏమీ అనలేదు.

"కృష్ణ కారు బజారులోనే ఉందే" అన్నాడు.

"ఆయన బిజీగా ఉన్నారు ఏదో పనిలో. అందుకని వెళ్ళిపోతానని చెప్పి వచ్చేస్తున్నాను" అంది శ్యామల. శ్యామల మొహం ఎర్రగా కందిఉంది. కళ్ళు వర్షించడానికి సిద్ధంగా ఉన్నాయి.

నారాయణ శ్యామల లత ఇంటి గేటు తెరుచుకొని బయటపడటంచూసి ఉన్నాడు. కాని "లత ఇంటి నుంచేనా?" అని అడగలేదు.

ఇంటికి దగ్గర దిగి శ్యామల నారాయణని లోపలికి రమ్మనకుండా లోపలికి వెళ్ళిపోయి మంచంమీద పడుకుని భోరుమని ఏడ్చేసింది. నారాయణ శ్యామల ప్రవర్తనకి కొంచెం ఆశ్చర్యపోయి వెళ్ళిపోయాడు.

తనేం చేయాలి? తన వాళ్ళని తన దేశానికి దూరంగా ఉన్న తను కృష్ణని పోగొట్టుకొంటోంది. తను శారదకి ఎంత సులభంగా సలహా ఇచ్చింది! భర్తని ఇతరుల నుంచి రక్షించుకోవడం ఎలాగో చెప్పింది. తనతో కృష్ణ ఎక్కువసార్లు రతిలో పాల్గొనేలా చూసుకోవాలా? లతతో పక్కని పంచుకొన్న కృష్ణని తను దగ్గరకు రానీయగలదా? లేదు అది చెప్పినంత సులభంకాదు.

తను సీతా, సావిత్రికాదు. తను శ్యామల. తన భర్త వేరే కంపెనీ కోరుకున్నాడు తనూ వెతుక్కుంటానని కృష్ణతో అంది. తాను తను నిజంగా ఆ పనిచేయగలదా?

శ్యామల ఆలోచనలో పడింది. దుఃఖం బదులు కోపం చోటుచేసుకొంది. తనూ కంపెనీ వెతుక్కోగలదు! కృష్ణకి పాఠం చెప్పగలదు. నారాయణ ఇప్పుడే ఇంటికి వెళ్ళాడు. ఇంట్లో ఉంటాడు.





ముఖం కడుక్కొని తయారై పెర్ఫ్యూమ్ వేసుకొని ఫ్లొరెల్ ఫ్లాట్స్‌కి బయల్దేరింది అవేశంతో.

నారాయణ తలుపు కొట్టింది. నారాయణ తలుపు తీశాడు. "రండి. వంట చేస్తున్నాను" అన్నాడు.

"మీ స్పానిష్ లేడీకే గాదు నాకూ ధైర్యం ఉంది. అందుకే వచ్చాను. మీ వంట తింటాను" అంటూ లోపలికి నడిచింది.

నారాయణ తలుపు మూశాడు.

"మీకంత ధైర్యంటా" అన్నాడు.

"ఎంత?" అంది శ్యామల.

"ఆమెకున్నంత!"

"ఉంది" అంటూ నారాయణని గట్టిగా కౌగలించుకొంది.

నదిలో కొట్టుకొనిపోతున్న మనిషి కొయ్యముక్క దొరికితే పట్టుగొన్నట్టుగా గట్టిగా పట్టుకొంది. పట్టుకొన్నాక దుఃఖం కట్టలు తెంచుకొంది.

"ఏమైంది శ్యామలా?" అని అడిగాడు నారాయణ ఆమెను దగ్గరకి తీసుకుంటూ.

"కృష్ణ నన్ను మోసం చేస్తున్నాడు" అంది రోదిస్తూ.

"అందుకని అతనిని మీరు అసహ్యించుకొంటున్నారా?"

"లేదు"

"మరి దీనికర్థం"

"నాకు తెలియదు. నాకీక్షణాన్న మీనుంచి ఓదార్పుకావాలి".

నారాయణ ఆమెను పడకగదిలోకి తీసుకువెళ్లాడు. వనిత కోరిరాగా చులకన చెయ్యటానికి అతను ప్రవరాఖ్యుడు కాదు.

అతను అస్ఖలిత బ్రహ్మచారి కాదని, అనుభవజ్ఞుడేనని శ్యామల అంత ఆవేశంలోనూ గమనించింది.

కృష్ణ చపలత్వంతోను, శ్యామల కోపంతోను తప్పి చరించారు. ఒకసారి గట్టు దాటాక మరెన్ని సార్లయినా దాటగలుగుతారు. అందుకని తరువాత అప్పుడప్పుడు చరిస్తూనే వచ్చారు అవే కారణాలకి!

మారిన శ్యామల తన వేషం మార్చుకొంది. స్థానికులైన స్త్రీలలాగా జుట్టు కత్తిరించుకొంది. స్కర్టులు, లోనెక్ బ్లౌజులు ధరించసాగింది. కృష్ణ శ్యామలలో మార్పు గమనించినా దాన్ని పట్టించుకోలేదు. శ్యామల, కృష్ణ ఒకరివల్ల మరొకరు అనురాగం నటించడం నేర్చుకొన్నారు. కృష్ణకి శ్యామలపట్ల అనుమానం మాత్రం కలగలేదు.

ఆ శని ఆదివారాల్లో రాజన్ కుటుంబం కృష్ణ వాళ్లింటికి వచ్చారు. శ్యామల, కృష్ణ వాళ్లని సాదరంగా ఆహ్వానించారు. ఇల్లు చూపించారు. కాఫీలు తాగుతుంటే మీనా "మీరు జుట్టు ఎక్కడ కట్‌చేయించుకొన్నారు? ఎంత ఇచ్చారు?" అని అడిగింది.

శ్యామల చెప్పింది-

"మీకు ఇల్లాంటి వాటివల్ల అంటే పునిస్త్రీవాళ్లు జుట్టు కత్తిరించుకోవడంవల్ల పట్టింపులు లేవా?" అని అడిగాడు రాజన్. "లేవు" అన్నాడు కృష్ణ. లలిత విషయంలో తప్ప అతని ప్రవర్తన ఆలోచన మామూలుగానే ఉన్నాయి.

"నాకు చాలా ఉన్నాయి. మా అమ్మ నన్ను చాలా ఛాందసంగా పెంచింది. మా ఆవిడ కాని, మా అమ్మాయిగాని జుట్టు కత్తిరించుకొంటానంటే ఛస్తే ఒప్పుకోను" అన్నాడు రాజన్. "ఎందుకని?" అని ఆశ్చర్యంగా అడిగాడు కృష్ణ.

"ఇది మన పవిత్ర భారత సంస్కృతికి వ్యతిరేకం" అని రాజన్ నిస్సందేహంతో చెప్పాడు.

"మీరు భారత సంస్కృతికి వ్యతిరేకమైనవి ఏమీ చెయ్యరా?"

"మా అమ్మాయిని పేంట్లు వేసుకోనివ్వను. బొట్టు లేకుండా బోసిముఖంతో ఉండనివ్వను"

"అన్నీ మీ అమ్మాయి గురించి చెప్తున్నారు!"

"మా ఆవిడనూ చెయ్యనివ్వను. ఆవిడ పాతకాలపు మనిషి. మా తమిళుల్లో ఆచారాలకి చాలా విలువనిస్తాం. కనుక తనూ చెయ్యదు. మా అమ్మాయి చిన్నపిల్ల కనుక ఎప్పుడైనా ఏదైనా చెయ్యాలన్న కోరిక వెలిబుచ్చితే మీనాకి నేను మన విశిష్ట సాంప్రదాయాల గురించి చెప్తాను"

"నేనడిగేది మీ గురించి?"

"అంటే?... నేనెప్పుడూ జంధ్యం కూడా తియ్యను"

"మీకు సాంప్రదాయంవల్ల అంత మక్కువ కదా! మరి మీకు పిలక లేదేమి? మీరు ధోవతి కట్టుకొని ఉత్తరీయం ఎందుకు కప్పుకో లేదు. ఈ పాంటు ఏమిటి? ఈ టీషర్ట్ ఏమిటి? ఇది సాంప్రదాయమా?"

"ఉద్యోగం చేస్తున్నవాళ్లకి కుదరదుకదా!"

"అంటే మీ సాంప్రదాయాన్ని అవసరంబట్టీ అతిక్రమించవచ్చు. పూర్వం రోజుల్లో భారతీయులు ఉద్యోగానికి కూడా వంచకట్టుతోనే వెళ్లేవారు. మా తాతగారు టెన్నిస్ కూడా వంచతోనే ఆడేవాడు"

"ఇప్పుడు ఎవరూ చెయ్యటం లేదుకదా! మనం ఒక్కళ్లం ఎల్లా చేస్తాం?"

"అందరూ అతిక్రమిస్తే మీరూ అతిక్రమించడానికి మీకు అభ్యంతరంలేదన్నమాట? దానికి మన ఆచారాల విశిష్టత అడ్డువడదన్నమాట!"

"అంతే"

"సాంప్రదాయమంటే గౌరవంకాదు మీకున్నది. అతిక్రమిస్తే ఎవరన్నా ఏమన్నా అంటారేమోనన్న బెరుకు"

"మన సంస్కృతిపట్ల మీకు గౌరవం లేదనుకొంటాను" అన్నాడు రాజన్ డిఫెన్స్ నుంచి, అఫెన్సులోకి మారుతూ.

"సంస్కృతివట్ల నాగౌరవాన్ని స్త్రీలకి మాత్రమే వర్తించే సూత్రాలు పాటించటం ద్వారా చూపించను. మగవాళ్లు చేస్తే తప్పుగాని పని స్త్రీలు చేసినా తప్పుకాదు" శ్యామల కృష్ణకేసి సాలోచనగా చూసింది.

"మీరు తాగి, మీ ఆవిడచేత తాగిస్తారా?"

"నేను తాగటంలో తప్పులేకపోతే మా ఆవిడ తాగటంలోనూ తప్పులేదు. తనకి ఇష్టం అయి తాగితే నాకభ్యంతరంలేదు. నిజానికి మా ఆవిడ కొన్నిసార్లు బీరు తాగుతుంది. చాటుగాకాదు అందరితోపాటే!"

ఏకాంతంలో బుజ్జగించి భార్యలచేత తాగించేభర్తలున్నారని కృష్ణకి తెలుసు. అల్లా తాగే భార్యలు నలుగురిలో అసలు డ్రింక్స్ రుచీ తెలియనట్టు మాట్లాడటమూ తెలుసు.

"మీ అభిప్రాయాలు చాలా ఘాటుగా ఉన్నాయి"

"నాకసలు విప్లవభావాలు లేనేలేవు. కాని సాంప్రదాయాలవట్ల లేని గౌరవం చూపెట్టాలని తాపత్రయపడను"

"ఒక విషయం చెప్పండి. ఒక భర్త పరస్త్రీలతో సంబంధం కలిగి ఉంటాడనుకోండి. అప్పుడతని భార్య కూడా మరో పురుషుడితో సంబంధం పెట్టుకోవచ్చుంటారా?" రాజన్ చాలా బలమైన వాదన చేశాననుకొన్నాడు.

"పెట్టుకోవచ్చు. అది ఆమె ఇష్టాఇష్టాలనుబట్టీ ఉంటుంది. ఆమె పెట్టుకోడం తప్పయితే అతను పెట్టుకోడమూ తప్పే. అతను పెట్టుకోడం తప్పుకాకపోతే ఆమె పెట్టుకోడం తప్పుకాదు. నాకు డబుల్ స్టాండర్డ్స్ అంటే కిట్టవు. కాని అతను పెట్టుకొన్నాడు కదా! అని కోపంతో, ఇష్టంతోకాక ఆమె సంబంధం పెట్టుకొంటే జాలి పడాల్సిన విషయం. తమకి ఆనందం కలిగించనివని చెయ్యకూడదు ఎప్పుడూ ఇలాంటి విషయాల్లో."

కృష్ణ ఆ మాటలు చాలా ధైర్యంగా అన్నాడు. అతనికాక్షణాన్న శ్యామల అంతపనీ చేస్తున్నదనీ తెలియదు. అన్నాక కృష్ణ ఆగాడు. ఆగి ఆలోచనలో పడ్డాడు. శ్యామల నిజంగా అంత పని చేస్తే తను ఆదరించగలడా? లేడు! కాని శ్యామలభారత స్త్రీ కనుక అవని చెయ్యరాదన్న కారణంతోకాదు. తను కూడా సాధారణ భారత పురుషుడు కనుక, తనలో డబుల్ స్టాండర్డ్స్ జీర్ణించుకుపోయి ఉన్నాయి కనక, తనభార్య అంతపనీ ఏనాటికి చెయ్యదన్న ధైర్యంవల్ల అనగలిగాడు.

కృష్ణమాటలు శ్యామలకి సూటిగా తగిలాయి. తను నారాయణమీద కోర్కెతో అతని పొందు అనుభవించలేదు. కృష్ణమీద కోపంత తనదేహాన్ని నారాయణని వాడుకోనిచ్చింది తన ప్రవర్తన సరైనదేనా? తను బహుశ కృష్ణని చూడగానే మందలించి ఉండాల్సింది. ఏం చేసేవాడు? కావాలంటే నువ్వూ నీకిష్టమైన వాడితో ఫో!" అనేవాడేమో.

ఉమ ఉన్నట్టుండి, "నాకు చాలా సంతోషంగా ఉందివాళ. మా ఆయన అన్ని రూల్స్ నూ మావైపే పెట్టూ ఉంటారు. మీరు ఆయన తప్పు ఎత్తి చూపించారు" అంది. అందులో తిరుగుబాటు ధ్వనించింది.

శ్యామల పెట్టిన టిఫిన్లు తిని రాజన్‌కు టుంబం సెలవు తీసుకొంది.

"ఆవిడేదో పెద్ద భర్తకిష్టమైనవన్నీ చేస్తున్నట్టు. వాళ్లమ్మాయి మేగజైన్‌కిచ్చిన ఫొటోలు తను దగ్గరుండే తీయించింది కదా!" అంది శ్యామల. రాజన్ ఉమని తనని పోల్చి అనకపోయినా అన్నవన్నీ ఇద్దరితో తేడాలు బయటపెట్టడంవల్ల జనించిన కోపంతో-

"డబ్బు వచ్చేచోట అది ఉద్యోగం అయినా మరొకటి అయినా కొందరికి ఆచారాలు అడ్డురావు. మరీ పెద్దమొత్తంలో డబ్బు వచ్చేటట్టుంటే భార్యని తార్చి పూర్వం అతిథులకి భార్యల నప్పగించే పవిత్రసాంప్రదాయం ఉంది మనదేశంలో. దాన్ని పాటించాం అంటారు" అన్నాడు కృష్ణ.

శ్యామల శారదసహాయంతో లేడీ డాక్టర్ దగ్గరకు వెళ్లి పరీక్ష చేయించుకొంది. ఆమె అనుమానం నిజం అయింది. శ్యామల తను గర్భంధరించానని తెలుసుకొని పొందాల్సిన ఆనందం పొందలేకపోయింది.

"అక్కా! కంగ్రాట్స్" అంది శారద టాక్సీలో.

"ఆ?" అంది ఆలోచనల్లో పడ్డ శ్యామల.

"కంగ్రాట్స్! బావగార్నుంచి మంచిపార్టీ గుంజాలి!" అంది శారద.

శ్యామల కంగారుపడింది.

"బావగారితో ఈవిషయం ముందు నన్ను చెప్పనీ. నేను చెప్పాక నువ్వు పార్టీ అడుగుదువుగాని"

"అంటే ఏ డైమండ్ నెక్లెస్‌కో ముందు ఉన్న డబ్బంతా ఖర్చుపెట్టించి చవకగా మాపార్టీ తేల్చాలనా?"

"కాదు శారదా! గివ్‌మి సమ్ టైమ్"

"ఓకే. కొద్దిగా మాత్రమే... రోజులు... వారాలు కాదు!"

శ్యామల మొహమాటంగా నవ్వింది. కృష్ణతో తను ఏమంటుంది? సినిమాల్లోలాగా "మన ప్రేమ ఫలం నా కడుపులో పెరుగుతోంది" అంటుందా? లేక "మనకో బాబు పుట్టబోతున్నాడు" అని చెప్పి సిగ్గుతో చేతుల్లో మొహం దాచుకొంటుందా? సిగ్గు వస్తుంది కాని మరెందుకు. "పిల్ల లేక పిల్లవాడు నీ సంతానమే" అని చెప్పలేనందుకు.

తనుచేసింది నవ్యమైన పనేనా? తను ఎవరి సంతానాన్ని మోస్తోంది? నారాయణది? నారాయణది అయితే పుట్టాక తనకి పోలికల్లో తెలియకపోదు! అనుమానం లేకపోతే పోలికలు చప్పున కనపడవు కనుక కృష్ణకి తెలియకపోవచ్చును. నారాయణ సంతానమే అయి కృష్ణకి తెలిస్తే ఆ బిడ్డఇంట్లో తిరుగుతుంటే అతనిభావాలు ఎల్లా ఉంటాయి. లతకి కృష్ణవల్ల బిడ్డపుట్టి తన ఇంట్లో తిరుగుతుంటే తను భరించగలదా? లేదు. కృష్ణ లతతో ఏర్పరచుకొన్న సంబంధాన్నే భరించలేకపోయింది.

తను ఈవిషయం కృష్ణ నుంచి దాచలేదు ఎన్నోరోజులు. కృష్ణ తన పట్ల చేసిన నేరానికి తను అతనికి విధించిన శిక్ష చాలా పెద్దది! ఇల్లా ఆలోచిస్తూ ఇల్లు చేరుకొంది.

శ్యామల ఎప్పుడు కృష్ణకి ఎల్లా చెప్పాలా అని మథనపడసాగింది. ఆశ్చర్యంగా ఒకరోజు కృష్ణే అడిగాడు, "శ్యామలా! నువ్వు ప్రెగ్నెంటా?" అని.

"ఎవరు చెప్పారు-శారదా?" అని అడిగింది శ్యామల.

"శారదకి తెలుసా?"

"తెలును...నాతో డాక్టర్ దగ్గరకి వచ్చింది. తనేనా మీకు చెప్పింది?"

"కాదు...నువ్వే!"

"నేనా...ఎప్పుడు?"

"ఈమధ్య"

"ఏరోజు"

"ఒక మాటలో. ఒక టైములో కాదు. నీలో వస్తున్న మార్పులు నాకు తెలియవా?"

"అంటే?"

"ప్రబంధాలు చదివినవాడిని శ్యామలా! గర్భంవల్ల స్త్రీ నడకలో మార్పువస్తుందని, దేహం నునుపు తేలుతుందని, వక్షోజాలు నిండుగా, పెద్దవిగా అవుతాయని, కుదుర్లు నల్లబారుతాయని తెలిసినవాడిని. అన్నీ కాకపోయినా కొన్ని మార్పులు తెలుస్తూనే ఉన్నాయి" అన్నాడు మధురంగా నవ్వుతూ.





ఒకక్షణంపాటు శ్యామల కృష్ణ నవ్వువలన మైమరుపుకలిగి పాత శ్యామల అయింది. కాని ఆ క్షణాన్ని మధురంగా కృష్ణతో పంచుకోగల మానసిక స్థితిలో లేదు.

"ఆర్యూ హేపీ?" అని అడిగింది.

"వై నాట్...నా మగతనం రుజువు అయిన ఈ సందర్భంలో నా ఇగో పెరిగిపోయి సంతోషం కలుగుతోంది- కలుగకుండా ఎల్లా?" అన్నాడు కృష్ణ. కృష్ణ సాధారణపు భర్త పొందే ఆనందం పొందుతున్నాడు. అతని మనస్సులో లతలేదు. తనతో కష్టసుఖాలు కొద్ది సంవత్సరాలుగా పంచుకొంటూవచ్చిన శ్యామలపట్ల అనురాగం నిండిఉంది. తన 'వంశం' పెరగబోతోంది అన్న ఆనందంఉంది. అది ఈమె ద్వారా జరుగుతోందన్న కృతజ్ఞతఉంది.

"నిన్ను కాలుకింద పెట్టనివ్వకుండా జాగ్రత్తగా చూసుకొంటాను. లేకపోతే మీ పుట్టింటికి పంపించేస్తాను- రెస్ట్ తీసుకొందువుగాని"

శ్యామలకి కూడా అది నచ్చింది. ఇక్కడికి దూరంగా వెళ్లటం తక్షణ కర్తవ్యం. ఇండియా వెళ్ళిపోయి లతకి, నారాయణకి దూరంగా ఉంటే ఏమీ జరగనట్టు ఉండి కొత్తజీవితం మొదలుపెట్టవచ్చు.

"అల్లాగే! కాని మీరు మాత్రం మరో కాంట్రాక్టు తీసుకోకండి" అంది శ్యామల.

కృష్ణ దగ్గరకి తీసుకున్నాడు శ్యామలని. శ్యామల కన్నీళ్ళు పెట్టుకుంది. "ఈ కౌగిలి విడరాదు" అంది.

"పిచ్చిదానా! ఎందుకు విడుతుంది!" అన్నాడు కృష్ణ. ఆ క్షణాన్న అతనికి సహజంగానే ఆమెపట్ల ప్రేమ విరిసింది. ఒకరోజు ప్రొద్దునే చౌదరి వచ్చి శారదను శామల దగ్గర దించి, "పదండి మన ప్రసాద్ నిన్న సూయిసైడ్ చేసుకున్నాడు. మనం పోస్ట్‌మార్టమ్ అయ్యాక బాడీని అప్పచెప్పుకోవాలి" అన్నాడు హడావిడిగా. అతని మొహం పీక్కుపోయి ఉంది. కృష్ణ తయారౌతుంటే "ఎందుకుట?" అని శ్యామల అడిగింది.

"అతని పెళ్ళాం పెళ్లయ్యాక కూడా తన బుద్ధులు మార్చుకోలేదుట" అంది శారద చటుక్కున.

"నేను పెళ్లయిన ఇన్ని సంవత్సరాలకి బుద్ధులు మార్చుకొంటున్నాను కదా" అనుకొన్నాడు కృష్ణ. చౌదరి తేలుకుట్టిన దొంగలాగా ఊరుకున్నాడు.

ఆస్పత్రికి వెళ్ళి దేహం అప్పచెప్పమన్నారు. భార్య అనుమతి తెచ్చుకోమన్నారు వాళ్ళు.

"అంత్యక్రియలకి నువ్వు ఏర్పాటుచేసుకొంటున్నావా? నేను చెయ్యనా?" అని చౌదరి స్నేహని సూటిగా అడిగాడు.

"నువ్వు అతన్ని నాకు పరిచయంచేశావు. నువ్వే అతన్ని నాకుదూరంగా పట్టుకుపోతానంటున్నావు కానియ్యి" అని భోరున ఏడ్చింది స్నేహ. అందులోని గూఢార్థం చౌదరికి చెంపపెట్టులా తగిలింది. ఆమె ఏడ్పు తెచ్చిపెట్టుకున్న ఏడ్పులాగాలేదు.

స్నేహకి ప్రసాద్ సహచర్యంలో అతనిమీద ప్రేమ ఏర్పడిఉంటుంది. కాని అది వివాహ బంధాన్ని అతిక్రమించి, చలించడాన్ని అరికట్టే అంతబలంగా ఏర్పడిఉండదు. ఏమిటి తను ఆలోచిస్తున్నది. శ్యామలపట్ల తన ప్రేమ బలమైనది కాదా! తను తప్పి చరించటంలేదనా! స్నేహ బయటి తిరుగుళ్ళు తిరగటంలో ఆశ్చర్యం ఏముంది. పైగా ఆమెకు భారతదేశంలో మనుమలు గౌరవించే విలువలతో మొదటినుంచి పరిచయంలేదు. తనంతటివాడు ఆ విలువల్ని అవకాశం దొరకగానే విడిచిపెట్టాడు.

"ఆమె తనుచేస్తున్నది తప్పని అనుకొని ఉండదు. నేను చేస్తున్నది తప్పుకాదని నన్నునేను నమ్మించుకోవడానికి ప్రయత్నిస్తున్నానేకాని అది తప్పని నాకు మాటిమాటికి తోస్తూనేఉన్నా పెడతోవన పోతూనేఉన్నాను. నాకంటే ఆమె నయం అనుకొన్నాడు కృష్ణ.

ఈ లోపల తెలుగువాళ్లంతా పోగయ్యారు.

ప్రసాద్ దేహాన్ని దహనానికి తీసుకువెళ్లారు. అక్కడ పాతపైర్లమీద ఆ దేహాన్ని ఉంచారు. పండిట్ వచ్చాడు. చౌదరి చితికి నిప్పు అంటించాడు.

"ఈ పైర్లు ఏమిటి?" అని అడిగాడు కృష్ణ నరసింహాన్ని.



"ఈ దీవుల్లో పూర్వం అందర్నీ పాతిపెట్టేవారు, హిందువులతో సహితం. అయితే మునలి కృపలాని చనిపోయినప్పుడు వాళ్లవాళ్ళు కాల్చటానికి అనుమతి కోరారు. శవం కాలుతున్నప్పుడు వచ్చే పొగవల్ల జబ్బులు వస్తాయని ముందు ప్రభుత్వం ఒప్పుకోలేదు. చివరికి ఊరవతల కాల్చడానికి ఒప్పుకున్నారు. కట్టెలు లేక పాతటైర్లమీద కాల్చారు. ఈ దేశంలో అవి ఎక్కువ అవటంతో అప్పటినుంచీ అదే పద్ధతి." అని నరసింహం తెలియజెప్పాడు.

"ఇది శ్మశానమేనా?"

"ఇక్కడ శ్మశానం అంటూ ఏమిలేదు! జనానికి దూరంగా అయితే చాలు. హిందువులు వీలైనంతవరకు నదులపక్కన కాలుస్తారు. అందుకనే మనం కరోని నది పక్కన ఉన్నాం"

ప్రసాద్ దేహం కాలి బూడిదయ్యాక చౌదరి కృష్ణతో బయల్దేరాడు.

"దంపతుల్లో ఒకళ్ళు విశ్వాసంగాఉండి రెండోవాళ్ళు లేకపోతే ఉన్నవాళ్ళు చాలా బాధపడ్తారు కదా!" అని మనసులో తిరుగుతున్న మాట కృష్ణ బయటకి అనేశాడు.

"అనేదేదో సూటిగా అనండి" అన్నాడు చౌదరి. అప్పుడుగాని తనన్నమాటలు తనగురించే అయినా అవి చౌదరికి కూడా బుద్ధిచెప్పే మాటలుగా వర్తిస్తాయని కృష్ణ గుర్తించలేదు.

"సారీ మీ గురించి కాదు" అన్నాడు కృష్ణ.

"మరెవరి గురించి?"

"స్నేహ గురించి, ప్రసాద్ గురించి"

చౌదరి మాట్లాడలేదు. కృష్ణ ఆలోచనలలో పడ్డాడు. శ్యామల చావుకి తను కారకుడుకారాదు! తను ఉపవాసాలు చెయ్యగలడు! జిహ్వా చాపల్యం తీర్చుకోవటం ఆకలి తీర్చుకోవటం కాదు. "లతమీది తన కోరికను, తను ఇవాళ ప్రసాద్ చితిమీద కాల్చేసుకొన్నాను" అనుకున్నాడు కృష్ణ. అది రావణాసురుడి కాష్టం అనుకోలేదు.

చౌదరి ఆలోచిస్తున్నాడు. ప్రసాద్ చావుకి తనెంతవరకు కారకుడు? తనకి, స్నేహకి పెళ్ళి కాక ముందునుంచి సంబంధం ఉందని ప్రసాద్‌కి తెలియదా! ప్రసాద్ మాత్రం ఎంతో మందితో తిరిగినవాడు కాదూ! అతను తన స్నేహితుడే తన భార్యతో పడకగదిలో ఉంటే చూసిసహించలేకపోయాడా!

ప్రసాద్ శారదతో అదేస్థితిలోఉండి తను చూసిఉంటే... 'నరికేద్దును ఇద్దరిని" అనుకున్నాడు చౌదరి. దాంతో అతనికి కొంత తన బాధ్యత, ప్రసాద్ చావు విషయంలో బోధపడింది.

ఒక ఆదివారం నరసింహం, లక్ష్మి తెలుగు వాళ్ళందరిని పిలిచారు. కాని ప్రసాద్ చావువల్ల ఎవరూ పెద్ద ఉత్సాహంగా లేరు. శ్యామల ఒక కూర చేసి తీసుకువెళ్లింది. "కడుపుతో ఉన్న పిల్లవి నీకేమన్నా తినాలని ఉంటే నేను చేసి పెట్టాల్సినదిపోయి, నువ్వు చేసి తీసుకు రావటం ఏమిటి?" అంది లక్ష్మి పెద్దరికం తీసుకొని.

"నేను మరీ ఏమీ కష్టపడలేదు లెండి" అంది శ్యామల. ఈ మధ్యకాలంలో లక్ష్మి, శ్యామలను నువ్వని పిలవటం మొదలు పెట్టింది.

"నేను మరో కాంట్రాక్టు తీసుకొందామని అనుకోవటం లేదు. శ్యామలను అందుకని ముందే పంపించేద్దామనుకొంటున్నాను" అన్నాడు కృష్ణ.

"నా సలహా పాటిస్తారనుకొని చెబుతున్నాను. అలా పంపించకండి. ఇద్దరు కలిసి వచ్చారు. చక్కగా కలిసి వెళ్లండి" అన్నాడు నరసింహం.

"ఎందుకని వద్దంటున్నారు"
అని అడిగాడు కృష్ణ.

"ఈ దేశంలో మగవాళ్లు ఒంటరిగా ఉండటం రెండు విధాల మంచిదికాదు"

"ఒంటరి మగవాళ్ళు ఈ దేశంలో కష్టపడిపోతున్నారా?" అంటూ గుప్తా వేళాకోళంగా అడిగాడు.

"ఇక్కడ ఆకర్షణలు ఎక్కువ. ఆ ఆకర్షణకి బలైపోయాడు ప్రసాద్. కృష్ణగారి విషయంలో పెళ్లయిన వాడు కనుక ఆ ప్రమాదం లేదు. కాని ఆయన ప్రవరుడనుకోను. ఎవరన్నా వచ్చి మోహంతో మీద పడ్తే తోసేస్తాడని నమ్మటం కష్టం" అన్నాడు నరసింహం.




"ఆయనల్లాంటి వాడు కాదు లెండి" అన్నాడు రెడ్డి.

"ఏమిటి మీరు కారా?" అన్నాడు గుప్తా మళ్ళీ నవ్వుతూ ఇతర్ల మీద చర్చ నడుస్తుంటే అతనికి బోలెడు సరదాగా ఉంది.

"నేను అటువంటి వాడినికాను" అని కృష్ణ ధైర్యంగా అనలేకపోయాడు.

"ఆయనంతట ఆయన అవకాశాలు వెతుక్కోకపోవచ్చును. దొరకపుచ్చుకోకపోవచ్చును. ఆ విషయం మనం నమ్మవచ్చు" అన్నాడు నరసింహం.

"నేనంత మంచివాడిని కాను" అనుకొన్నాడు కృష్ణ.

"ఆయనలో ఆ వీక్‌నెస్ లేకపోతే మరింక భయం ఏమిటి?" అని సంకోచంగా అడిగాడు చౌదరి. ఈ చర్చ తనమీదకి తిరగటం తనకిష్టం లేదు. ఒకవేళ ఏ గుప్తా అయినా తనమీదకి చర్చని తిప్పటానికి ప్రయత్నిస్తే, గుప్తాని తను చెరిగెయ్యగలడు కాని ఈ మధ్య ప్రసాద్ చావు తరువాత తనలో ఆ ఎగ్రసివ్‌నెస్ తగ్గిపోయింది.

"ప్రమాదం ఆయనకి కాదు. ఆయనవల్ల. ఆయన ఈ దేశంలో మరో స్త్రీతో సంబంధం పెట్టుకొన్నాడని తెలిస్తే ఆయన భార్య ఏ అఘాయిత్యం అయినా చెయ్యవచ్చు" అన్నాడు నరసింహం. "ఎంతోమంది స్త్రీలతో సంబంధాలున్న మొగుళ్ళతోనే కొంతమంది భార్యలు నిక్షేపంగా కాపురాలు చేస్తున్నారు. అలా ఎందుకు భయపడాలి?" గుప్తా బాణం వేశాడు.

"పరాయి స్త్రీ నెరుగని కొంతమంది భర్తలు చాలా విషయాల్లో నికృష్టులు. తమ భర్తలు అంతకంటే మానవత్వం కలవారు కనుక భార్యకి రంకులు కట్టి హింసించి పడకగదిలో సుఖించే బాపతుకాదు కనుక...కాపురాలు చేస్తున్నారు" అన్నాడు చౌదరి.

"ఎవర్ని అంటున్నారు?" అన్నాడు గుప్తా. అతని మొహం ఎర్రబారింది

"మీ రెవరిగురించి అంటున్నారో వాళ్ల స్నేహితుల గురించి" అన్నాడు చౌదరి. అతనిలో పాత చౌదరి తొంగి చూస్తున్నాడు.

"రెండో విధం ఏమిటి" అని అడిగాడు కృష్ణ. అతనికి ఆ చర్చ నిలిచిపోవడం ఇష్టం లేదు. నరసింహం అడిగాడు "మీరు 1979 మే మొదట్లో కదూ ఈ దేశం వచ్చారు?"

"అవును"

"ఆ ఏడాది మీ ఫేకల్టీలో ఛటర్జీ అని ఒక బెంగాలీ ఉండేవాడు మీకు తెలియదేమో!"

"ఉండేవాడని తెలుసు. ముఖ పరిచయం ఉంది. కాని ఆ యేడు సెలవల్లో కలకత్తా వెళ్తూ దార్లో లండన్‌లో పోయాడని విన్నాను"

"అతను పోడానికి కారణం ఒంటరితనం." అతను అతని భార్యకి ఈ దీవిలో ఉద్యోగానికి ప్రయత్నించాడు. దొరకలేదు. ఆవిడకి కలకత్తాలో ఉద్యోగం ఉంది. అది వదులుకోవటం ఇష్టం లేక ఆవిడ సెలవుల్లో మాత్రం వచ్చి వెళ్తూ ఉండేది. ఇతను ఎవరి ఇళ్ళకూ వెళ్లేవాడు కాదు. బీరు తాగుతూ, సిగిరెట్లు కాలుస్తూ, టి.వి చూస్తూ కాలక్షేపం చేసేవాడు. మా ఇళ్లకి పిలిచినా వచ్చేవాడు కాదు. "కుటుంబాలని నా కుటుంబంతో మాత్రమే విజిట్ చేస్తాను. నా భార్య లేదని, ఉన్న వాళ్లని డిస్టర్బ్ చేస్తే ఎలా!" అనేవాడు. నిజానికి అతనికి భార్యా పిల్లల్తో ఉన్నవాళ్లని చూస్తే తను మిస్ అవుతున్నది గుర్తుకు వచ్చి బాధ మరింత పెరుగుతుందని భయం. వంటరి మగవాళ్ల కంపెనీతో తిరగవచ్చుకదా! అంటే నావయస్సు వేరు, వాళ్ల వయస్సు వేరు. వాళ్లకి ఉత్సాహం కలిగించే పనులు నాకు కలిగించవు అనేవాడు. వంటరితనాన్ని బీరుతో తడిపి, సిగిరెట్లతో కాల్చేవాడు. ఆఖరికి చావు కూడా చాలా అన్యాయంగా వచ్చింది. సెలవులు ఇంకా రెండు రోజులకి మొదలవుతాయి అనగా పనైపోయిందని విమానం ఎక్కేశాడు. దార్లో పోయే రోజుకి అఫీషియల్‌గా హాలీడేస్ మొదలవలేదు. అతను సెలవలిచ్చాక బయల్దేరి ఉంటే, అతని భార్యకి మీ యూనివర్సిటీ లక్షన్నర రూపాయలు కాంపెన్‌సేషన్ ఇవ్వాల్సి ఉండును. అదీ పోగొట్టుకొంది అతని ఫామిలీ!" అని చెప్పాడు నరసింహం.

"పంపను లెండి శ్యామలను" అన్నాడు కృష్ణ.



"వంపించి ఉండటం కష్టం, వేరే స్పేరు లేకపోతే" అన్నాడు గుప్తా మామూలు ధోరణిలో పడిపోతూ.

లక్ష్మి భోజనాలు రెడీ అని చెప్పింది. కాని ఆ రోజు భోజనం ఎవరూ సంతోషంగా తినలేదు.

"అందరూ ప్రసాద్‌ను మర్చిపోయి మామూలుధోరణిలో పడాలని పిలిచాను. మరోసారి మనం కలిసినప్పుడు ఇవాళ బిగునుకుపోయినట్టుగా బిగునుకుపోము. ఇది ప్రసాద్ వద మూడో రోజు భోజనం" అనుకొందాం అన్నాడు నరసింహం.

ఫిబ్రవరి నెల వచ్చింది. దేశం అంతా కార్నివాల్ ఉత్సాహంతో ఉరకలు వేస్తున్నా కృష్ణకి అందులో పాల్గోవాలని అనిపించలేదు.

"ఒకరోజు వెళ్లి చూసివద్దాం నేను శ్రమకి తట్టుకోగలను" అంది శ్యామల కృష్ణతో, రోజులు బరువుగా ముభావంగా గడుస్తుంటే.

"టి.వి.లో చూద్దాంలే- జనంలోకి మనం వెళ్లవద్దు" అన్నాడు కృష్ణ. 'ఆయనకి నేను నలిగిపోతానని భయం' అనుకొంది శ్యామల.

కృష్ణకి మోహపూరితమైన ఆ వాతావరణంలోకి వెళ్లటం ఇష్టంలేదు. ఇక్కడ ప్రతీది మనిషిలోని పశువాంఛని రెచ్చగొట్టేవే. సినిమాహాళ్లల్లో చూపించే సినిమాల్లో సగానికిసగం బూతు సినిమాలు, మిగిలిన నగం హాల్సు కొన్ని హిందీ సినిమాలు చూపిస్తే కొన్ని ఇంగ్లీషు సినిమాలు చూపిస్తాయి. ఇంగ్లీషు సినిమాల్లో కథ ఉన్నా హింస, అశ్లీలత లేకుండా ఉండవు. లండన్‌లో సీత- వెంకట్రావులు చూపిస్తామంటే వద్దన్న కృష్ణే ట్రినిడాడ్‌లో శ్యామలతో బూతు సినిమాలు చాలానే చూశాడు. బూతు సినిమాలు సాధారణంగా బ్లూసినిమాలకంటే ఒక మెట్టుకిందుంటాయి. వీటిలో రతి చూపించరు. సూచిస్తారు. అందుకని సాధారణంగా బూతు సినిమాలు బ్లూ సినిమాల్లాగా వెగటుపుట్టించవు. కేవలం కామోద్రేకాన్ని కలిగిస్తాయి. ప్రసాద్ చావు, శ్యామల గర్భవతి అని తెలియటం ఒకసారిజరిగిన ఈ రెండూ కృష్ణలో ఒకేలాంటి మార్పు తెచ్చి ఆ మార్పుకి బలం చేకూర్చాయి. కృష్ణ కామోద్రేకం కలిగించేవాటికి దూరంగా జరిగాడు. ప్రస్తుతం శ్యామలున్న పరిస్థితిలో శ్యామలపట్ల సున్నితంగా ప్రవర్తించాలి. ఉద్రేకం పనికిరాదు. ఉద్రేకం కలిగించుకొని దాన్ని మరోచోట చల్లార్చుకోవటంపట్ల ప్రసాద్ చావు భయం కలిగించింది. తను శ్యామల చావు భరించలేడు. శ్యామలతో విడాకులు భరించలేడు.

"టా టా! వీడుకోలు. మోహనగరికికరాను" అన్నపాట అప్పుడప్పుడు ఈలవేస్తూ పాడుకోవటం మొదలుపెట్టాడు. చెడుమధ్య ఉండి చెడకుండా ఉండటం కష్టం . చెడుకు దూరంగా ఉండటమే ఉత్తమ మార్గం అనుకొన్నాడు. భార్య దగ్గర వైరాగ్యం ఎందుకో- అంది ఒకసారి శ్యామల.

శ్యామల మళ్లీ కృష్ణకి దగ్గర కావాలని చూస్తోంది. ఆమెకి కృష్ణ రక్షణ అవసరం అనిపిస్తోంది.

"నామీద మీకు కోరిక తగ్గిందా?" అని అడిగింది ఒకసారి. ఇద్దరిగురించి ఇండియాలో అయినవాళ్లకి తెలిస్తే కృష్ణని క్షమించినట్టు తనను క్షమించరు.

"నేను పొట్టతో అసహ్యంగా కన్పిస్తున్నానా?" అని అనుమానం వ్యక్తం చేసింది మరోసారి. అసలు శ్యామల భయం కృష్ణకి తన గురించి నిజం తెలిసిందేమోనని- అందువల్ల అసహ్యం కలిగిందేమోనని.

"నేను మనిషిని శ్యామల! నాకు సెక్స్‌పట్ల విముఖత లేదు. నిగ్రహం సాధన చేస్తున్నాను. మృగాన్నుంచి వేరుపడాలని ప్రయత్నం" అని సమాధానం చెప్పాడు కృష్ణ.

అటువంటి రోజుల్లో లత ఒకరోజు కృష్ణ ఆఫీసుకి వచ్చింది.

"నేను రావచ్చునా?" అంది తలుపు దగ్గర నిలబడి.

"రండి" అన్నాడు కృష్ణ.

లోపలికి వచ్చి తలుపువేసి ఎదురుగా కూర్చుంది. "ఏమిటిలా వచ్చారు?" అని అడిగాడు కృష్ణ.

"చాలా మన్నించి మాట్లాడుతున్నావు. ఇక్కడెవరూ లేరు- మనిద్దరమే" అంది లత.

కృష్ణ మౌనం వహించాడు.

"రేపు జార్జి ఊళ్లో ఉండడు" అంది లత.





"మీకు డబ్బు అవసరం ఉందా?" అని అడిగాడు కృష్ణ.

నిజానికి లతకి అవసరం ఉంది కాని కృష్ణ అలా అడిగేనరికి చాలా నొచ్చుకుంది. నొచ్చుకొని-

"పూర్వం నీకు ఒకసారి చెప్పాను... నా డబ్బు అవసరానికి, మన కలియలకి సంబంధం లేదని" అంది.

"అందుకే అడిగాను. నాకు రేపు రావటం కుదరదు. డబ్బు కావాలంటే ఇప్పుడే తీసిస్తాను"

"ఒక యాభై ఇవ్వు"

కృష్ణ పర్సులోంచి యాభై డాలర్లు తీసిచ్చాడు.

లత "చాలా థాంక్స్" అని ముందుకు విలాసంగా వంగితీసుకొంది. వెడల్పు కాలర్ చొక్కాలోంచి తీనున్న హాఫ్ బ్రా, అది కప్పని భాగాలు కృష్ణకి కనిపించాయి. కృష్ణ క్షణంపాటు చలించాడు. లత మాటలు కొనసాగించక పోయినా కృష్ణ పొడిపొడిగా నమాధానం చెప్పాడు.

లత లేచి తలుపుతీసి బయట ఎవరూ లేరని చూసివచ్చి కృష్ణని ముద్దుపెట్టుకొంది.

"లతా... మనిద్దరిమధ్యా ఈ సంబంధం కొనసాగటం నాకిష్టంలేదు. మనిద్దరం స్నేహితులుగా మిగిలిపోదాం"

"ఆడవాళ్లు వచ్చి వాళ్లంతటవాళ్లే మీదపడితే లోకువ అవుతారని ఉట్టినే అన్నారా" అంది కోపంగా లత.

"మిమ్మల్ని రెసిస్టుచెయ్యటం ఎంత కష్టమో నాకు తెలుసు. కాని ప్రయత్నిస్తున్నాను. దానికి మీనుంచి నహకారం కావాలి. నేను ఇంక శ్యామలకి ద్రోహం చెయ్యలేను" అన్నాడు కృష్ణ.

"ఇలా ఏదో ఒకరోజున అంటావని నాకు తెలుసు కృష్ణా! నాకు నీ డబ్బు అక్కర్లేదు. కనీసం నన్ను సామాన్య వేశ్యకింద అయినా కట్టి నా దగ్గరకి వస్తూ ఉంటావని ఆశపడ్డాను... బైబై" అంటూ పర్సులోంచి డబ్బు తీసి టేబుల్ మీద పెట్టేసి ఏడ్చేసింది.

కృష్ణకి దగ్గర తీసుకొని ఓదార్చాలన్న కోర్కె బలంగా కలిగింది. నిగ్రహించుకొన్నాడు. వెళ్లిపోతున్న లత కాళ్ల పిక్కలు బలంగాను, ఎప్పటిలా అందంగాను ఉన్నాయి.

మార్చినెల రాగానే ప్రొఫెసర్ జంకిన్స్‌తో "నాకు మరో కాంట్రాక్టు అక్కర్లేదు" అని కృష్ణ చెప్పేశాడు.

"నీకిక్కడ ఏంలోటు జరిగింది?" అని అతను అడిగాడు.

"నాకిక్కడ ఏమీ లోటు జరగటంలేదు. నిజానికి నాకు ఇండియాలో కూడా ఇక్కడున్న భోగాలన్నీ అందుబాటులో ఉన్నాయి. అక్కడా ఏ లోటు లేదు. ఇక్కడ డబ్బు మిగుల్తుంది అక్కడ మిగలదు. ఎంతో కొంతకాలానికి మిగుల్చుకొన్న డబ్బు చాలని ఇండియా వెళ్లిపోవాల్సినవాడినేకదా"

"నువ్వు వెనక్కి వెళ్లిపోనక్కర్లేదు. నీకు పర్మనెంటు రెసిడెన్సు ఇప్పిస్తాను. ఇక్కడే పర్మినెంటుగా ఉండిపో"

"నేను ఇక్కడి జీతంతో ఇండియాలో బతికితే చాలా దర్జాగా బతకవచ్చు. ఇల్లు కొనుక్కోవచ్చు. అది కుదరదు. ఇక్కడికి వచ్చి కొంత డబ్బు కూడపెట్టుకొని ఇండియాకు వెళ్లటం రెండోమార్గం. నేను ఇక్కడే ఉంటే నేను సంపాదించే జీతం ఇక్కడ మీ సంపాదనలతో పోలిస్తే చాలాకొద్ది. నేను ఇండియాలో టాప్ టెన్‌పర్సెంట్‌కి చెందితే బహుశా ఇక్కడ మిడిల్ రేంజ్‌లో ఉంటాను. నేను ఆస్టిన్ మినీలో వెళ్తుంటే మీరంతా ఎయిర్ కండిషన్డ్ సూపర్ సలూన్ కార్లలో వెళ్తుంటారు. నేను ఇండియాలో చేతక్ బజాజ్‌మీద వెళ్తుంటే అందరు ఈర్ష్యగా చూస్తారు. ఇక్కడ మినీలో వెళ్తుంటే మీరంతా నామీద జాలిపడ్తారు"

"నీకు సంవత్సరానికి ఇక్కడ ఎంత మిగుల్తుంది రమారమి?"

"ఏడాదికి ఇండియన్ రూపీస్‌లో ఎనభైవేలకి లక్షకి మధ్య మిగుల్తుంది"

"అంటే ఇప్పుడు వెళ్లిపోతే రెండు లక్షలు పుచ్చుకొని వెళ్లిపోతావు"

"అవును"

"అదే యాభయ్యోయేట వరకు పనిచేసి

పించను పుచ్చుకొని వెళ్తే కనీసం పాతికలక్షల సొమ్ము, నెలకి పదివేల పించను పొందవచ్చు కదా!"

"నా యవ్వనం అంతా ఈ దీవులకి ధార పోసి, నా బుర్రకి తుప్పంటించుకొంటే నాకు నన్ను పాతిపెట్టడానికి సరిపోయేన్ని లక్షలు మిగుల్తాయి. కాళ్లూచేతులు పనిచేయటం మానేశాక ఆ లక్షలు ఏంచేసుకోను- ఇప్పుడు వెళ్తే జీవితాన్ని అనుభవిస్తాను"

"ఆ అనుభవించేదిక్కడే అనుభవించవచ్చుకదా!"

"ఆ అనుభవించడం అంటే మంచి తిండి, తాగుడు, తైతక్కలాడటం అయితే- అవును ఇక్కడా అనుభవించవచ్చును. నా అన్నదమ్ములతో అక్కచెల్లెళ్లతో, తల్లిదండ్రుల్తో పంచుకొనే సుఖదుఃఖాల విలువ ఎంత? అది రెండు మూడేళ్లకోసారి వెళ్లి రెండు మూడు నెలలు వాళ్ల అతిథులుగా గడిపి, గిఫ్టులిచ్చి రావటంలో రాదు. అక్కడ ఎన్నిరకాల కల్చరల్ ఫెస్టివల్స్... ఎన్ని పండుగలు... పూజలు- ఓహ్..."

"వెళ్లిపోతానంటావ్?"

"అవును"

"ఓ.కే."

ప్రొఫెసర్ జంకిన్స్ నుంచి సెలవుపుచ్చుకొని లాబ్‌కి వెళ్లాడు. తన మెకానిక్ ఆలీ కోసం. ఆలీ ఉన్నాడు.

ఏప్రిల్ నెలలో చౌదరి, శారద వచ్చారు కృష్ణని, శ్యామలని పిలవటానికి.

"అక్కా... ఈ శనివారం నేను షాపు తెరుస్తాను. ప్రావిషన్స్, ఇండియన్ స్పైసెస్ అన్నీ అమ్ముతాను. ఆరోజు మా ఆయన తెలుగు వాళ్లందర్నీ పిలుస్తున్నారు. మీరంతా మా షాపులో షాపింగ్ చెయ్యాలి ఆరోజు. ఆ తరువాత మా ఇంట్లో భోజనం చెయ్యాలి- ఇది ప్రోగ్రాం. నువ్వు మాత్రం అందరిలా సమయానికి వస్తే కుదరదు. ముందరవచ్చి పనిలో సహాయంచేసి అందరు వెళ్లాక వెళ్లాలి. కృష్ణగారూ... విన్నారు కదా!" అంది శారద.





"అలాగే! మీ అక్కాచెల్లెళ్లు ఏంచేసినా నేను మాట్లాడను- సర్దుకుపోతాను" అన్నాడు కృష్ణ నవ్వుతూ.

"ఈపూట ఇక్కడే భోం చెయ్యండి" అంది శ్యామల.

"మీకెందుకు శ్రమ?" అన్నాడు చౌదరి.

"నాకు శ్రమ లేదు. ఉన్నా శారద సహాయం చేస్తుంది" అంది శ్యామల.

"మీ అక్కాచెల్లెళ్లలో ఎవరు ఎక్కడ భోజ నంపెట్టినా నేను తింటాను. సర్దుకుపోతాను" అన్నాడు చౌదరి కృష్ణను అనుకరిస్తూ.

"ఏమి అపూర్వసహోదరులు" అంది శ్యా మల.

"బిరుదు బావుంది. లెటజ్ సెలబ్రేట్" అంటూ కృష్ణ వెళ్లి జానీవాకర్ బాటిల్ తెచ్చా డు. చౌదరి, కృష్ణ నెమ్మదిగా తాగటం మొదలు పెట్టారు. శ్యామల మెక్సికన్లు తినే కర్రపెండ లంతో చేసిన చిప్స్ తెచ్చిపెట్టింది.

శారదకి కొద్దిగా మార్టినీ ఇచ్చి తను కొద్దిగా గ్లాసులో తీసుకొంది శ్యామల.

శారద చప్పున తాగి మరోకొంచెం వంచు కొంది.

"ఇదంతా షాపు తెరిచే ఉత్సాహమే?" అని అడిగింది శ్యామల.

"షాపు ఎందుకు తెరుస్తాననుకొంటు న్నావ్?"

"తెలీదు... చెప్పు. రస్తాలు మీ పెడ్డులో కాపురం పెడ్తారేమోనన్న భయంతోనా?"

"కాదు. నా పీడలన్నీ తొలగిపోయాయి. చౌదరిగారు చాలా మారిపోయారు. లీల ముండ మా ఇంటికి రావటం మానేసింది"

"చాలా సంతోషంగా ఉంది"

"పాపం ప్రసాద్‌గారు చచ్చిపోయి నాకు చాలా ఉపకారం చేశారు. ఆయన చావు తరు వాత చౌదరిగారు పిల్లిలా అయిపోయారు. నేను ఏం చెప్తే అది చేస్తున్నారు" శారద ప్రసాద్‌పట్ల కృతజ్ఞత చూపింది.

"సరే ఆయన మరణం మాకు మంచే చేసింది" అంది శ్యామల.

భోజనాల దగ్గర చౌదరి తన ప్లాన్ చెప్పాడు. "ఇండియానుంచి టేబుల్‌క్లాత్‌లలాంటివి తెప్పించి కృపలానీ షాప్స్‌కి అమ్ముతాను. అక్కడ సేల్‌పీరియడ్‌లో వెయ్యి డాలర్ల వస్తు వులు 650 డాలర్లకి అమ్ముతారు. అవి ఆ పీరియడ్‌లో 600 డాలర్లకే ఎక్కువ మొత్తంలో కాని ఆ సేల్‌పీరియడ్ తరువాత మేము 800 డాలర్లకి అమ్ముతాము. ఈ విషయంలో కృప లానీ షాపుల్తో నోటి ఒప్పందం జరిగిపో యింది".

"లత షాపుతో మీ షాపు పోటీ అన్నమాట" అన్నాడు కృష్ణ. అది కృష్ణకి ఎక్కడో నచ్చలేదు.

"షాపు పెట్టుకోడానికి అందరికి హక్కుంది. అది లతగారి సొత్తుకాదు. నేను శారద షాపు లోనే కొంటాను" అంది శ్యామల.

"వాళ్ల బిజినెస్ ఎక్కువగా సెకెండ్‌హాండ్ వస్తువుల్లోను, కృపలానీలో దొరకని వస్తువుల్లో ను. మాది కృపలానీకి బ్రాంచిలాంటిది. వాళ్లకి మాకు పోటీలేదు. మా షాపు ఓపెనింగ్‌కి వాళ్లని పిలుస్తున్నాం" అన్నాడు చౌదరి.

"ప్రారంభోత్సవం ఎవరు చేస్తారు?" అని కృష్ణ అడిగాడు. "మా హెల్తుమినిష్టర్. ఆయన పూర్వీకులూ భారతీయులే. కమాలుద్దీన్‌గారు ఒప్పుకొన్నారు" అన్నారు చౌదరి.

చౌదరి ఏపనిచేసినా పకడ్బందీగా చేస్తాడు అనుకొన్నాడు కృష్ణ.



శనివారంనాడు కృష్ణకి బ్రేక్‌ఫాస్ట్ చేసిపెట్టి తను తింది శ్యామల. ఆమెను శారద ఇంట్లో దింపి యూనివర్సిటీకి వెళ్లాడు తోచక కృష్ణ. ప్రారంభోత్సవం పదకొండుగంటలకి - కాసేపు లైబ్రరీలోకి వెళ్లి బొమ్మల పుస్తకాలు తిరగేశాడు. పదిన్నరదాకా గడిపి బయటికి వెళ్తుంటే లత

కనిపించింది. "ఎక్కడికి... చౌదరిగారింటి కేనా— నాకు లిఫ్ట్ ఇస్తావా?" అని అడిగింది.

"అలాగే!" అన్నాడు కృష్ణ. "ఇప్పుడు నా మనస్సు నిర్మలంగా వుంది. లత నన్ను రెచ్చగొట్టలేదు" అనుకొన్నాడు.

దార్లో ఏమీ మాట్లాడకుండా కృష్ణ డ్రైవ్ చేస్తుంటే లత ఆశ్చర్యంగా చూసింది. "ఇతనికి నాకు మధ్య ఏమీ సంబంధం ఇంకా మిగిలి లేదు. నిజంగా ఒకప్పుడు మా ఇద్దరికీ మధ్య అటువంటి సంబంధం వుందని నాకే నమ్మశక్యం కాకుండా వుంది" అనుకొంది. ఫ్రంటు సీట్లోనే అయినా దూరంగా అతనికి తగలకుండా కూర్చుంది. కృష్ణ శ్యామలకి తమ సంబంధం తెలియదని పూర్వం ఒకసారి అందుకే తను లతతో ముభావంగా ఉంటే శ్యామల మందలించిందని అనుకొన్నాడు.

చౌదరి ఇంటిముందు కారాగగానే కృష్ణ నిర్వికారంగా ఆమె మీదనుంచి వంగి తలుపు తెరిచాడు. లత దిగి 'థాంక్స్' అంది. శ్యామల ఆ దృశ్యం చూసింది. 'లతతో ఈయన స్నేహం సాగుతూనే ఉందన్నమాట' అనుకొంది.

మంత్రి వచ్చి ప్రారంభోత్సవం చేశాడు. చౌదరి మంచి డాక్టరన్నాడు. తన పూర్వీకులు భారతీయులని, ఆ కారణంగా తను భారతీయులతో కలిసి ఉన్నప్పుడు తనకి చాలా ఆనందం కలుగుతుందని చెప్పాడు. తనకి భోజనానికి ఉండటానికి వీలవదు. తనకి ఇండియన్ ఫుడ్ తినే అదృష్టం లేదని అన్నాడు. శారద వ్యాపారం వృద్ధిలోకి రావాలని ఆశిస్తున్నానన్నాడు. ఒక డాలర్‌పెట్టి టోకెన్ పర్చేస్ చేశాడు. ఆపైన చౌదరి ఆయనకి ఖరీదైన బహుమతులిచ్చాడు. అందరూ కారుదాకా వెళ్లి ఆయనను సాగనంపి వచ్చారు.

వచ్చిన భారతీయులంతా కొన్ని సరుకులు కొన్నారు. "అక్కా... నువ్వూ కొనాలి" అంది శారద.

శ్యామల బియ్యం రెండు కిలోలు కొంది. బియ్యం ధర సూపర్‌మార్కెట్లలోకంటే పది సెంట్లు హెచ్చుగా తీసుకుంది శారద.

"చాలా ఖరీదుగా ఉన్నాయి" అంది శ్యామల హాస్యంగాను, నిజంగాను. "వ్యాపారంలో లాభం లేకపోతే ఎలా?" అంది శారద లౌక్యంగాను, హాస్యంగాను.

భోజనాలు తయారయ్యాయి. బఫే ఏర్పాటు చేశారు. భోజనాలు అయ్యాక గిన్నెలు తోమటానికి కుదుర్చుకొన్న నీగ్రో పనిమనుములు అతిథులతోపాటు భోంచేశారు. అది కృష్ణకి ఆశ్చర్యం కలిగించింది.

"వీళ్లకి తరవాత భోజనం పెడ్తే అవమానంగా తలచి పనిచెయ్యకుండా వెళ్లిపోతారు" అని చెప్పాడు నరసింహం.

ఆల్కహాలు మంచినీళ్లలా తాగారు వచ్చిన జనం. చౌదరి డబ్బు ఖర్చు పెట్టినప్పుడు దర్జాగా పెట్టాడు. అనవసరంగా ఒక సెంటు ఖర్చు పెట్టడు. భోజనాలై అందరూ వెళ్లిపోయాక శ్యామల తనూ వెళ్తానని బయల్దేరింది. కొంచెం అప్పుడే ఆమెకి అలుపు తెలుస్తోంది.

శారద ఆమెకి ఖరీదైన చీర, రవికల గుడ్డ పెట్టింది. "ఇదంతా ఎందుకు?" అంది శ్యామల, శారద తనకిస్తున్న ప్రత్యేక గౌరవానికి మనస్సులో సంతోషిస్తూ.

"నా సంతోషానికి" అంది శారద.

శారద బియ్యంలో కిలోకి పది సెంట్లు ఎక్కువ తీసుకొన్న కోపం పోయింది శ్యామలకి. కృష్ణ, శ్యామల బయల్దేరారు.

దార్లో, "లత మీ కార్లో ఎందుకు వచ్చింది?" అని అడిగింది శ్యామల.

"లైబ్రరీలో కనిపించి చౌదరి ఇంటికి తనూ వస్తానంది వద్దనటం ఎల్లా!" అన్నాడు కృష్ణ. "అనుమానించి అనుమానించి అంతా చల్లారాక... ఇప్పుడా!" అనుకొన్నాడు. శ్యామల మరి మాట్లాడలేదు.

ఇంటికి వెళ్లి బట్టలు మార్చుకొన్నాక శారద పెట్టిన చీర నాణ్యం చూస్తూ, "ఇంత ఖరీదైన చీర ఒకవంక పెడ్తూ, మరోవంక బియ్యం మీద లాభం వేసుకోడం ఎందుకో! శారదని అర్థం చేసుకోవటం కష్టం" అంది శ్యామల.

"ఒకటి నీమీద అనురాగం. రెండోది వ్యాపారం. వ్యాపారంలో అభిమానాలు చూపిస్తే దివాళా తీస్తారు. నీకు ఇచ్చే వస్తువు ఊరికే ఇస్తారేమోగాని అమ్మే వస్తువు లాభం లేకుండా అమ్మరు. నువ్వు కూడా అక్కడ ధరలు ఎక్కువ




అనుకొంటే కొనకు. లేక బేరం ఆడు. బహుశా దానికి శారద తప్పు పట్టించుకోదు'' అన్నాడు కృష్ణ.

శ్యామల మాట్లాడలేదు కాస్సేపు.

''శారద మెళ్లో వేసుకొన్న గొలుసు చూశారా?''

''లేదు... ఏం?''

''మీరు నేను వేసుకొంటేనే చూడరు - అడగటం బుద్ధితక్కువ''

''ఇంతకూ ఏమిటి దాని విశేషం?''

''దాన్ని వాళ్ల అమ్మగారు కారం డబ్బాలో వేసి ఇండియా నుంచి పంపారు. కస్టమ్స్ వాళ్ల కళ్లల్లో అల్లా కారం కొట్టారుట - శారద చెప్పింది'' శ్యామల మామూలుగా ఉండటానికి ప్రయత్నిస్తోందీమధ్య.

''అందులో నిన్ను ఇబ్బంది పెడ్తున్న భాగం ఏమిటి? మీ అన్నదమ్ములెవరూ కస్టమ్స్‌లో పనిచేయటం లేదు కదా! మనం అంతా కూడా ఒక దేశంలో దొరకని వస్తువులు మరొక దేశం నుంచి చేరవెయ్యాలనుకొంటూనే ఉంటాము కదా!''

''అదికాదండీ! చౌదరికి పరస్త్రీలతో సంబంధాలున్నాయని బేలగా ఏడ్చిన శారదకి ఇంత వ్యాపారదక్షత ఎల్లా వచ్చిందని ఆశ్చర్యంగా ఉంది'' అంది శ్యామల. ''పిచ్చిదానా! శారదకి తన వైవాహిక జీవితం ముళ్లమార్గంలో నడుస్తున్న రోజుల్లో ఆమె మనస్సునంతా ఆ విషయం ఆవరించి బుద్ధిని కప్పేసింది. ఆ బెంగ తీరగానే ఆమెలోని ఆత్మవిశ్వాసం పుంజుకొని శక్తి ప్రదర్శితమౌతోంది''

''ఈ శారద నన్ను భయపెడ్తోంది!''

''ఒకప్పుడు ఆమె నీమీద ఆధారపడి ఉండటం నీకు నచ్చి ఆమె ఎల్లప్పుడూ అల్లాగే ఉండాలని వాంఛిస్తున్నావా?''

''లేదులెండి... తను సంతోషంగా ఉండటమే నాకు కావాలి''

''అదిసరేగాని అనవసరంగా పరాయి ఆడవాళ్లని నేను లేనప్పుడు మీ కార్లో ఎక్కించుకోకండి'' అంది శ్యామల. తనది ఉత్త అనుమానం మాత్రమే అయినట్టు.

''అలాగే తమ ఆజ్ఞ'' అన్నాడు కృష్ణ.

తనకి అటువంటి చెడు ఉద్దేశాలు ఎప్పుడూ లేవన్నట్టుగా.

''మరీ భార్యావిధేయులు!''

''కానా! ఇప్పుడు నిన్ను ముద్దుపెట్టుకోమన్నావుగా పెట్టుకొంటున్నాను'' అన్నాడు కృష్ణ ప్రేమ ప్రదర్శిస్తూ ఆమెను దగ్గరకు తీసుకొన్నాడు. శ్యామల లత విషయంలో నిజం తెలుసుకోవటం అతనికిష్టం లేదు. అందుకని ఉన్న అనురాగం మించి ప్రదర్శిస్తున్నాడు కృష్ణ.

ఏ స్త్రీ తన భర్త తనపట్ల ప్రదర్శిస్తున్న అనురాగాన్ని శంకించదు. తను దానికి అర్హురాలనని నమ్ముతుంది. శ్యామల అందుకు భిన్నంగా అది నిజమైతే తను దానికి అర్హురాలినా అని ఆలోచిస్తోంది.

కాస్సేపటికి శ్యామల ఆలోచనలు ఆగిపోయి క్రమేపి పాత అనురాగం లోబరుచుకోగా కౌగిటలో కరిగిపోయింది.

శ్యామలకి కొత్తగా భయం పట్టుకుంది. తన విషయం కృష్ణకి, అతని వాళ్లకి తన వాళ్లకి తెలిస్తే ఫలితం ఎలా వుంటుందోనని.

తన తల్లిదండ్రులు ఖచ్చితంగా- ''మగవాడు తప్పుచేస్తే అనురాగంతో, ఓర్పుతో సరిదిద్దుకోవాలి కాని ఇల్లా బరితెగిస్తావా? మాకు మచ్చ తెస్తావా?'' అని తీరుతారు. ఇక్కడ సహజంగా అనిపించిన తన రియాక్షన్ అక్కడ ఎవరూ ఆమోదించరు. కృష్ణ ఇండియాలో ఆ పనిచేస్తే తను అప్పుడు క్షమించేదికాదు. విడాకులు తీసుకునేది. మరొకరిని పెళ్లాడేదేమో! కాని వ్యభిచరించేది కాదు. అటువంటిది తను ఇక్కడ ఎందుకల్లా ప్రవర్తించింది? తనమీద లీల, స్నేహలతల ప్రభావం పడింది.

ఇలా ఆలోచిస్తూ నారాయణ ఇంటికి చేరింది. నారాయణ తలుపుతీసి, ''రండి, రండి... ఏమిటి అపురూపంగా వచ్చారు?'' అని అడిగాడు. రిఫ్రిజిరేటరు నుంచి వళ్లరసం తీసి రెండు గ్లాసుల్లోపోసి తెచ్చాడు.

మంచి ఎండలో రావటంవల్ల శ్యామల అది తాగి సేదతీరింది. ఆపైన విషయానికి సూటిగా వచ్చింది.

''మర్యాదలకేమిగాని నీకు తెలుసుననను

కొంటాను. నేను గర్భవతిని" అంది.

"తెలును"

"అది కృష్ణవల్ల కాకపోవచ్చును"

"నావల్లా కాకపోవచ్చును"

శ్యామలకి మొదటిసారి తన తప్పు తెలిసింది. తన కడుపులో పెరుగుతున్నది కృష్ణ తాలూకు అని నిర్ధారణగా చెప్పలేనట్టే నారాయణ తాలూకు అనీ చెప్పలేదు. రక్తపరీక్ష చేయించుకొన్న ఆ టెస్టు అసందిగ్ధంగా చెప్పలేదు. తనకి తెలును తను బయాలజీ విద్యార్థిని.

కృష్ణ ఇంట్లో నారాయణ సంతానాన్ని పెంచడంలో ఉన్న ఇబ్బందే నారాయణ ఇంట్లో కృష్ణ సంతానాన్ని పెంచడంలోనూ ఉంది. శిశువు పుట్టేవరకు ఆగాలి.

"సైలెంట్ అయిపోయారు ఏమిటి ?" అని నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ అడిగాడు నారాయణ.

"నేనిప్పుడు ఏంచెయ్యాలి?"

"ఎబార్షన్ చేయించుకో శ్యామలా!"

"దానికి డబ్బు?"

"నువ్వు వల్లు అమ్మి సంపాదించిన డబ్బులెఖ కృష్ణ నిన్ను ఎప్పుడూ అడిగివుండడు. అంతగా నీ దగ్గర డబ్బు లేకపోతే నేను ఇస్తాను"

"ఏ కారణం చెప్పి కృష్ణని ఒప్పించను నేను ఎబార్షన్ చేయించుకోడానికి"

"సహజంగా జరిగినట్లు నటించలేవా?"

"ఆఫ్టర్ ఎబార్షన్ కేర్‌కి నన్ను డాక్టరు దగ్గరికి తీసుకువెళ్తానంటే"

"అన్నీ నువ్వే అంటే ఎలా?"

"నిజమే -నువ్వు ఏమీ చెప్పలేవు. పైగా ఇందులో నీ దగ్గరికి వచ్చిన నన్ను మందలించకపోవడం తప్ప నీ తప్పు ఏమీలేదు. వస్తాను" అని చెప్పి లేచి శ్యామల బయల్దేరింది. నారాయణ కార్లో దింపుతానంటే వద్దంది.

తను నారాయణనుంచి ఏమి ఆశించింది? తనను పెళ్లి చేసుకుంటాడనా? నారాయణకు కూడా ఇతర స్త్రీలతో సంబంధాలున్నాయికదా! కృష్ణని క్షమించలేని తను నారాయణని ఎల్లా క్షమిస్తుంది. తను మగనాలి అయివుండి నారాయణని కోరిందికదా ఏ కారణంతో అయినా గాని. నారాయణ తనను పెళ్లి చేసుకుంటే మరొకరిని తను కోరదని అతనికి భరోసా ఏమిటి? తమది ప్రేమకాదు. బలమైన కోరికా కాదు. తనది మానసిక అవసరమైతే అతనిది దైహికావసరం. ఇద్దరు కలిసి అవి తీర్చుకొన్నారు. తను, అతను పెళ్లి చేసుకుని ఆ తరువాత ఒకళ్లపట్ల ఒకళ్లు విశ్వాసంగా ఉంటారన్నది ఉత్తిమాట!

తను కృష్ణని విడిపోయి తనిక్కడే వుంటే? తను మరో లత అవుతుంది. జార్జి లాంటివాడు తగుల్తాడు. ఎవరితోడు లేకుండా ఉద్యోగం చేసుకొంటూ బతికితే? తనకి వర్క్‌పర్మిట్ లేదు. ఎల్లా చేస్తుంది. పైగా క్రిస్టీలాగా ఒంటరిగా ఈ దేశంలో బతకటం ఎంత కష్టం! ఇండియాలో బతకటం మరింత కష్టం. తనూ కృష్ణ విడిపోతే తన సంతానానికి కృష్ణే తండ్రి అని ప్రపంచం అనుకొంటుంది.

మహా అయితే తనకి తల బిరుసు అనుకొంటారుగాని తన బిడ్డని అక్రమసంతానంగా పరిగణించరు. ఈ వివాహ వ్యవస్థవల్ల ఎన్ని చికాకులు!

భార్యాభర్తలు అనే పొజెసివ్ రిలేషన్‌షిప్ అనేదే లేకపోతే వ్యభిచారమే ఉండదు. తప్పిచరించడం ఉండదు. హాయిగా సంతానం కావాలని స్త్రీ అనుకొన్నప్పుడు కంటుంది. అక్కర్లేనప్పుడు కనదు. తనకి నచ్చినవాడితో నవ్యంగా సాగినన్నాళ్ళు కలిసిఉంటుంది. ఇష్టం లేకపోతే విడిపోతారు. తను, కృష్ణా ఉంటున్నట్టు చచ్చినట్టు కలిసి బతకక్కర్లేదు.

శ్యామలకి హఠాత్తుగా క్రిస్టీ గుర్తుకువచ్చింది. తను ఆమె జీవితం విధానాన్ని ఈరోజు మనస్సులో సమర్థిస్తోంది! కొద్ది నెలల క్రితం వరకు అటువంటి స్త్రీలవల్ల తన వైవాహిక జీవితానికి ప్రమాదం జరగవచ్చునని భయపడింది! తన ఆలోచనలలో తేడా రావటానికి కారణం తన ప్రస్తుత పరిస్థితులే కారణం!

తను క్రిస్టీ లాగా బతకగలదా? దానికి ధైర్యం కావాలి.

తను ఇండియావెళ్ళిపోతే అన్ని సమస్యలు





తీరిపోతాయి. తన ప్రసవం సెప్టెంబర్‌లో. తాము జులైకి వెళ్ళిపోతారు. ఇండియాలోని వాతావరణంలో కృష్ణకి, మరొకళ్ళు దొరకరు. బుద్ధిగా ఉంటాడు. తనలో మళ్ళీ అతనిపట్ల అనురాగం చిగురించి మొగ్గతొడుగుతుంది. తనని కృష్ణ ఏనాడు అనుమానించలేదు కనక పుట్టిన బిడ్డ తనదికాదని ఏనాడు అనుకోడు. కృష్ణకి చెప్పకపోవటమే మంచిమార్గం. ఇక్కడున్న ఒకటిన్నరనెలలు కృష్ణ లత ఇంటికి వెళ్ళకుండా చూసుకొంటేచాలు.

ఇలా ఆలోచిస్తూ శ్యామల ఇల్లుచేరిన కొద్ది సేపటికి కృష్ణ ఇల్లు చేరుకొని గుప్తా ఇంట్లో జరిగిన ఓ దుస్సంఘటన చెప్పాడు.

ఆ తరువాత కృష్ణని కాపలాకాయాల్సిన అవసరంలేదని అతను లత ఇంటికి వెళ్ళటం లేదని శ్యామల గమనించింది.

కృష్ణ యూనివర్సిటీ పరీక్షల్తోను, వెనక్కివెళ్ళే ఏర్పాట్లతోను తీరుబడిలేకుండా ఉన్నాడు. నరసింహం, చంద్రూల సలహాలను గురించి ట్రావెల్ ఏజెంట్ నుంచి ఇండియాకి కొటేషన్ తీసుకొని అది యూనివర్సిటీకి ఇచ్చి ఆ డబ్బు తీసుకొన్నాడు. దానిపైన కొంత తను వేసుకొని పి.ఒ.యస్.నుంచి మయామికి అక్కడ్నుంచి న్యూయార్క్‌కి న్యూయార్క్‌నుంచి బొంబాయికి బొంబాయినుంచి హైదరాబాద్‌కి టిక్కెట్లు కొనుక్కున్నాడు. ట్రావెల్ ఏజెంట్ తన కమిషన్‌నుంచి కొంతమొత్తం తగ్గించుకొని కృష్ణకి టికెట్లు అమ్మటంతో కృష్ణ చేతినుంచి పెట్టుకోవాల్సిన డబ్బు అంతగాఅవలేదు. ట్రావెల్ ఏజెంట్లకి 9శాతం కమిషనుంటుంది. అందులో 5 శాతం కృష్ణకిచ్చాడు. ఈ ప్రయాణపు ఏర్పాట్లలో కొంచెం కృష్ణని బాధ పెట్టింది అమెరికన్ ఎంబసీ వాళ్ళు మాట్లాడేవిధానం. "నువ్వు మాదేశం వెళ్లి అక్కడే ఉండిపోవని నమ్మకం ఏమిటి?" లాంటి ప్రశ్నలు చికాకు కలిగించాయి. తన కళ్ళముందే తెల్లతోలువాళ్ళకి మల్టిపుల్ ఎంట్రీవీసాలు ఇస్తూ తనకి కేవలం సింగిల్ ఎంట్రీ వీసాకి గడ్డిపెట్టడం నచ్చలేదు. "ఇండియన్ ఎంబసీలు అమెరికనులు ఇండి... వచ్చేటప్పుడు ఇటువంటి ఇబ్బందులు పెడ్తేగాని వెధవలకి తెలిసిరాదు" అనుకొన్నాడు కృష్ణ. డాలర్లు ముష్టెత్తే దేశం ఎలా అంటుంది! మనంకూడా ఆర్థికంగా, రాజకీయంగా బలమైన దేశం అయితే తప్ప మనకి గౌరవం రాదు.

పరీక్షలయ్యాక పేపర్లు దిద్దటంలో ఊపిరి సలపలేదు. నూట అరవై అయిదుమంది క్లాసులో. అందులో నూరుమంది పాసయ్యారు. హెడ్డు సంతోషించాడు. "మంచి శాతమే పాస్ అయ్యారు" అన్నాడు.

స్టాఫ్ అంతా కూర్చుని రిజల్ట్స్ పరిశీలించి చర్చించి ఎనౌన్సు చేశారు. అది అవగానే విద్యార్థులు కార్ల బోనెట్లమీద కూర్చుని, "షాంపైన్ సీసాలు తెరిచి బోలెడు హడావిడి చేశారు. యువత ఉత్సాహంతో పాల్గొనగలగటం, కనీసం చూడగలగటం ఒక అదృష్టం.

"యూ టీచ్ వెల్‌మాన్" అన్నారు కొందరు విద్యార్థులు.

"థాంక్యూ"

"ఎందుకు వెళ్లిపోతావ్? మాదేశంలో మరికొన్ని సంవత్సరాలుండాల్సింది!"

"థాంక్యూ"

ఈ విషయం చెప్తే నరసింహంతో, "ఈ దేశస్థులోసారి రాజన్‌తో ఏమన్నారో తెలుసా? 'నువ్వు మీదేశంలో చాలా గొప్పవాడిని అంటావుకదా! మరి నువ్వు మీ దేశం వెళ్లిపోక ఇక్కడే వేళ్లాడ్తావేం! గేమాన్ గేబాక్!' అని అది అతను నాతో చెప్పాడు. అలా అనిపించుకోకుండా మరో సంవత్సరం ఇతనుంటే బావుండును అని వాళ్లనుకొంటున్నప్పుడే మనం వెళ్తే నయం. వసంత స్కూలు పూర్తి చెయ్యగానే మేమూ వెనక్కి వెళ్లిపోతాము" అన్నాడు.

కృష్ణ కారు, టి.వి అమ్మేశాడు జార్జిద్వారా. మిగిలిన చిన్నచిన్న వస్తువులు అమ్మడంలో కూడా జార్జి సహాయంచేశాడు. జార్జిపట్లకూడా కృష్ణకి సదభిప్రాయం కలిగింది. తను అతనికంటే ఎందులో గొప్ప!

డబ్బు తీసుకోడానికి వాళ్లింటికి వెళ్లినప్పుడు లత ఒక్కతేవుంది. డబ్బు ఇచ్చి "వెళ్లిపోతున్నావా కృష్ణా!" అంది బాధగా.

"వెళ్తున్నాను లతా!"

"నీకు నేను చేసిన చెడువుకి నన్ను





క్షమించు" అన్నాడు కృష్ణ.

"క్షమించడానికి ఏముంది? ఇద్దరం ఇష్టపడ్డాం. సుఖించాము. అవి మధురస్మృతులను కొంటాను" అంది లత.

ఈ లతలాగా తను సూటిగా ఎందుకు ఆలోచించలేకపోతున్నాడు? లతను వాంఛించాడు. లతను పొందాడు. పొందేవరకు తను జార్జిలాంటి వాళ్లకంటే ఉత్తముడినను కొన్నాడు. నిజానికి అవకాశంలేక తను అన్నాళ్లు ఉత్తముడిగా ఉండి ఉంటాడు. లతను పొందాక ఆ పొందటాన్ని సమర్థించుకొన్నాడు. ప్రసాద్‌చావుతో శ్యామల ఏదన్నా అఘాయిత్యం చేస్తుందేమోనని భయపడ్డాడు. అన్నీ తన కోణంలో చూశాడు. తప్పుచేశానన్న భావంతో ప్రవర్తించాడు. లత మాటేమిటి?

"లతా! యూ ఆర్ గ్రేట్! ఉన్న పరిస్థితుల్లో రాజీపడి జీవిస్తున్నావు. కాని ఎట్టి పరిస్థితుల్లోను నిన్ను నువ్వు మభ్యపెట్టుకోవటంలేదు, నాలాగా!" అన్నాడు.

"నీ తప్పేంలేదు కృష్ణా జరిగిన దాంట్లో! బాధపడకు! కాలంలో వెనక్కివెళ్లి చరిత్రని మార్చలేము" అంది. లత కళ్లు తడి అయ్యాయి. ఆ తడి చూసి కృష్ణ చలించాడు.

దగ్గరకువెళ్లి "లతా!" అంటూ దగ్గరికి తీసుకొన్నాడు. తరువాతవన్నీ ఒకదాని తరువాత ఒకటి అతని ప్రమేయం లేకుండా జరిగిపోయాయి.

"నిన్ను నేను నిజంగా ప్రేమిస్తున్నాను కాబోలు!" అన్నాడు. "థాంక్స్" అంది లత అతని నుంచి విడిపడుతూ.

"వెళ్తాను లతా!" అన్నాడు కృష్ణ లేచినిలబడి.

అతన్ని వీధిగుమ్మందాకా పంపించి, "వచ్చే సంవత్సరం నేను ఇక్కడ పనులన్నీ ముగించుకొని ఇండియా వచ్చేస్తాను. మా కొడుకుని నేను ఇండియా తీసుకెళ్లటానికి జార్జి ఒప్పుకొన్నాడు. అతనుకూడా మంచివాడే! ఎటొచ్చీ అతని జీవన విధానం మనం చిన్నప్పటినుంచి పెరిగిన విధానంలో ఉన్న తేడాలవల్ల రాపిడి జరిగింది మనస్సుకి" అని చెప్పింది.

"నీకు మంచి జరగాలని కోరుకొంటున్నాను" అన్నాడు కృష్ణ.

ఇంటికి నడుస్తూ కృష్ణ ఆలోచనలో పడ్డాడు. తను లతనే ఎందుకు కోరాడు? లీలకోసం ఎందుకు ప్రయత్నించలేదూ? ఒకే కాలంలో ఒక మనిషి ఇద్దర్ని ప్రేమించలేడా? ప్రేమించడం తప్పా? ప్రేమంటే ఏమిటి? స్త్రీపురుషులమధ్య మాత్రమే ఉంటుందే 'ప్రేమరకం'లో కోరిక ఉండదా? కోరిక లేని ప్రేమకి, స్నేహానికి తేడా ఏమిటి? లత తనని ప్రేమించింది. తను కామించాననుకొన్నాడు. అదీ పూర్తిగా సరైనదికాదు. ప్రేమించాడుకూడా! స్త్రీపురుషులమధ్య ఉండే స్నేహంలో ఆకర్షణ జోడైతే వయస్సు అనువు అయినదైతే దాని గమ్యం కలయిక అయితీరుతుంది. అందరూ గమ్యం చేరుకోకపోవచ్చు. అంతమాత్రాన అది కామరహిత ప్రేమకాదు. స్త్రీపురుషులమధ్య ప్రేమలో కామం నివురుగప్పిన నిప్పు. పరిస్థితులు అనుకూలించినప్పుడు నిప్పు ప్రజ్వరిల్లుతుంది. శ్యామల ఏవిధంగా అనుకొన్నా తాను కాలంలో వెనక్కి వెళ్లి చరిత్ర మార్చలేడు! దాన్ని స్వీకరించాలి!

కృష్ణకి వేసంగి సెలవులకిగాను మూడు నెలల జీతం ముట్టింది. గ్రాట్యువిటీ ఇచ్చారు. అన్నీ కలిపి రెండేళ్ల అయిదు నెలలకి రెండు లక్షల రూపాయల విలువైన ట్రావెలర్స్ చెక్స్ డాలర్స్‌లో తీసుకొన్నాడు. స్నేహితులు వచ్చి పియార్కోలో విమానం ఎక్కించారు. విమానాశ్రయానికి వచ్చినవాళ్లలో లత, నారాయణలున్నారు. అందరితో పాటు వాళ్లదగ్గర కూడా కృష్ణ, శ్యామల సెలవు తీసుకొన్నారు.

"ఈ దీవులనొదిలేస్తుంటే ఎలా వుంది?" అని అడిగింది శ్యామల.

"జేబులో డబ్బుల బరువు వల్ల గొప్పగా ఉంది" అన్నాడు కృష్ణ. గుండెల్లో బరువు మాట చెప్పలేదు.

ఎయిర్‌హోస్టెస్‌లుగా గుండు పిల్లలు చకచకా పనిచేస్తుంటే చాలా మామూలుగా అనిపించారు. కొత్తగా అనిపించలేదు. నల్లవాళ్లు వస్తున్నప్పుడు మనుష్యులుగా అనిపించలేదు. ఇప్పుడు అనిపిస్తున్నారు.

విమానం కదిలింది. 








## నిర్లక్ష్యానికి మూల్యం

దట్టమైన ఆ అరణ్యంలో పడుతూలేస్తూ పరుగులు తీస్తున్న ఆ కారు ఒక్కసారిగా ఆగిపోయింది. ఎన్నిసార్లు ప్రయత్నించినా ముందుకు కదిలేదిలేదంటూ మొరాయించడంతో ఉసూరుమంటూ అందులోంచి కిందకు దిగింది ఓ యువజంట. ప్రకృతి సౌందర్యాన్ని ఆస్వాదించాలని ఉవ్విళ్ళూరుతూ వచ్చిన వారిద్దరూ 'కారుదొర'కు సపర్యలు చేయడంలో మునిగిపోయారు.

అనలే కొత్తగా పెళ్లయిన జంటేమో! చల్లటి గాలులు, పక్షుల కిలకిలరావాలు మనస్సుకు హాయిగొల్పుతుంటే ఆచల్లని ప్రకృతివడిలో, సేదతీరుతూ కబుర్లు చెప్పుకుంటూ తమప నిలో నిమగ్నమై కాలాన్ని పరిసరాల్ని పూర్తిగా మర్చిపోయారు వాళ్ళు.

ప్రశాంతతకు, ప్రకృతి సౌందర్యానికి నిలయమైన ఆ అరణ్యం మృత్యుకుహరం అని పాపం వారికి తెలియదు. ఎంతసేపటినుంచో— తమని కొన్ని జతలకళ్ళు ఆబగా... ఆశగా... నకనకలాడుతున్న ఆకలి కడుపులతో గమనిస్తున్నాయని ఆ అమాయకులెరుగరు... మరి కొన్ని క్షణాల్లో తామిద్దరు ప్రకృతి మాత చల్లని వడిలో నుంచి మృత్యుదేవత వెచ్చని కౌగిలిలోకి వెళ్లబోతున్నామని వారు ఊహించుకోలేదు...

ఆ భయంకర క్షణం రానే వచ్చింది— కమ్మని కబుర్లు చెప్పుకుంటున్న ఆ నవ దంపతులపై అప్పటివరకూ అవకాశం కోసం ఎదురుచూస్తూ పక్కపొదల్లో మాటువేసిన క్రూరమృగాలు దూకాయి.

అప్పటివరకూ ప్రశాంతంగా ఉన్న ప్రదేశం సింహం గర్జనలతో, మానవుల ఆర్తనాదాలతో మార్మోగిపోయింది... మరికొన్ని క్షణాలలో వారి రెండు శరీరాలూ ముక్కలు ముక్కలై ఆ ప్రదేశమంతా పరుచుకున్నాయి. రక్తం అక్కడ మడుగులు కట్టింది...

అప్పటివరకు కళకళలాడుతూ నవ్వుల్తో, కేరింతలతో ఆ ప్రదేశానికి వన్నెచిన్నెలు చేకూర్చిన ఆ దంపతులు కేవలం కొన్ని నిముషాలలోనే ఖండఖండాలై అక్కడ పడి వున్నారు...

ఆ భయంకర దృశ్యం చూస్తే ఎంతటి ధైర్యశాలికైనా ఒళ్ళు జలదరించక మానదు.

కానీ- అది నిజంగా అరణ్యం, వాళ్ళు మనుషులూ అనుకుంటే మాత్రం మీరు పప్పులో కాలేసినట్లే! విల్ట్‌షైర్ సఫారీ పార్కులో ఇలాంటి దృశ్యాలు కోకొల్లలు. సింహాల కోసం కేటాయించిన 600 ఎకరాల విస్తీర్ణంగల ప్రదేశంలో యాజమాన్యం నిషేధాజ్ఞల్ని ఉల్లంఘించి అక్కడ కార్లు పార్కింగ్ చేయడం, కారు కిటికీలు తెరిచి మోచేతులు బయటకు పెట్టి కూర్చోడం చేస్తున్నారు సందర్శకులు.

సందర్శకులు కనబరిచే ఆ నిర్లక్ష్యతావైఖరి కారణంగా ఏటా 5 లక్షలమంది జనం సందర్శించే ఆపార్కులో ఎన్నో ప్రమాదాలు జరుగుతున్నాయి. అధికారుల హెచ్చరికలు పెడచె




విన పెట్టడం, ప్రమాదాలు కొని తెచ్చుకోవడం అక్కడ మామూలైపోయింది.

అటువంటి ప్రమాదాల్ని నివారించడంలో భాగంగా- పార్క్ అధికారులు 'సింహం నోట్లో తలదూర్చడం ఎంత ప్రమాదమో' సందర్శకులకు తెలియచెప్పేందుకుగాను పైన ఉదహరించిన ప్రదర్శనల్ని ప్రయోగిస్తున్నారు.

అచ్చం మనుమల్లా తయారుచేసిన డానీ, డ్యానియల్ అనే మగా ఆడ బొమ్మల్ని కారు బాగు చేస్తున్నట్లుగా పార్క్‌లో ఓచోట ఉంచారు. దట్టమైన భద్రతా ఏర్పాట్లమధ్య సఫారీ వ్యాన్స్‌లో కూర్చుని వందలాది మంది సందర్శకులు చూస్తుండగా గంభీరంగా ఆబొమ్మల్ని సమీపించాయి భీకర కంఠీరవాలు. నిజమైన మనుమలే అని భావించి ఒక్కసారిగా అన్నీ వాటిపైకి లంఘించాయి- భూనభోంతరాళాలు దద్దరిల్లేలా గర్జిస్తూ.

ఒక మృగరాజు విసిరిన పంజాదెబ్బకు మూడు ముక్కలై తెగిపడింది ఆడబొమ్మ. అలా క్షణాల మీద రెండు బొమ్మలూ నామరూపాల్లేకుండా పోయాయి. ఆదృశ్యాన్ని చూసిన జనం భయంతో గుండెలపై చెయ్యి వేసుకున్నారు.

"అధికారుల సూచనల్ని నిర్లక్ష్యం చేస్తే పర్యవసానం ఎలా ఉంటుందో ప్రత్యక్షంగా చూశాకనయినా సందర్శకులు జాగ్రత్తపడతారనే ఉద్దేశంతోనే ఇలాంటి ప్రదర్శనలు ఏర్పాటు చేస్తున్నాం'' అంటున్నాడు పార్క్ జనరల్ మేనేజర్ రాగర్‌కౌలీ. ఈ ప్రయోగఫలితాలు ఏవిధంగా పరిణమిస్తాయో కాలమే నిర్ణయించాలి.

## విదేశీ మోజు

**నోబుల్** బహుమతిగ్రహీత హరగోబింద్ ఖొరానా భారతదేశం వదిలి వెళ్ళి, అమెరికా వారసత్వం ఎందుకు తీసుకున్నాడు? అమెరికా పౌరసత్వం తీసుకున్నాకే ఆయన నోబుల్ బహుమతి పొందగల పరిశోధనలు చేయగలిగాడు. సి.వి. రామన్ మేనల్లుడు చంద్రశేఖరన్ అమెరికాలో ఎందుకు స్థిరపడ్డాడు? ఇండియాలోనే వుండి సి.వి. రామన్ నోబుల్ బహుమతి పొందగలిగాడు కానీ తనకా అవకాశం వచ్చే పరిస్థితులు ఇండియాలో ఉండకపోవచ్చుననే. మా పక్కింటి అప్పారావు దుబాయ్ ఎందుకు వెళ్లాడు? చేసేది చిన్న ఉద్యోగమే అయినా డబ్బులు పెద్దమొత్తంలో సంపాదించుకోవచ్చునని.

భారత జనాభా 80 కోట్లు. ఇందులో సుమారు 1 కోటి 16 లక్షల 50 వేల మంది విదేశాలలో స్థిరపడాలనీ; ఉద్యోగాలు చేసుకుందామనీ వెళ్లినవాళ్ళే. వీరిలో 74 లక్షల మంది ఆయా దేశాల పౌరసత్వం కూడా తీసేసుకున్నారు. ప్రతి 15 భారతీయ కుటుంబాలకు ఒక వ్యక్తి చొప్పున విదేశాలలో వున్నారంటే విదేశీ మోజు ఎంతగా పెరిగిపోయిందో తెలుసుకోవచ్చు.

"విదేశీయులు మనదేశానికి వచ్చి, మన సంస్కృతి నేర్చుకుని వెడుతుంటే, మీకిదేం బుద్ధి?'' అంటే, "ఆయా విదేశీయుల్ని వాళ్ళ దేశంలో ఇలాగే అంటుంటారు'' అని జవాబు. భారతదేశంలాంటి బీదదేశాల ప్రజలు విదేశాలో స్థిరపడటానికి "ఏదేశమో ఏగి, ఎచటనో కాలిడి, వదిలితే చాలు భూమి భారతిని'' అనుకోవటానికి మట్టుకు కారణం ఆయా దేశాల సంస్కృతి కాదు. వ్యక్తిగత ప్రతిభను గుర్తించలేని మన వ్యవస్థ, నిరుద్యోగాన్ని రూపుమాపలేని మన ఆర్థిక పరిస్థితులూ, మానవ సహజమైన ఆశ, వ్యక్తి సహజమైన అభిలాష- ఇవీ కారణాలు.

నేపాల్, మలేషియా, శ్రీలంకల తరువాత భారతీయుల్ని అధికంగా ఆకర్షించిన దేశం ఇంగ్లండు. సుమారు 7 లక్షల 20 వేల మంది భారతీయులు ఇంగ్లండుకు వలస వెళ్లారు. అందులో సుమారు 3 లక్షల 60 వేల మంది అక్కడి పౌరసత్వం తీసుకున్నారు. మనదేశంలో బ్రిటిష్ పాలన వలన కలిగిన చారిత్రక సంబంధాల దృష్ట్యా భారతీయులకు ఆంగ్లేయులు ఆత్మీయులుగా అనిపించి ఉండవచ్చు. సభ్యతకూ, సంస్కృతికీ ఆంగ్లేయులు మారుపేరని కూడా ఈ ప్రవాస భారతీయులు చెబుతుంటారు. అంతేకాదు, ఒకప్పుడు "సూర్యుడస్తమించని మహా సామ్రాజ్యం''గా పేరొందిన ఇంగ్లండులో వారి ఒకనాటి వలస రాజ్యాల ప్రజలు విరివిగా కనిపిస్తుంటారు. వీరిలో భారత- పాక్ ప్రజలతో పాటు వెస్ట్



ఇండీస్, ఆఫ్రికావంటి వలస రాజ్యాల ప్రజలూ కనిపిస్తుంటారు. వీళ్ళందరితోనూ ఆంగ్లేయులు కలుపుగోలుగా ఉంటారని చెబుతారు.

ఇంగ్లండు గురించి ఒక మాట ప్రత్యేకంగా చెప్పుకోవచ్చు. ఏ జాతివారైనా సరే, ఒకసారి బ్రిటిష్ పౌరసత్వం స్వీకరించిన తరువాత వారు ఇతరులతో సమాన హక్కులను కలిగి వుంటారు. భారతీయ ఆధ్యాత్మిక, సాంస్కృతిక సంప్రదాయాల పట్ల బ్రిటిష్ వారికి గల గౌరవమూ, ఆసక్తి కారణంగా వారు తమ దేశంలోవున్న భారతీయులను సమాదరిస్తారు. ఇందువలన కూడా భారతీయులకు ఇంగ్లండు పట్ల ఇష్టం పెరిగిపోయి, అక్కడ స్థిరపడే ఆసక్తిని కలిగిస్తుండవచ్చు.

ఇంగ్లండులోని చాలా విద్యాసంస్థల్లో భారతీయ భాషలు బోధిస్తారు. ముఖ్యంగా భారతీయులు ఎక్కువగా నివసించే ప్రాంతాల్లో భారతీయ భాషల ఆధిక్యత స్పష్టంగా కనిపిస్తుంది. హిందీ, గుజరాతీ, పంజాబీ, ఉర్దూ వంటి భారతీయ భాషలు, ఇంగ్లండు ప్రాంతీయ భాషలనిపించేటంత విరివిగా అక్కడ విలసిల్లుతున్నాయి. సహజమైన విజ్ఞాన తృష్ణతోనూ, ఆసక్తితోనూ ఆంగ్లేయులు భారతీయ భాషలు నేర్చుకోవటానికి మక్కువ చూపిస్తుంటారు. ఈ కారణంగా ఇక్కడి భారతీయులలో తాము మరో దేశస్తులమనే భావన కలిగే ఆస్కారం లేదు. అంతేకాదు, భారతీయుల ఆహార పదార్థాలు, మసాలా దినుసులు, ఇతర సామాగ్రి, కూరగాయలు, భారతీయ సంప్రదాయ దుస్తులు- అన్నీ ఇంగ్లండ్‌లో లభిస్తున్నాయి. ఫేషన్ దృష్టితోనో మరో దృష్టితోనో మొత్తానికి ఆంగ్లేయులు కూడా చీరలు, లాల్చీ, పైజమాలూ వంటి భారతీయ దుస్తులకూ, భారతీయ వంటకాలకూ ప్రాధాన్యతనిస్తున్నారు. అందువల్ల ఇక్కడి భారతీయులకు ఆహార నియమాలలో ఇబ్బందులు కానీ, సంప్రదాయాలను పాటించటంలో మొహమాటాలు కానీ వుండటంలేదు.

ఇప్పటి వరకూ ఇంగ్లండ్‌లో ప్రజాస్వామ్యం ఇంకా బతికివుంది. సామాజిక నైతిక విలువలు నిలిచివున్నాయి. మనదేశంలో ఇదే కరువయ్యింది. వాళ్ళు ఉపాధ్యాయులను గౌరవిస్తారు. వాళ్ల ఉపాధ్యాయులు కూడా పిల్లల పట్ల వ్యక్తిగత శ్రద్ధ చూపిస్తారు. వాళ్ల తల్లిదండ్రులతో సమస్యలను చర్చిస్తారు. కుటుంబ సభ్యులుగా కలిసిపోతారు. చాలా పాశ్చాత్య దేశాల్లో లాగే ఇంగ్లండులో కూడా వృద్ధులపట్ల గౌరవం చూపిస్తారు. వాళ్ళని 'సీనియర్ సిటిజన్స్'గా సమాదరిస్తారు. అనేక ఆర్థికలావాదేవీల్లో వృద్ధులకు రాయితీలు లభిస్తాయి. విద్యార్థులకు స్కాలర్‌షిప్పులు ఇస్తారు. అందువల్ల చదువుకోవటం సమస్య కాదు. నిరుద్యోగులకు భృతి ఇస్తారు. అందువల్ల వారు ఉద్యోగం దొరికే వరకూ మనోస్థయిర్యం కోల్పోయే పనిలేదు. ముఖ్యంగా, ఆంగ్లేయుల జీవన విధానంలో ఒక సక్రమమైన, సమంజసమైన పద్ధతి కనిపిస్తుంది. అది భారతదేశంలోలేదు. ఇది ఎక్కువగా ఆకర్షించే విషయం.

విశ్వరూపాయ 'రూపాయే' అన్నట్టు- ముఖ్యమైనది ఆర్థిక వెసులుబాటు. హొటల్లో క్లీనర్‌గా పనిచేసేవారు కూడా కారు, టెలివిజన్, టెలిఫోన్, వీడియో, రిఫ్రిజిరేటర్ వంటి సౌకర్యాలను సులభంగా సమకూర్చుకోగలరు. మనదేశంలో ఉన్నతస్థాయి ఉద్యోగులకు కూడా ఇవి సుదూర స్వప్నాలే. కష్టానికి తగినంత ఫలితం, సుఖమయమైన జీవితం, ప్రతిభకు గుర్తింపు, గుర్తింపు పొందినవారికి రాణింపు -ఇంతకన్నా ఏం కావాలి కనుక? ఇంగ్లండులో స్థిరపడిన ఏ భారతీయుడ్నైనా సరే, మళ్ళీ ఇండియా వెళ్ళే ఆలోచన వుందా అనడిగితే, తడుముకోకుండా "లేదు" అని చెబుతారు.

ఇంగ్లండులో స్థిరపడిన విదేశీయులు వారి ఆర్థిక రంగంలో కొంత సంక్షోభం కలిగిస్తున్నారు. పరాయివాళ్ళు తమ జాతి సంపదను అనుభవిస్తున్నందుకు ఆంగ్లేయ యువతరం కినుక వహించి నిరసన తెలుపుతున్న సంఘటనలు కూడా లేకపోలేదు. "బంధువులకు దూరంగా ఇలా వుండటం మీకెలా అనిపిస్తున్నది?" అంటే, "కొంచెం బాధగానే వుంది. అందుకే మా వాళ్ళను ఇక్కడికి రప్పించే ప్రయత్నాలు చేస్తున్నాను" అన్నాడు ఓ భారతీయుడు.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 229428. Office Address: CHATURA Telugu Monthly Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel. Hyderabad: 223422, 229444, Madras 470434, Vijayawada 52685, Visakhapatnam 52211, Tirupati 5291.

